# శ్రీవాణి నూతన సంవత్సర శుభాకాంక్షలు.

## 1987 క్యాలెండర్

| జనవరి | ఫిబ్రవరి | మార్చి | ఏప్రిల్ | మే | జూన్ | | | | | | జూలై | ఆగష్టు | సెప్టెంబర్ | అక్టోబర్ | నవంబర్ | డిసెంబర్ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 31 | 28 | 31 | 30 | 31 | 30 | | | | | | 31 | 31 | 30 | 31 | 30 | 31 |
| గురు | ఆది | ఆది | బుధ | శుక్ర | సోమ | 1 | 8 | 15 | 22 | 29 | బుధ | శని | మంగ | గురు | ఆది | మంగ |
| శుక్ర | సోమ | సోమ | గురు | శని | మంగ | 2 | 9 | 16 | 23 | 30 | గురు | ఆది | బుధ | శుక్ర | సోమ | బుధ |
| శని | మంగ | మంగ | శుక్ర | ఆది | బుధ | 3 | 10 | 17 | 24 | 31 | శుక్ర | సోమ | గురు | శని | మంగ | గురు |
| ఆది | బుధ | బుధ | శని | సోమ | గురు | 4 | 11 | 18 | 25 | ■ | శని | మంగ | శుక్ర | ఆది | బుధ | శుక్ర |
| సోమ | గురు | గురు | ఆది | మంగ | శుక్ర | 5 | 12 | 19 | 26 | ■ | ఆది | బుధ | శని | సోమ | గురు | శని |
| మంగ | శుక్ర | శుక్ర | సోమ | బుధ | శని | 6 | 13 | 20 | 27 | ■ | సోమ | గురు | ఆది | మంగ | శుక్ర | ఆది |
| బుధ | శని | శని | మంగ | గురు | ఆది | 7 | 14 | 21 | 28 | ■ | మంగ | శుక్ర | సోమ | బుధ | శని | సోమ |

కూర్పు:- SN.దుర్గారావు



కోనేరు రామచంద్రరావు, ఆహ్వానసంఘం అధ్యక్షులు
డైరక్టర్, శ్రీ వాణీ నికేతన్, విజయవాడ



శ్రీ యద్దనపూడి చిరంజీవరావు, ఆహ్వానసంఘ కార్యదర్శి
కార్యదర్శి, విజయవాడ ఛాంబర్ ఆఫ్ కామర్స్ & ఇండస్ట్రీస్

# శ్రీవాణి జీవిత సభ్యులు



డా. పోలవరపు సుబ్బారావు, విజయవాడ



Ln. A.V. శర్మ, M.A., LL.M.,
అడ్వొకేట్, విజయవాడ



డా. T.V.A.S. శర్మ, విజయవాడ



శ్రీ అన్నే హనుమంతరావు, ఉయ్యూరు



శ్రీ A. V. రంగారావు, ప్రిన్సిపాల్,
విశ్వశాంతి పబ్లిక్ స్కూల్,
గుణదల, విజయవాడ



శ్రీ G.R.K. ఆర్య, అడ్వొకేట్, విజయవా



శ్రీ T,V. పురుషోత్తమరావు,
అడ్వొకేట్, విజయవాడ



శ్రీ Y.S.H. ప్రసాద్,
జబల్ పూర్ (మధ్య ప్రదేశ్)



శ్రీమతి దురాకుమారి,
జబల్ పూర్ (మధ్య ప్రదేశ్)



శ్రీ కర్నాటి రామమోహనరావు,
అడ్వొకేట్, విజయవాడ



శ్రీ తమ్మిన నరశింహారావు, అధ్యక్షులు
ది. దుర్గా కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్, విజయవాడ



శ్రీ ఆకెళ్ల వెంకటరామమూర్తి, M.A.,
రిటైర్డ్ డిప్యూటీ కలక్టర్, శ్రీకాకుళం



శ్రీ కొంకిమళ్ల కృష్ణమూర్తి,
క్లాత్ మర్చంట్, జగ్గయ్యపేట



శ్రీ మాదిరాజు గోవిందశర్మ,
B.Sc., B.Ed.. జగ్గయ్యపేట



శ్రీ చతుర్వేదుల ఉమామహేశ్వరరా
మూర్తి మెడికల్స్, నందిగామ



కీ. శే. యెనిమిరెడ్డి చిక్కారెడ్డి జ్ఞాపకార్థం
శ్రీ యెనిమిరెడ్డి జగన్నాథరెడ్డి విరాళం (నందిగామ)



కీ. శే. జూపూడి నరశింహారావు జ్ఞాపకార్థం
శ్రీ జూపూడి హనుమంతప్రసాద్ విరాళం (ఖమ్మం)



శ్రీమతి టి. పద్మకుమారి, B.A., ప్రిన్సి
విజయ పబ్లిక్ స్కూల్, విజయవాడ-



'రిపర్తి నరసింహరాజు, S/o వెంకటసుబ్బయ్య
ృష్ణా థియేటర్, మచిలీపట్నం



శ్రీ చింతలపాటి వెంకటశివరామకృష్ణ,
అడ్వొకేట్, విజయవాడ



శ్రీ మొర్నెని రామకృష్ణబాబు, విజయవాడ



డా. చిత్తర్వు బాపూజి, B.Sc., M.B B.S.,
మచిలీపట్నం



శ్రీ వై. లోకనాధశర్మ. అడ్వొకేట్, విజయవాడ



శ్రీ వల్లూరు వెంకటేశ్వరరావు, పటమటలం



శ్రీ జె. రాఘవేంద్రరావు,
శ్రీ దుర్గా కెజిల్ హౌస్, విజయవాడ



శ్రీ తుర్లపాటి హనుమంతరావు,
అడ్వొకేట్, విజయవాడ



శ్రీ కొత్తా పూర్ణానందం,
చార్టర్డ్ అకౌంటెంట్, విజయవాడ

# "శ్రీవాణి" జీవిత సభ్యులు



శ్రీ ఎస్.వి.ఆర్ జి. నరసింహారావు
మైలవరం



శ్రీ పర్చూరి రాధాకృష్ణమూర్తి
మిల్లర్, మచిలీపట్నం



శ్రీ హెచ్. టి. మురళీధరరావు
మోడరన్ కేఫ్, విజయవాడ



శ్రీ జమ్ముల వెంకటేశ్వర్లు
మిల్లర్, నందిగామ



శ్రీ పబ్బతి సత్యనారాయణ
మిల్లర్, నందిగామ



శ్రీ కొల్లూరి రామకృష్ణారావు
మచిలీపట్నం



శ్రీ తూరపాటి కృష్ణమూర్తి
ఎల్. ఐ. సి. ఏజెంటు, విజయవాడ-1



శ్రీ మెంటా మస్తాన్‌రావు
విజయవాడ 1



శ్రీ యార్లగడ్డ రాజగోపాలరావు
విజయవాడ

# "శ్రీవాణి" జీవిత సభ్యులు


శ్రీ యం. మోహనరావు
విజయవాడ


శ్రీ కొమ్మా వెంకటరంగారావు
పటమటలంక


శ్రీ కాశీపట్నం సుందరరామమూర్తి
అడ్వకేటు, మచిలీపట్నం


శ్రీ యం. వెంకటరెడ్డి
డ్రగ్ ఇనస్పెక్టర్ (కృష్ణ)
మచిలీపట్నం


శ్రీ సిహెచ్. రామారావు
ప్రొప్రయిటర్ : రావు & బ్రదర్స్
విజయవాడ - 2


శ్రీ జవ్వాజి రామస్వామిగుప్త
సెక్రటరి, ది బెజవాడ కమర్షియల్
అసోసియేషన్, విజయవాడ-1

శ్రీ గద్దె రత్తయ్య
కమలేంద్ర ప్రింటింగ్ ప్రెస్, విజయవాడ

శ్రీ ఉపద్రష్ట వెంకటనారాయణ
గుడివాడ

శ్రీ జి. యస్. రాజు
సిరీస్ కంపెనీ, విజయవాడ

శ్రీ గొట్టిపాటి మురళీమోహన్
అడ్వకేటు, విజయవాడ

శ్రీ డి. వెంకటేశ్వర్లు
ఆర్. టి. ఓ. విజయవాడ

డా॥ సి. యస్. శాస్త్రి
విజయవాడ

శ్రీ గుండా సుబ్రహ్మణ్యం
మిల్లర్, జగ్గయ్యపేట

శ్రీ ఎ. వెంకటేశ్వరరావు
ప్రిన్సిపాల్, వాణి చిల్డ్రన్స్ కాన్వెంట్, విజయవాడ

## ది విజయవాడ కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమి

**పి. బి. నెం. 368, విజయవాడ - 520 002**

| డిపాజిట్టు స్కీములు | | | అమలులోవున్న రేట్లు |
|---|---|---|---|
| కరెంటు డిపాజిట్లు | ... | ... | 1/2 % |
| సేవింగ్సు డిపాజిట్లు | ... | ... | 5.5 % |

ఫిక్సెడు డిపాజిట్లు

| కాల పరిమితి | | | వడ్డీ శాతం |
|---|---|---|---|
| 15 రోజుల నుండి | 45 రోజులు వరకు | | 3.5 % |
| 46 ,, | 90 ,, | | 4.5 % |
| 91 ,, | 6 మాసముల లోపు | | 7 % |
| 6 మాసములు అంతకు పైబడి | 1 సం. లోపు | | 8.5 % |
| ఒక సం. ,, | 2 సం. లోపు | | 9 % |
| రెండు సం. ,, | 3 సం. లోపు | | 9.5 % |
| మూడు సం. ,, | 5 సం. లోపు | | 10.5 % |
| అయిదు సంవత్సరములు అంతకు పైబడి | | | 11.5 % |

రిజర్వు బ్యాంకువారి ఆదేశానుసారం వడ్డీ రేట్లు అమలులో వుండును.

నెలకు రూ 100/లు డిపాజిట్టు చేయండి-రూ 30,823/లు తిరిగి పొందండి

రూ 10,000/లు డిపాజిట్టు చేయండి-రూ 38,985/లు తిరిగి పొందండి.

**మీ కోసం.........మీ పిల్లల కోసం**

**పొదుపు చేయండి**

ఈ బ్యాంకులో నిల్వచేసిన సొమ్ముపై 1/2 శాతము అధిక వడ్డీ లభిస్తుంది.

| | |
|---|---|
| చనమోలు గోపాలరావు | యం. కోటయ్య |
| బి. కాం., హెచ్. డి. సి. | ఐ. ఏ. యస్. |
| జనరల్ మేనేజరు | జాయింటు కలక్టరు / ఛైర్మన్ |

జనవరి - 1987

సంపుటి : 3

సంచిక : 1

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు - కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

జనవరి 1987 నుండి

| | | |
|---|---|---|
| ప్రత్యేక సంచిక | : రు. | 5-00 |
| సంవత్సర చందా | : రు. | 36-00 |
| 2 సం॥ల చందా | : రు. | 66-00 |
| 4 సం॥ల చందా | : రు. | 116-00 |
| జీవిత సభ్యత్వం | : రు. | 500-00 |

EDITED, PRINTED &
PUBLISHED BY

**Komaragiri
Krishna Mohan Rao**

**Printed at**
SPANDANA PRINTERS
MACHILIPATNAM

## విషయ సూచిక


| | | |
|---|---|---|
| అమృతవాణి | - కూచిభట్ల చంద్రశేఖరశర్మ | 4 పుట |
| ఆత్మజ్ఞాన విచారణే సనాతన ధర్మం | - శ్రీ సత్యసాయిబాబా | 5 |
| మకర సంక్రాన్తి | - భాగవతుల కుటుంబరావు | 14 |
| బాబా సన్నిధిలో మధురక్షణాలు | - కొమరగిరి | 18 |
| జ్యోతిషవాణి | - కవితా కామేశ్వరశర్మ | 21 |
| అతిధి (కథ) | - మల్లాది వెంకటకృష్ణమూర్తి | 22 |
| వైద్యవాణి | - యస్. యన్. దుర్గారావు | 27 |
| క్ష్వేలావళి | - డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు | 28 |
| విజయవాటీ కనకదుర్గ | - పైడిపాటి సుబ్బరామశాస్త్రి | 30 |
| ప్రవాహణుడు - శ్వేతకేతువు | - సి. వేదవతి | 36 |
| సాహిత్యము - జీవిత సాహిత్యం | - ముంగర జాషువ | 38 |
| హ్యూమానిటీ ఫర్ సేల్ (సీరియల్) | - డా॥ ముదిగొండ శివప్రసాద్ | 42 |
| సత్యం శివం సుందరం | - శ్రీ స్వామీజీ భూమాత్మానంద సరస్వతి | 46 |
| పుస్తక సమీక్ష | - మంగళగిరి ప్రమీలాదేవి | 51 |
| ధృతరాష్ట్రుని ఆవేదన | - వడలి మందేశ్వరరావు | 53 |
| మారని నోటు (కధ) | - ఇల్లిందల సరస్వతీదేవి | 58 |
| డా॥ సునీతికుమార ఛటర్జీ | - జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 64 |
| రంజనిమాల | - డా॥ వి. ఫణీంద్రుడు | 68 |
| ఎర్రత్రికోణం | - ఎస్సారే | 70 |
| విచిత్ర మిత్రుడు | - పుచ్చా పూర్ణానందం | 72 |
| జ్ఞానోదయం (మినీకథ) | - వజ్రాయుధ | 74 |
| బాలవాణి | - సోమంచి రామం | 76 |
| దేవుడు ఉన్నాడు | - త్రివిక్రమ రామానందభారతీస్వామి | 78 |
| స్త్రీని గౌరవించని కవి | - జొన్నలగడ్డ లలితాదేవి | 82 |
| పిల్లలలో చదివే అలవాట్లు పెద్దల బాధ్యత | - కె. ఆర్. కె. మోహన్ | 84 |
| మనసుకు వచ్చే జబ్బులు | - డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి | 88 |

# సంపాదకీయం ప్రత్యామ్నాయం ఏది?

జాతీయ స్థాయిలో మాదే ప్రత్యామ్నాయం అని ఒక చంప బి. జె. పి. వారు, మరొక చంప జనతా పార్టీవారు ప్రగల్భాలు పలుకుతున్నారు. కమ్యూనిష్టులకు వారి పరిస్థితి ఏమిటో వారికి తెలుసు కాబట్టి వారు ఈ విషయంలో నోరు మెదపడంలేదు. అయితే ఉభయ కమ్యూనిష్టు పార్టీలు కలిస్తే వామ పక్ష ప్రత్యామ్నాయం ఏర్పడటం ఖాయమని వారు చెబుతున్నారు. వీరిద్దరు కలవడం అసంభవం. జనతా పార్టి హెగ్డే ప్రభావంతో కర్ణాటకలో అధికారాన్ని నిలబెట్టుకుంటున్నది. జిల్లాపరిషత్ లలో కూడా మెజారిటీని సంపాదించింది. ప్రస్తుత పార్లమెంటులో ఏ జాతీయ ప్రతిపక్ష పార్టీకి చెప్పుకోదగ్గ ప్రాతినిధ్యం లేదు. ప్రాంతీయ పార్టీ అయిన తెలుగుదేశం ప్రతిపక్ష స్థానాన్ని అలంకరించింది. మార్క్సిస్టు పార్టి వివిధ ప్రాంతీయ పార్టీలతో చేతులు కలిపి పశ్చిమ బెంగాల్‌లో అధికారాన్ని నిలబెట్టుకుంటున్నది. ఆంధ్రప్రదేశ్, తమిళనాడ్, అస్సాం, జమ్ము కాశ్మీర్, పంజాబ్‌లలో ప్రాంతీయ పార్టీలదే పై చేయి. జాతీయ ప్రతిపక్ష పార్టీలకు ప. బెంగాల్, కర్ణాటక మినహాయిస్తే ఏ రాష్ట్రంలోను అధికారయోగం పట్టలేదు. అయినప్పటికీ ప్రత్యామ్నాయం మాది అంటే మాది అని ప్రకటనలు చేస్తున్నారు. ప్రత్యామ్నాయం వుండటం మంచిదని ప్రజాస్వామ్యవాదులు భావిస్తున్నారు. అయితే ప్రస్తుత పరిస్థితులలో ఇది సాధ్యమా?

ఇకపోతే మన రాష్ట్ర రాజకీయాలను పరిశీలిద్దాం. మూడవ రాజకీయ శక్తిగా రూపొందడానికి ప్రయత్నిస్తున్నామని బి. జె. పి. వారు చెబుతున్నారు. రాజకీయాలలో మూడవ శక్తికి అవకాశం లభించడం కష్టం. మొదటి రెండు శక్తులలో ఏదో ఒకదానిని ఓటర్లు వరిస్తారు. ఎంత మంచిదని భావించినా మూడవ శక్తిని ఎన్నికలలో ఎవరూ గుర్తించరు. ఇది గత అనుభవం.

లోకనాయక్ జె. పి. నేతృత్వంలో జనతా పార్టి ఆవిర్భవించడం వలన కాంగ్రెసును ఆనాడు గద్దె దించగలిగింది. దురదృష్టవశాత్తు నాయకుల స్వార్థం వలన, అధికార వ్యామోహ పీడితులవడం వలన ఆనాడు జనతా ప్రభుత్వం పతనమైంది. ప్రజాస్వామ్యవాదుల ఆశలు అడియాశలైనాయి అధికార వ్యామోహపరులు కొంతమంది వివిధ ప్రాంతీయ పార్టీలలోను, కాంగ్రెసులోను దూరి నేడు అధికారాలను అనుభవిస్తున్నారు. అధికారమే పరమావధి కాదని భావించినవారు మాత్రం జాతీయ ప్రతిపక్ష పార్టీలను పట్టుకొని ఆశ చావక వ్రేలాడుతున్నారు. ఈనాటికీ జాతీయ ప్రతిపక్షాలు ఏకం కాగలుగుతే కాంగ్రెసును గద్దె దింపగలుగుతాయనడంలో ఏమాత్రం సందేహం లేదు. ఇది జరగడం అసంభవం. ఒకవేళ జరిగినా గత జనతా చేదు అనుభవం తిరిగి పునరావృతం కాకుండా వుండదని ఎవరూ చెప్పలేరు. జాతీయ ప్రతిపక్షాల మధ్య ఐక్యతను సాధించడం కష్టమని భావించి, అధికార వ్యామోహం వదలక శరద్‌పవార్‌లాంటి నాయకులు కాంగ్రెసు ముసుగులో దూరుతున్నారు. వివిధ ప్రాంతీయ పార్టీలను వలలో వేసుకొని శాసనసభా సీట్లను వారికిచ్చి, లోక్‌సభ సీట్లను తాము తీసుకొని కేంద్రంలో అధికారాన్ని నిలబెట్టుకుంటున్నది కాంగ్రెసు. భవిష్యత్తులో మన రాష్ట్ర రాజకీయాలు కూడా ఆ విధంగా మరలినా ఆశ్చర్యపడనవసరంలేదు.

జాతీయ ప్రతిపక్ష నాయకులు కాంగ్రెసుపై చేస్తున్న విమర్శనలు, వివిధ రాష్ట్రములలోనున్న బలమైన ప్రాంతీయ పార్టీలకు బాగా ఉపయోగపడుతున్నాయి తెలుగుదేశం ఆ విధంగానే అధికారంలోనికి రాగలిగింది. జాతీయ ప్రతిపక్షాలు మాత్రం మన రాష్ట్రంలో ఘోర పరాజయాన్ని చవిచూచాయి.

ఉన్న జాతీయ ప్రతిపక్షాలలో కార్యకర్తలు కలిగిన పార్టి బి జె పి. అనడంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. అయితే అధికారాన్ని సంపాదించే సత్తా మాత్రం వారికి వున్నట్లుగా కనిపించడంలేదు. కార్యకర్తలు చెదిరిపోకుండా ఆకట్టుకోవడానికి జాతీయ ప్రతిపక్షాల నాయకుల వాదన ఉపయోగపడితే ఉపయోగపడవచ్చునేమో గాని, అధికార ప్రాప్తికి మాత్రం కాదు. కేంద్రంలో కాంగ్రెసుకు వ్యతిరేకంగా, వివిధ ప్రాంతీయ పార్టీలతో చేతులు కలుపుతూ; వివిధ రాష్ట్రములలో అధికారంలోనున్న ప్రాంతీయ పార్టీలకు వ్యతిరేకంగా కాంగ్రెసుతో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జాతీయ ప్రతిపక్షాలు చేతులు కలుపుతున్నాయి. ఈ ద్వంద్వ విధానం ఏమిటో అర్థంకాక ఓటర్లు సతమతమవుతున్నారు. జాతీయ ప్రతిపక్ష పార్టీల మధ్య అనైక్యతే కాంగ్రెసుకు వరప్రసాదం. అంతేకాదు రాష్ట్రముల స్థానిక సమస్యలను పట్టించుకోకుండా, దేశ విదేశీ రాజకీయాలమీదనే జాతీయ ప్రతిపక్షాలు ఎక్కువ శ్రద్ధ వహించడం వలన ప్రాంతీయ పార్టీలకు ప్రోత్సాహం ఓటర్లనుండి లభిస్తున్నది. ఇది ఈనాటి దుస్థితి. ఇది ఏనాటికి మారుతుందో! ఈ పరిస్థితి మారి కాంగ్రెసుకు ప్రత్యామ్నాయం జాతీయ స్థాయిలో ఆవిర్భవిస్తే సంతోషించదగ విషయమే.

# ఒక్క క్షణం ఆలోచించండి!

అందరికీ నమస్కరించి.....

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అనుగ్రహంతోను, ప్రకటనదారుల ప్రోత్సాహంతోను ; ఉదారులైన పెద్దల సహకారం (జీవిత సభ్యులుగ) తోను ; రచయితల అమూల్యమైన రచనలతోను, పాఠకుల ఆదరాభిమానములతోను, స్పందన ప్రింటర్స్, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, పూర్ణ కనకమహాలక్ష్మి బైండింగ్ వర్క్సుల సహకారంతోను గత 2 సంవత్సరాలలో 24 సంచికలు క్రమం తప్పకుండాను, మరిప్పుడు ప్రత్యేక సంచికను సకాలంలో తెలుగు వారికి అందించగలిగాను. వారలకు నా అభినందనలు.

డిశంబరు 86 సంచికలో నేను చేసిన విజ్ఞప్తికి స్పందించి ఎందరో పెద్దలు చందాలను పంపించినారు. వారలకు నా ధన్యవాదములు. అయితే చందాలు చెల్లించవలసినవారు ఇంకా వందల సంఖ్యలో ఉన్నారు. వారి మనసులలో చందా పంపించాలనే ఉంటుంది. అయితే పనుల భారంలో మునిగిపోయి మరచిపోవడం సహజం. అంతే తప్ప వేరే భావన వారిలో లేదని నాకు బాగా తెలుసు. ఈ రెండు సంవత్సరాల కాలంలో ముగ్గురే ముగ్గురు 'శ్రీవాణి' వద్దని వ్రాసినవారు. తమ భావాలను స్పష్టం చేసినందుకు వారికికూడా నా ధన్యవాదములు.

ఒక్క క్షణం ఆలోచించండి ! పత్రిక అందుతున్న వారందరూ చందాలు చెల్లించినప్పటికీ నేను నష్టం బారినుండి తప్పించుకోలేను. అందులో పేపరురేట్లు, ప్రింటింగ్‌రేట్లు, బ్లాకురేట్లు విపరీతంగా పెరిగిపోతున్నాయి. ప్రతి నెలా 52 పేజీలతోను, ప్రత్యేక సంచికలు (మూడు ప్రత్యేక సంచికలు ముద్రించాం) 130 పేజీలతోను తీసుకొని రావడం ఎంత కష్టమో సహృదయంతో ఆలోచించి సహకారం అందిస్తారని ఆశిస్తున్నాను. ఈనాడు ఉత్తమ ఆశయ ఆదర్శములతో నడుపబడుతున్న పత్రికలే బహు కొద్ది. వాటికి కూడా పాఠకుల ప్రోత్సాహం లభించకపోతే ఏం కావాలి ? ఆలోచించండి !

శ్రీవాణి వెల రు 3 మాత్రమే. ఒక్క పర్యాయం కాఫీహోటల్‌కి వెళ్ళితే అయ్యే ఖర్చుకన్నా తక్కువే. నెలకు మూడు రూపాయలు. ఒక మంచి ప్రయత్నానికి సహకారం అందించలేరా ? జీవితంలో మనం ఎన్నో ఖర్చులు చేస్తుంటాం. అటువంటప్పుడు మన పవిత్రమైన సనాతన ధర్మాన్ని ప్రచారం చేస్తున్న, సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞానములను అందిస్తున్నటువంటి 'శ్రీవాణి' కి సహకారం అందించడం న్యాయం కాదా ? నా వేదనను, ఆవేదననూ సహృదయంతో సదవగాహన చేసుకొని, తమ స్తోమతకు తగిన విధంగా సహకారం అందిస్తారని ఆశిస్తున్నాను, విశ్వసిస్తున్నాను, ప్రార్థిస్తున్నాను.

సంవత్సర చందా రు. 36-00     4 సం. చందా రు. 116-00

జీవిత చందా రు. 500-00 (శ్రీవాణిలో ఫొటోలు ముద్రించబడుతాయి)

ధన్యవాదములు

కొమ్మగిరి కృష్ణమోహనరావు

సంపాదకుడు

రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః
ఇత్థం విచింతయతి పద్మగతే ద్విరేఫే
హా! హంత! హంత! నళినీంగజఉజ్జహార ॥

అంటే–ఒక తుమ్మెద రకరకాల పూలమీద వ్రాలి తేనెలు జుర్రుకొంటూ ఒక సరస్సులో చక్కగా వికసించిన పద్మం మీద కూడా వ్రాలింది. మకరంద ఆస్వాదనంలో మైమరిచింది. ఇంతలో సాయంకాలమయింది. సూర్యాస్తమయం కూడా అయింది. మసక చీకట్లు పడుతున్నాయి. కాలాన్ని గుర్తించని తుమ్మెద తేనె త్రాగటంలోనే మునిగిపోయివుంది. మరి పద్మం అలాగే వుంటుందా? వుండదుగా. క్రమంగా ముకుళించుకొని పోయింది. తీరా అప్పటికి తెలివివచ్చి తుమ్మెద చూస్తే ఏముంది! దిగ్బంధమైంది. దేశకాలాలు గుర్తించక ఆశాపాశంలో చిక్కుకుంది పాపం. బయటపడే వీలులేదు మళ్ళీ తెల్లారాలి. తిరిగి పద్మం వికసించాలి. అప్పుడుగాని దానికి బంధ మోక్షం కలగదు.




ఆ రాత్రంతా ముకుళిత పద్మంలో చిక్కుకున్న తుమ్మెద యెదలో ఆశాలతలల్లుకొన్నాయి. ఇక ఇలా అనుకోటం ప్రారంభించింది.

ఈ రాత్రి యెలాగైనా గడిచి పోతుంది. తెల్లవారుతుంది. ఇది యిలాగే వుండదు. అలాగే సూర్యభగవానుడు కూడా ఉదయిస్తాడు. సూర్యరశ్మి తాకి యీ పద్మం ఎలాగైనా విచ్చుకుంటుంది. అప్పుడు హాయిగా బయట పడి కొంప చేరుకొని పెళ్ళాం బిడ్డల్ని చూచుకోవచ్చు. అని ఇలా తలపోస్తూ ఎట్లాగైతేనేమీ రాత్రి గడిపింది.

అయితే ఏం లాభం? సూర్యోదయం తొలూకు అరుణ రేఖలు పొటమరించకుండానే, ఆశలు పెంచుకొని ఆలోచిస్తూండగానే యెక్కడ నుంచో ఒక ఏనుగు వచ్చి సరస్సులో దిగింది. అంతతో ఆగకుండా ఆ మాయదారిది తుమ్మెద వున్న పద్మం యింకా వికసించకుండానే విలాసంగా తన తొండంతో, కాడతో సహా, ఆ పద్మాన్ని పీకి పారేసింది పాపం!

ఇంకేముంది! తుమ్మెద ఆశలు అడియాసలయిపోయినాయి. పైగా దాని బ్రతుకే బందలై పోయింది. ఇదే తానొకటి తలిస్తే దైవమొకటి తలవటమంటే.

మానవుడు కూడా తన యింద్రియాల వల్ల కలిగే సుఖం సుఖమనుకొని విషయాసక్తిలో ఆశాపాశంతో తన జీవితం ముడేసుకుంటాడు. క్షణికమైన సాంసారిక సుఖంలో రుచి మరిగి కర్తవ్యం మరచిపోతాడు. ఏదో తప్పి తలకెత్తుకోవాలని తాపత్రయ పడతాడు. కాని చివరి వరకు ఆ పరమార్థాన్ని తెల్సుకోకుండానే కన్నుమూస్తాడు. తీరా సాధించిందేమున్నట్లు? ఇదీ లోకంతీరు. కనుక మానవుడు వివేకరహితుడై నిరంతర విషయాసక్తుడై తన వునికినే తెల్సుకోలేకపోతే చివరికేమౌతుంది? అదిగో ఆ తుమ్మెద బ్రతుకే అవుతుంది. ★



# ఆత్మజ్ఞాన విచారణే సనాతన ధర్మం

ఖండ ఖండాంతర ఖ్యాతి నార్జించిన
మహనీయులను గన్న మాతృభూమి
ప్రాశ్చాత్య వీరుల పారద్రోలించియు
స్వాతంత్ర్యమును గన్న సమరభూమి
పాండిత్యమున చాల ప్రఖ్యాతి గాంచియు
ప్రతిభ చూపించిన భరతభూమి
సంగీత సాహిత్య శాస్త్రీయ విద్యల
దీక్ష చూపిన దివ్య భూమి
చిత్రకళల తోడ చిత్రమై యున్నట్టి
భరతభూమియందు జననమంది
భరతమాత ధర్మ భాగ్యంబు కాపాడ
బాధ్యతంత మీదె భక్తులార !

ప్రేమస్వరూపులారా !

భరతదేశంబు అరంజి పండు జాతియు, మతములు తొనలు. భిన్న తెగలును, వృత్తులు ఎన్ని ఉన్నా భరత దేశాన పుట్టుటే భాగ్యమగును కాదా ! మరి. జ్ఞానమును అందజేయు దివ్య జ్యోతులను వెలిగించు దేశమిదియే. అనాదికాలంనుండి ఆస్తికత్వాన్ని ప్రబోధిస్తూ ప్రచార ప్రబోధనలను గావిస్తూ వచ్చిన దేశం ఇదే. " లోకాస్సమస్తా సుఖినో భవంతు " అన్నదే హైందవ సాంప్రదాయం. ఇట్టి పవిత్ర భారత దేశమునందు జన్మించడం మన పూర్వజన్మ సుకృతం, అదృష్టం.

## విశ్వమే విష్ణుస్వరూపం

" సహస్ర శీర్ష పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్ " అన్ని శిరస్సులు, అన్ని నేత్రములు, అన్ని పాదములు, అతనియొక్క అంగములే. విశ్వమే విష్ణు స్వరూపం. ప్రతిపదార్థమునందును అస్తి, భాతి, ప్రియ, నామ, రూపము లనేటువంటి ఐదు తత్వములు కూడియున్నవి. సత్, చిత్, ఆనందములే మానవుని యొక్క నిజస్వరూపములు. నామరూపములు కల్పితములు. నిజముగా మానవత్వం చాలా పవిత్రమైనది, నిర్మలమైనది, నిస్వార్థమైనది. అయితే పాకృత దోషములు పట్టడం చేత మానవత్వంలో మాలిన్యం ఏర్పడుతో వచ్చింది. ఈ మాలిన్యం కేవలం మాటలతో తొలగించబడేది కాదు. మానవుని ఆవరించిన ఈ అజ్ఞానమును పోగొట్టునది ఒక్క ఆత్మజ్ఞానం మాత్రమే.

శ్రీసత్యసాయిబాబా

## దేహము నీటి బుడగ

మానవ దేహము ఒక నీటి బుడగ. మనకు లభించే సంతోషంగాని, ఆనందంగాని, సుఖముగాని, ఐశ్వర్యము గాని అంతా తాత్కాలికమే. వీటిని చూచి మనం మురిసిపోరాదు. సుఖ దుఃఖములు వచ్చిపోయే బంధువులు లాంటివి. సుఖమునకు ఎట్టి వికారమో, దుఃఖమునకు అట్టి వికారమే. ఈ రెండూ వికారములతో కూడినటువంటివే. ఇట్టి వికార స్వరూపములైనటువంటి భావములను ఆదరించి, వరించి, అసలు సత్యమైన నిత్యమైన స్వభావములను మరచుట మంచిది కాదు. తాత్కాలిక లౌకిక భోగ భాగ్యములకు లొంగి మానవత్వంలో వున్నటువంటి దివ్యత్వాన్ని విస్మరించడం అవివేక లక్షణం.

## అభినందనవా

ఒక యేడాది గడచె, నూ
త్నకళా స్ఫూర్తిన్ వహించి, నవతా భావో
త్సుకతం గన వత్తువు !! నీ
కిఁక దీర్ఘాయువని పలికెనే ।। స్వజనంబుల్

సుచరిత్రాంచితమున్ మహాంధ్ర జనతా శోభాకరం
బెంతయున్
ప్రబలత్శౌర్యనిధాన మార్యజన సం వాసంబు,
జాతీయతా
భ్యుచితాస్థానము, సంస్కృతి ప్రతిభ నెంతో యొప్పు
చున్నట్టి యా
మచిలీ పట్టణమా? త్వదీయమగు జన్మస్థాన మాహా!
శశీ !!

చీఁకటి తెరలం దొలఁచుచు
లోకమ్మున కొక్క క్రొత్త లోకమగపడన్
నీ కృషి గావించుచు, జా
లా ! కృష్ణ కటాక్ష రేఖలన్మనఁగదవే ।।

ప్రాఁత క్రొత్తల మేలి తరమ్ము నెంచి
సాహితీ సముద్దీప్తి ప్రశస్తి మించి
దేశపుం బ్రగతికి సముద్దేశముంచి
వర్ధిలఁగదమ్మ ! శ్రీవాణి ! పసిఁడి కొమ్మ !

మంచితనంబునకు, విశే
షించి తెలుఁగుఁ దనమునకు విశిష్టత వెలయన్
పంచవె !! విశాల భావో
దంచితవై క్రొత్త వెలుఁగులనాంధ్రంబందున్

— డా॥ చేబోలు చిన్మయ బ్రహ్మారవి

---

### ఆత్మజ్ఞానం

ఆత్మజ్ఞాన విచారణే సనాతన ధర్మం. ఇట్టి సనాతన ధర్మమును అనుసరించడమే జీవుని కర్తవ్యం. ఈ దేహము ఏదో ఒక రోజున అంతమయ్యేటటువంటిదే. పంచభూతములు పాంచ భౌతిక దేహమును బాధించ వచ్చునుగాని, పంచభూతములకు అతీతమైన ఆత్మతత్వాన్ని ఇవి ఏమాత్రం కదిలించలేవు.

### మానవుడు

మానవుడనగా విశ్వాసం కలిగినటువంటివాడు. పవిత్రమైనటువంటిది మానవత్వం. లక్ష్యమును వీడక, మానవత్వమును సార్థకత్వం గావించుకోవడమే మన కర్తవ్యం. శరీరము, మనస్సు, ఆత్మల కూడికయే మానవత్వం. ఈ మూడు మానవుని స్వభావమును నిరూపించుచున్నవి. మానవత్వాన్ని వున్నత స్థితికి గొనిపోవుచున్నవి. వీటినే చేయుట, తెలుసుకొనుట, ఉండుట అని వీటి యొక్క అర్థం. 1. చేయుట అనగా "శరీర మాద్యం ఖలు ధర్మ సాధకం" ఈ శరీరము చేతనే అన్ని కర్మ ధర్మములు ఆచరించుతూ, అనుస రించుతూ వస్తున్నాయి. దేహమే లేకుండిన ఎట్టి ధర్మ కర్మలు ఆచరించుటకు వీలుకాదు. కనుకనే సమస్త కర్మలను ఆచరించడానికి అనుకూలమైనది ఈ దేహము. 2. మనస్సు : "సంకల్ప వికల్పాత్మకం మనః" నిరంతరమూ ఇది సంకల్ప వికల్పముల చేతనే కూడి వుంటుంది. "మనః మూలం ఇదం జగత్" జగత్తంతా మనోమయంగానే వుంటున్నది. మనస్సులేని పదార్థంగాని, వ్యక్తిగాని ఏదీ వుండదు. మంచి చెడ్డల విచారణ కూడా మనస్సు ద్వారానే జరుగుతున్నది. నిత్యానిత్య పరిశీలన కూడా దీని ద్వారానే జరుగుతున్నది. కనుకనే మనస్సుకు తెలుసుకొనుట అని దీనికొక అర్థం. 3 ఆత్మ : ఇది నిత్యమై సత్యమై నిర్మలమై నిస్వార్థమైన ప్రకాశవంతమైన స్వరూపము. ఎట్టి కూర్పులచేతగాని, మార్పులచేతగాని మార్పుచెందునది కాదు. ఇది మానవుని అంతరాత్మ యందు పరంజ్యోతిగా వెలుగుతున్నది. దానినే దైవత్వమని పిలువబడుతున్నది.

### ఆత్మస్వరూపుడే

మానవుడు నిజంగా ఆత్మస్వరూపుడే. పవిత్రములైన భారతీయ శాస్త్రములు అంతరాత్మను ప్రబోధిస్తున్నాయి.

హృదయ కుహరమునందు భగవంతుడు ఆత్మస్వరూపుడై వున్నాడని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి. ఇదే వాస్తవాన్ని అన్ని మతాలు చెబుతున్నాయి. సద్భావములచేతనూ, సత్కర్మలచేతనూ, సత్ప్రవర్తనచేతనూ మానవత్వాన్ని నిరూపించుటకు హృదయమే ప్రధానమని గురునానక్ బోధించాడు. సర్వమతముల సారమూ ధర్మమార్గమే. ధర్మము, గమ్యమూ అన్నీ హృదయము యొక్క పవిత్రతనే నిరూపిస్తున్నాయి. కనుక ప్రేమ అన్నటువంటిది లేక సత్యమన్నటువంటిది దేహమునకు మాత్రమే సంబంధించినటువంటిది కాదు, హృదయమునకు సంబంధించినటువంటిది. మానవుడు నిజంగా ఆత్మ స్వరూపుడే అయితే ఇట్టి సత్వరూపాన్ని మరచిపోయి క్షణికమైనటువంటి, క్షుద్రమైనటువంటి, లౌకికమైనటువంటి ఈ భోగ భాగ్యములకు మురిసిపోయి మానవుడు భగవంతుడ్ని మరచిపోతున్నాడు. ఈ లౌకిక సుఖములను ఆశించి, తాను చేసే ప్రయత్నములు ఫలించక, ఒకవేళ ఫలించినా, సాధించినదానిని అనుభవించలేక, నిరాశా నిస్పృహలకు గురై అసంతృప్తితో జీవితాన్ని గడుపుతున్నాడు. నూటికి ?0 మంది నిర్విరామ కృషిచే, నిరంతర తాపత్రయములతో, అంతులేని ఆశలతో, అర్థంకాని ఆవేదనలతో అశాంతికి లోనవుతున్నారు. మానవునియందున్నటువంటి మానవత్వాన్ని, దైవత్వాన్ని మరచిపోయి దానవత్వాన్ని పెంపొందించుకుంటున్నారు. తనకు తాను పతనమైపోవడమే గాక, తోటి మానవులను కూడా పతనం గావించుచున్నాడు. వీటన్నింటికీ మూల కారణం ధర్మబద్ధమైన, నియమబద్ధమైన జీవితమును అలక్ష్యం చేయడమే.

## ధర్మము

"ధర్మమేవ ఇదం మూలం" ధర్మమే అన్నిటికీ మూలం. ధర్మమే గొప్ప సుగుణం. ధర్మమనగా కేవలం మానవుని నిత్య జీవితంలో తన వంతు కర్తవ్యములను గుర్తించడం, ఆచరించడమే కాదు. అనేకమంది

**ఆంధ్ర గ్రంథములు – రచయితలు**

అచ్చ తెనుగు రామాయణము –
కూచిపూడి తిమ్మకవి

ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము –
వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి

ఆంధ్రశబ్ద చింతామణి – నన్నయభట్టు
ఆముక్తమాల్యద – శ్రీకృష్ణదేవరాయలు
ఉత్తరరామాయణము – కంకంటి పాపరాజు
ఉత్తర హరివంశము – నాచన సోమన్న
కళాపూర్ణోదయము – పింగళి సూరన
కవిరాజ మనోరంజనము – కనుపర్తి అబ్బయ
కాళహస్తి మహాత్మ్యము – ధూర్జటి
కాళహస్తీశ్వర శతకము – ధూర్జటి

ధర్మమును, నీతికి పర్యాయపదంగా భావిస్తున్నారు ఇది నిజమైన ధర్మము కానేరదు. మానవుని యందు ఆవిర్భవించినటువంటి చైతన్యమును, ఏకంగా సత్వ పరంగా కట్టి వుంచడమే నిజమైన ధర్మము. మానవుని యొక్క చైతన్య తత్వమును, అహంకార భావముచే, అహంకార సూత్రంచే కట్టినప్పుడే ఇది తుదీయ స్వరూపమైన ధర్మంగా ఏర్పడుతుంది, సృష్టి చైతన్యమునే ఈశ్వర బద్ధంగా మనం భావించినప్పుడే ఇదియే నిజమైన ఆత్మ ధర్మంగా రూపొందుతుంది. ఏకాత్మ భావనను పొందడమే నిజమైన ధర్మం. బాహ్యమైన లౌకికమైన ఈజగత్సంబంధమైన తత్వములన్నియు కూడను ఇవి కేవలం తుదీయ స్వరూపములైన ధర్మములే "స్వధర్మము" అనగా 'స్వ' అనగా ఆత్మధర్మమే. పర ధర్మమనగా దేహధర్మమే. దేహ ధర్మములు అనిత్యములు. మార్పులతో కూడినటువంటివి. యుగయుగముల యందు ఇట్టి మార్పులు జరుగుతూ వస్తూనేవున్నాయి. కాని ఇట్టి ధర్మములు ఆత్మ ధర్మములుగా మనం విశ్వశించరాదు. ఈ ధర్మములన్నియూ కూడను గృహస్థ ధర్మములు, ఆశ్రమ ధర్మములు, వర్ణ ధర్మములు అనునటువంటివి అనేక రకములుగా ఉంటూవుంటాయి. ఇవి కేవలం మానవుని జీవనోపాధి నిమిత్తమై ఏర్పడినటువంటివే. జీవిత పరమావధికి సంబంధించిన ఆత్మ తత్వాన్ని, ఆత్మ ధర్మాన్ని మనం అనుసరించాలి. కేవలం దేహ ధర్మములను అనుసరించడం చేతనే మనం మృగములుగా తయారవుతున్నాం. మనో ధర్మములను ఆచరించినప్పుడు ఇది కేవలం తాత్కాలికమైన మానవత్వంగా నిరూపిస్తూ వస్తున్నది. శరీరం, మనస్సు రెండూ కూడను ఆత్మతో అనుబంధం చేర్చుకున్నప్పుడే ఇది దైవత్వాన్ని పెంపొందిస్తున్నది. దేహం చేయుట, మనస్సు ఆలోచించుట, ఆత్మ సాక్షీభూతమై ఉండుట, ఈ మూడింటి తత్వములు విభిన్నంగా ఉండినప్పటికీ, ఇవి వేరువేరు మార్గములు ప్రవర్తించినప్పటికినీ అన్నింటికీ అన్యోన్యమైన ఆశ్రయం ఒకటున్నది. ఈ మూడు అవినాభావ సంబంధమైనప్పుడే మానవత్వాన్ని సార్థకం గావించుకోవచ్చు. ఈ మూడింటి ఏకత్వమే పూర్ణత్వమనేటటువంటి మార్గాన్ని అనుసరింప జేస్తుంది.

## పురుషార్థములు

ధర్మార్థ కామ మోక్షములు పురుషార్థములు. ఈ ధర్మమనేటటువంటి దానిలోనే అర్థమును ఆశించాలి. అర్థ కామములు రెండునూ ధర్మమును అనుసరించినప్పుడే ఇది సార్థకమవుతుంది. ధర్మమును మాత్రం విసర్జించి, అర్థమునకే అర్రులు చాచినప్పుడు మన జీవితం అశాంతికి గురి అవుతుంది. అర్థ కామములనేటటువంటి ధర్మమును ఆచరించినప్పుడే మోక్షం సహజ సిద్ధంగా సిద్ధిస్తుంది. "మోహ క్షయమే మోక్షం" అనేటటువంటి సులభ మార్గాన్ని మనం అనుభవించవచ్చు. కనుక మానవత్వమనేటటువంటిది ఇవాళ కేవలం నూతనంగా ఏర్పడినటువంటివి కాదు.

## మానవ

'మా' అనగా కాదు. 'నవ' అంటే కొత్తది. 'మానవ' అంటే ఇది కొత్తది కాదని దీని అర్థం. ఎన్నియో జన్మలనుంచి వచ్చే పాతదే, రోతదే. కనుక ఎంతకాలంనుండో వచ్చే మానవత్వాన్ని పాతగానో,

రోతగానో అనుభవిస్తుంటే నిజమైన స్వరూపాన్ని మనం ఏనాడు అనుభవించేది! కనుకనే సర్వమునూ బ్రహ్మమయ మనేటువంటి స్వరూపాన్ని మనం నిరూపించాలి. సమాజం లోనే సర్వ స్వరూపమైన ఈశ్వరత్వాన్ని ఆవిర్భవింప జేసుకోవాలి. కనుకనే "ఈశావాస్యం ఇదం సర్వం"

చుక్కలన్నియు బ్రహ్మ సూర్యుండు అది బ్రహ్మ
చంద్రుడన్నను బ్రహ్మ జలము బ్రహ్మ
స్వర్గమన్నను బ్రహ్మ వైకుంఠమది బ్రహ్మ
తల్లియన్నను బ్రహ్మ తండ్రి బ్రహ్మ
సంపదంతయు బ్రహ్మ వాల్లభ్యమది బ్రహ్మ
జీవరాసులు బ్రహ్మ జీవి బ్రహ్మ
పుట్టించుటది బ్రహ్మ పోషించుటది బ్రహ్మ
గిట్టించుటది బ్రహ్మ గృహిణి బ్రహ్మ
కాలమంతయు బ్రహ్మ కాయంబు అది బ్రహ్మ
ప్రకృతి అంతయు బ్రహ్మ ప్రాణంబు బ్రహ్మ
సర్వమును బ్రహ్మ మరియు ఈ సభయు
బ్రహ్మ
సత్యమును బ్రహ్మ తెలుపు ఈ సాయి
బ్రహ్మ

సర్వమునూ బ్రహ్మమయమే. బ్రహ్మకు వేరైనటువంటి పదార్థం మరొకటి లేదు. సర్వము భగవత్ స్వరూపకంగా వున్నప్పుడు మనం వెదుకుట ఎక్కడా? తాను చిక్కుట ఎక్కడా? విశ్వమంతా ప్రాణ విభుని మందిరమైన వీధి వాకిలి ఎక్కడా? విశ్వమంతా మందిరమైనప్పుడు వీధి కెక్కడ స్థానమున్నది? వీధియే లేనప్పుడు ఇంక వాకిలి సీ కెందుకు? అదియే వైకుంఠం. అదియే దైవత్వం.

## సాయి ఐశ్వర్యం

భగవంతుడు తన సంపదలు, ఐశ్వర్యములు మనకు అనుకూలమైన మార్గంలో అందిస్తూ వచ్చాడు. ఆ ఐశ్వర్యములకు వారసులు మీరందరూ. అయితే

# విదుర నీతి

" ఈర్ష్యీ ఘృణీన సంతుష్టః క్రోధనో నిత్య
శంకితః
పరభాగ్యోపజీవీ చ షడేతే నిత్య దుఃఖితాః"

అనగా ఈర్ష్యపడువాడు, (ఎక్కువ) జాలి పడువాడు, సంతృప్తి లేనివాడు, కోపశీలుడు, నిత్యము శంకించువాడు, ఇతరుల ఆశ్రయమునందు జీవించువాడు - ఈ ఆరుగురు ఎల్లప్పుడును దుఃఖమును అనుభవించుదురు.

ఇతరులను చూచి ఓర్వలేనివాడు, ఈర్ష్యపడేవాడు, ఎదుటివాడు బాగుపడిపోతున్నాడే యని వ్యధ చెందేవాడు ఎప్పుడూ బాగుపడడు. దుఃఖమునకు లోనవుతుంటాడు. జాలిపడటం మంచి గుణమే గాని, ఇతరుల కష్టములను చూచి అతిగా జాలిపడితే, అతను కూడా దుఃఖపడవలసి వస్తుంది. ఎంత పెట్టినా సంతృప్తి చెందని సేవకుడు కూడా చివరికి దుఃఖించవలసి వస్తుంది. కోపం గురించి వేరే చెప్పనవసరం లేదు. కోపిష్టికి మనశ్శాంతి ఉండదు కోపమును అగ్నితో పోల్చారు (కోపాగ్ని) మన పెద్దలు. కోపం గలవారికి కావల్సిన పనులు కూడా కావు. కోపిష్టి దుఃఖం బారి నుండి తప్పించుకోలేడు. నిత్య శంకితుడుగా అనగా నిత్యమూ ప్రతి దానిని గురించి అనుమానించేవాడు, ప్రతిదానిని గురించి సంశయించేవాడు, "సంశయాత్మా వినశ్యతి" అని భగవద్గీతలో కూడా చెప్పబడింది. సంశయములు కలవాడు నశించును. అదే విధముగా నిత్య శంకితుడు కూడా దుఃఖమునకు లోను కావల్సి వస్తుంది. ఇకపోతే ఇతరుల ఆశ్రయమునందు జీవించువానికి కూడా ఏమాత్రం మనశ్శాంతి ఉండదు. తరుచుగా చివాట్లకు, నిందలకు లోనై దుఃఖించవలసి వస్తుంది. కనుక ఈ పై ఆరుగురు ఎల్లప్పుడూ దుఃఖమును అనుభవించవలసి వస్తుందని విదురుడు స్పష్టం చేశాడు కనుక విజ్ఞత గలవారు పై దుర్గుణములకు దూరంగా ఉండి దుఃఖము బారినుండి తప్పించుకొనే ప్రయత్నం చేయాలి — నం.

ఆ ఐశ్వర్యము లేమిటో గుర్తించడానికి ప్రయత్నించాలి. సాయి ఐశ్వర్యములు ఈ భవనములు, మందిరములు కావు. సాయి ఐశ్వర్యమనేటటువంటిది నిస్వార్థమైన, నిర్మలమైన ప్రేమ ఒక్కటి మాత్రమే. ఆ ప్రేమకు మీరు వారసులై, ఆ ప్రేమను మీరు అనుభవించి ఆ ప్రేమను మీరు అందుకొని, ఆ ప్రేమను సరైన రీతిలో జగత్తుకు చాటటమే మీ యొక్క ప్రధాన కర్తవ్యం. సర్వజ్ఞుడైనటువంటి, సర్వశక్తివంతుడైనటువంటి భగవంతునికి మీరు అర్పితంచేసేటటువంటిది ఏమిటున్నది. కేవలం భ్రాంతి మాత్రమే మానసిక తృప్తికై ఇన్ని విధముల అర్పితములుగా విస్తావస్తున్నారు.

బ్రహ్మాండమంతట ప్రబలుచుండెడి తనకు
ఆలయమ్మన నొక్క ఆలవియగున
కోటి సూర్యులకాంతి మేటి కల్గిన తనకు
ప్రమిద దీపము లెవరు పట్టగలరు
అజహరాదులకైన అందని వానినే
తన రూపు కనుగొన నెవరి తరము
సర్వజీవులయందు సంచరించెడి తనకు
సరియైన పీఠిడ సాధ్యమగున
బ్రహ్మాండమంతయు బొజ్జలో నున్నట్టి
భోజ్యము తనకు పెట్టదగున
బ్రతుకుకోసం బహు బాధ బద్ధులైరి...

నిజముగా భగవంతునికి ఒక స్థానం, ఒక రూపం, ఒక పేరు ఎక్కడా కానరాదు. భగవంతుడు కల్పవృక్షము, కామధేనువు భగవంతుని సులభంగా పొందుటకు ఒక ప్రేమ మాత్రమే ప్రధానమైన మార్గం. ప్రకాశించేటటువంటి చంద్రుని మనం చూడవలెనంటే, చంద్రుని కాంతి చేతనే చంద్రుని చూడవచ్చును గాని, ఆ చంద్రుని చూచుటకు పెట్రొమాక్స్, టార్చిలైట్లు అవసరం లేదు. భగవంతుడు ప్రేమస్వరూపుడు గనుక, ప్రేమస్వరూపమును ప్రేమ ద్వారానే గుర్తించుటకు ప్రయత్నించాలి. కనుక ప్రేమ మన ప్రాణంగా విశ్వశించాలి. మానవుని నుండి మొదట ఆవిర్భవించేది ఒక్క ప్రేమ మాత్రమే. తదు

పరియే అన్ని గుణములు ఆవిర్భవిస్తున్నాయి. కనుక ప్రేమ రహితమైన హృదయములుగా వుండకూడదు. ప్రేమ మయమైన జీవితాన్ని గడపాలి.

## రాహుకేతువులు

మానవుని యొక్క భావములు అనేక విధములైన రాగములతో కూడికొని వుంటాయి. రాగద్వేషములే మానవునికి ప్రధానమైన రాహుకేతువులు. నవగ్రహములు .... నవగ్రహములు అని భావిస్తున్నామే గాని, ఇది కేవలం భ్రాంతి మాత్రమే. రెండు గ్రహములే మనల్ని పట్టి బాధిస్తున్నాయి. అవే రాగద్వేషములు. శంకరులవారి శిష్యులలో తోటకుడు ప్రశ్నిస్తాడు. " గురుదేవా ! ఈ జగత్తులో దిగ్విజయమును సాధించినవాడు ఎవడు ?" అని శంకరులను అడుగుతాడు. "ఇంద్రియములను నిగ్రహించినవాడే నిజమైన విజయుడు " అని శంకరులు చెబుతారు. కనుక కేవలం రాజ్యములను సాధించినవాడు గాని, ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కి మొదట జండాను పాతినవాడుగాని విజయుడు కానేరడు. హిరణ్యకశ్యపుడు సముద్రాన్ని ఛేదించినవాడు. భూమండలాన్ని జయించినవాడు. తాను సర్వత్రా సంచరించి దైవత్వాన్ని గుర్తింపజేయడానికి తగిన కృషి సల్పినటువంటివాడు. కాని అట్టివాడు కూడను విజయాన్ని సాధించలేక పోయినాడు. నిజమైనటువంటి విజయుడు ఎవరు ? ఇంద్రియములను నిగ్రహించినవాడే నిజమైన విజయుడు. " తండ్రీ ! క్షుద్రమైనటువంటి, క్షణికమైనటువంటి ఈ రాజ్యమును సాధించడానికి, జయించడానికి నీవు ప్రయత్నిస్తున్నావు? అడవులలో సంచరించే మృగములను చంపినట్లుగ మానవులను చంపినవాడు వీరుడు కానేరడు. నీయందున్న మృగత్వమును తీసివేయడానికి తగిన కృషి చేయి. దుర్గుణములైనటువంటి ఇంద్రియములను మొదట జయించు " అని ప్రహ్లాదుడు తండ్రికి హితవు చెప్పాడు.

## ఆదర్శ సిద్ధాంతం ఏది?

" యావద్భ్రియతే జఠరం తావత్ స్వత్వం హి దేహినాం
అధికం యో అభిమన్యేత స స్తేనో దండ మర్హతి "

అనగా " మన అవసరాలకు ఎంత ఆహారాది పదార్థములు అవసరమో అంత మాత్రమే కూడబెట్టుకోవాలి లేక దాచుకోవాలి. అవసరాలకు మించి ఎవరు ఎక్కువగా కూడబెట్టుకుంటారో అట్టివారు దొంగలు. అంతేకాదు వారు దండనకు అర్హులు " అని మన శాస్త్రములు ఘోషిస్తున్నాయి.

తన అవసరాలకు మించి దాచుకోవడం మహాపాపమని మన వేద వేదాంగాలలో ఏనాడో చెప్పబడింది. మన మహర్షులు ఇదే సత్యాన్ని చాటారు. మన ఉపనిషత్తులు, పురాణాలు యిదే వాస్తవాన్ని చెబుతున్నాయి. ఇంకా అనేక సందర్భాలలో వ్యక్తి బాధ్యతలను, సమాజంపట్ల వ్యక్తి అనుసరించవలసిన నియమ నిబంధనలను చక్కగా, స్పష్టంగా మన శాస్త్రాలలో నిర్దేశించబడినాయి అది చదవకుండా నవ నాగరికులమని భావించే నేటి విద్యావంతులు కొందరు మన శాస్త్రాలన్ని వట్టి మూఢాచారాలను బోధిస్తున్నాయని వితండ వాదన చేస్తుంటారు. సామ్యవాదానికి మించిన సిద్ధాంతం వేరొకటి లేదని చెబుతుంటారు. పై శ్లోకమును అర్థం చేసుకొన్నచో ఎవరిది ఉన్నత ఆదర్శములతో కూడిన సిద్ధాంతమో బోధపడుతుంది. మనది ఏమిటో తెలుసుకొనకుండా, అవగాహన చేసుకొనకుండా ఇతరులను అనుకరించడానికి ప్రయత్నించడం అవివేకం అనుకరణ గుడ్డిదేకాదు, ప్రమాదము కూడాను. ఈ వాస్తవాన్ని భౌతికవాదులు గుర్తించడం అత్యవసరం.

— సం.

## ప్రేమాస్త్రం

" లోని శత్రువులకు లొంగిపోయినవాడు, బయట రిపుల నెట్లు పట్టగలడు. " లోపలి శత్రువులకే లొంగిపోయినవాడు బయట శత్రువులపై ఏ విధంగా విజయాన్ని సాధించగలడు. లోని శత్రువులను జయించాలంటే ఒక్క ప్రేమాస్త్రం ద్వారానే సాధ్యమవుతుంది కనుక ప్రేమ చేతనే మన జీవితమును సార్థకం గావించుకొని, ప్రేమ చేతనే ఈ అరిషడ్వర్గములను జయించుకొని, దివ్యత్వమైన దైవత్వాన్ని పొందడానికి అవసరమైన కృషి చేయాలి.

## ప్రేమ స్వరూపులారా !

అందరూ భగవంతుని బిడ్డలే వేరు వేరు మార్గముల ననుసరిస్తున్నప్పటికీ మనందరికీ ఒకే ఒక ప్రభువున్నాడు. ఒకడే భగవంతుడు. తండ్రి ఒక్కడే కనుకనే Brotherhood of Man, Fatherhood of God ఈ రెండిటినీ మనం సాధించాలి. ఈ లోకంలో అనేక విధములైన అశాంతులచేత, అక్రమాలచేత అనాచారముల చేత, అధర్మములచేత మానవుడు కుళ్ళి, క్రుంగి కృశించిపోతున్నాడు. ఇలాంటి స్థితిలో మానవుడు భగవద్విశ్వాసమును పెంచుకొని, మానవత్వాన్ని పెంపొందించుకొని, ప్రేమతత్వమును అభివృద్ధి గావించుకొని, దివ్యమైనటువంటి సమాజంలో ప్రవేశించి, సేవకా వృత్తియందు ఈ జీవితమును సార్థకం గావించుకోవాలని నేను ఆశిస్తున్నాను. కేవలం దేహమునే ఆశ్రయించకండి. దేహమును మాత్రమేగాక మనసును కూడను ఆశ్రయించకండి. ఆత్మను ఆశ్రయించండి. అట్టి ఆత్మను ఆశ్రయించిన వారే ధన్యులు కాగలరు సేవలలో నిమగ్నులవ్వండి. ఈ సేవల ద్వారానే ఆత్మార్పణ జరుగుతుంది. ఈ ఆత్మార్పణ జరిగినప్పుడే స్నేహం ప్రారంభమవుతుంది సేవ ద్వారా ఐక్యత కలుగుతుంది. వ్యక్తిగతమైన అభిప్రాయ భేదములు, ద్వేషములు ఎన్ని వున్నప్పటికిన్ని ఆత్మతత్వాన్ని మాత్రం ఏకత్వంగా భావించాలి. ఇది సేవ ద్వారానే లభిస్తుంది. కనుక ప్రతి ఒక్కరు సేవాతత్వమును అభివృద్ధిగావించుకొని జీవితమును సార్థకం చేసుకోవాలని కోరుతున్నాను. ★

( 61 వ జన్మ'నోత్సవ మహోత్సవ సందర్భమున ది. 23-11-1986 న ప్రశాంతినిలయంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు యిచ్చిన దివ్య సందేశమునుండి.)

# మకర సంక్రాన్తి

భాగవతుల కుటుంబరావు

సంక్రమణము—అనగా - లెస్సగా నడుచుట, దాటుట, వేరొక స్థితిని పొందుట-అనే అర్థాలు చెప్పవచ్చు. సూర్యుడు, తానింతవరకు వున్న రాశిలోనుండి ఇంకొక రాశిలోనికి రావటాన్ని, జ్యోతిశ్శాస్త్రములో సంక్రమణము అంటారు-ఇటువంటివి ఒక సంవత్సరంలో 12 సంక్రాన్తులు వస్తై.

ఈ సంక్రాన్తులు నాలుగు రకాలుగా ఉన్నై. అయన సంక్రాన్తులు, విషువ సంక్రాన్తులు, షడశీతి సంక్రాన్తులు, విష్ణుపది సంక్రాన్తులు అని. మకర సంక్రాన్తి, కర్కాటక సంక్రాన్తి-అయన సంక్రాన్తులు. సూర్యుడు ఉత్తర దిశకు ప్రయాణము సాగించటము మొదలు అవుతుంది- అయనము అంటె ప్రయాణము-అందుకని అయన సంక్రాన్తి అయింది. సంక్రాన్తి సమయాన వుండే వారములు నక్షత్రాలననుసరించి మటి యేడు సంక్రాన్తులున్నై మందా, మందాకినీ, ధ్వాంక్షి, ఘోరా, మహోదరీ, రాక్షసీ, మిశ్రితా అని వాటికి పేర్లు పెట్టారు.

ఈ సంక్రాన్తి అనేది ప్రధానంగా, సూర్యునికి సంబంధించినది. భారతీయుల దృష్టిలో సూర్యుడు ప్రత్యక్ష దైవతము. సూర్యుడు అంటే కేవలము సూర్య గోళము కాదు. ఆ గోళానికి, ఆ తేజస్సుకు అధిష్ఠానము, మూలము అయిన, పరంబ్రహ్మ పరాశక్తి భారతీయులు గాయత్రీ మన్త్రముతో, ప్రతిదినము భావన చేసేది ఈ సూర్య రూపముననున్న, సర్వాంతర్యామియైన శక్తినే. ఈ సూర్యుని గమనము కాలనిర్ణయాన్ని చేస్తుంది. కాలము దైవస్వరూపము. "కాలోస్మి లోకక్షయకృత్." ఒక్కొక కాలములో ఒక శక్తి వుంటుంది. ఆ కాలములో వుండే, మంచి చెడులను ఆధారముగ చేసికొని పుట్టినదియే జ్యోతిశ్శాస్త్రము. "షిరో" ( Cheiro ) అను విదేశీయ ప్రసిద్ధ జ్యోతిష్కుడు, మనదేశము వచ్చి, ఋషితుల్యుల సందర్శనము చేసి, ఈ జ్యోతిర్విద్యను సంపాదించినట్లు వ్రాసుకున్నాడు.

ఈ ఉత్తరాయనము - చాల పవిత్రమైనది. పుణ్యకాలము—

అగ్నిః జ్యోతిః అహః శుక్లః షణ్మాసాః ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదోజనాః

అని శ్రీమద్భగవద్గీతలోని వాక్యము. ఉత్తరాయణ కాలములో మరణించినవారు ఉత్తమ లోకాలను పొందుతారు అని దీని భావము. అసలు మార్గశిరమాసమే పవిత్రమైనది.

"మాసానాం మార్గశీర్షోహమ్" అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. అందులో ఈ ఉత్తరాయణం వస్తుంది. అది ఇంకా మంచిది. ఈ కాలములో గూడ, సూర్యుడు మకరరాశిలో ప్రవేశించే సమయానికి, ఎంత దగ్గరగా ఉంటె, అంత మంచి కాలము. 70 ఘటికల వరకు ఆ పుణ్యకాలము ఉంటుంది. స్వచ్ఛంద మరణమునకు శక్తి గల భీష్మాచార్యులు గూడ, ఉత్తరాయణము వరకు వేచి ఉండి మరణించినాడు అనే విషయాన్ని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి

**ఏమిచేయాలి ?** ధర్మశాస్త్రాలలోని వాక్యాల సారమిది—రవి సంక్రమణము వచ్చినపుడు స్నానము చేయనివాడు ఏడు జన్మల వరకు రోగి నిర్ధనుడు అవుతాడు-పిండదానము లేకుండా శ్రాద్ధము చేయాలి. అప్పుడిచ్చిన హవ్యము, కవ్యము, సూర్యుడు ప్రతి జన్మయందు దాతకు తిరిగి యిస్తాడు. దానికి తగిన ప్రతిఫలము అనంతముగా ఇస్తాడు—

నువ్వులనూనెతో ఆనాడు దీపము వెలిగించాలి - నువ్వులతో చేసిన ఆవును దానం చేయాలి. (తిలమయియైన ధేనువును ) శివాలయములో తిల తైలముతో దీపము

వుంచాలి. నల్లని, తెల్లని తిలలతో శివుని పూజించాలి. నల్ల తిలలతో స్నానము చేయాలి. నలుగు పెట్టుకోవాలి. నల్ల తిలల హోమము చేయాలి. పితృతర్పణం నల్ల నువ్వులతోను. తెల్ల నువ్వులతో దేవతర్పణాలు చేయాలి. ఆనాడు శివుణ్ణి నేతితో అభిషేకము చేస్తే మహా ఫలము వస్తుంది. సూర్యుని క్షీరముతో స్నానం చేయిస్తే (అభిషేకిస్తే) సూర్యలోక ప్రాప్తి కలుగుతుంది.

యోగశాస్త్రములో — స్వాధిష్ఠానమనే వైతరణీనదిని దాటి, పింగళనాడి అనే మార్గాన సాగి, సోహం అనే అమనస్క భావనతో, సుషుమ్నతో ప్రకాశించటము - ఇడా పింగళ నాడులను దాటి సుషుమ్నలో ప్రవేశించి, ఆత్మానుభూతిని పొంది, సమాధి స్థితిని సాధించటం సంక్రమణము అని యోగ సంప్రదాయంలో విశ్వాస మున్నవారు అంటారు.

సాంఘికముగా — ఈ పండుగ ఆబాల గోపాలము చేసుకునే పండుగ. వరిపంటలు ఇంటికి వస్తే.. ధాన్య మహాలక్ష్మి మన యింట ప్రవేశిస్తుంది. ఆనందం వెల్లి విరుస్తుంది. వరికంకుల తోరణాలు ద్వారాలను అలంకరిస్తే. ముందురోజు భోగిపండుగ - పిల్లలకు భోగిపండ్లు పోస్తాము. అల్లుళ్ళను పిలుచుకుంటాము. ఇంటిల్లిపాదీ క్రొత్త బట్టలు కట్టుకుంటాము పొంగలి పొంగిస్తాము వ్యవసాయదారులు ఎద్దులను పసుపు కుంకుమలతో

అలంకరిస్తారు – గంగిరెద్దులు వస్తై. వృషభపూజ, నందినీ పూజలు జరుగుతై. కోళ్ళ పందెములు – ఏవేవో సంబరాలు జరుగుతై. అందరు ఆనంద డోలిక లలో ఊగులాడుతారు. నిరుపేదలో ! వారు కూడ ఆనందంలో ఓలలాడే రోజులు వస్తే అది నిజమైన సంక్రాన్తి – దారిద్ర్యరేఖను దాటి సంపద్రేఖలో ప్రవేశించట మౌతుంది.

అన్నిటికంటె విశేషం-బొమ్మల పండుగ-తొమ్మిది దినాలు బొమ్మల పండుగ చేసారు. శిల్ప దృశ్యాలు చూడవచ్చు. సావిత్రి గౌరిదేవి వ్రతము అని, సంక్రమణం వెళ్ళిన మూడవనాటినుండి మొదలు పెట్టి, సావిత్రి గౌరిని క్రొత్తగా పెండ్లి అయినవారు, ఈ తొమ్మిది రోజులు నియమంగా చేస్తారు. పెద్దవాళ్ళు చేస్తారు. సావిత్రి వలెనే, ముత్తైదువతనం పొందుతారు.

సంస్కృత కవులు-తెనుగు కవులు ఈ సంక్రాన్తిని కమనీయ పద్యాలతో, గేయాలతో వర్ణించారు. స్తుతించారు.

దక్షిణదేశము, బెంగాల్‌లోనే కాకుండా-గ్రీకు ఈజిప్టులలో గూడ, ఈ సంక్రాన్తి ఉత్సవాలు చేసుకుంటారు.

శ్రీవాణి పఠితల కిది భవ్య దివ్య సంక్రాన్తియై శుభములను కూర్చుగాత—

★

## నిరీక్షణం

తిరునగరి

ఇన్నేళ్ళటి శ్రమ అంతా
బూడిదపాలౌతున్నది
ఇన్నాళ్ళటి అభ్యుదయం
ఏటిలోన కలుస్తోంది
మహనీయుల ఆశయాలు
మరచిపోయె భరతజాతి
అడుగంటెను దేశభక్తి
వ్యాపించెను కూటనీతి
ఎవరికి పట్టనిదయ్యా
నేడు చూడ ఈ దేశం
ఎవరికి వారేనయ్యా
ఎల్లాగో భవితవ్యం ?
హృదయమ్ముల వైశాల్యం
ఎందుకిలా తగ్గుతోంది ?
ఎద ఎదలో స్వార్థబుద్ధి
ఎందుకిలా పెరుగుతోంది ?
నానా వాదాల తోడ
నరులంతా కలహిస్తే
మతం క్రూర వ్యాఘ్రంగా
బ్రతుకులనే హరియిస్తే
ఏ నాటికి సమవాదం
ఈ గడ్డన నెలకొనేది ?
మానవతా శుభ నాదం
ఏనాటికి వినబడేది ?
నడుస్తున్న కథ అస్త
వ్యస్తం విషాద భరితం
దౌర్జన్యం కోరల్లో
తల్లడిలే యుగధర్మం
ప్రజాహృదయ క్షేత్రాల్లో
పరిణామం వచ్చునెపుడు ?
పరిణామంతో దేశం
ప్రగతి గీతి పాడునెపుడు ?
ఎప్పుడయా దేశంలో
నవనాదం వినబడేది ?
ఎప్పుడయా దేశంలో
సమవాదం కనబడేది ?
ఆ రోజులకై చూస్తూ
ఆ జాగృతికై వ్రాస్తూ
నిరీక్షిస్తున్న వాణ్ణి
నేను వర్తమాన కవిని. ***

# బాబా సన్నిధిలో మధురక్షణాలు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి 61వ జన్మదినోత్సవ మహోత్సవంలో పాల్గొనే నిమిత్తం సకుటుంబంగా నవంబరు 21 తేదికి ప్రశాంతి నిలయం చేరుకున్నాను. ఈ మహోత్సవంలో సుమారు 2 లక్షలమంది భక్తులు ప్రపంచం నలుమూలలనుండి విచ్చేసారు. ఏ చెట్టు క్రింద ఖాళీ వుంటే ఆ చెట్టు క్రింద భక్తులు విశ్రమించారు. అక్కడి క్రమ శిక్షణ, నిశ్శబ్ద ప్రశాంత వాతావరణం భక్తులను ముగ్ధులను చేసిందనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు 25 వ తేది సాయంత్రం నా జీవితంలో మరువలేని మధుర క్షణం. భక్తుల వరుసలలో మధ్యలో కూర్చొన్నాను. బాబాగారు సరాసరి నా వద్దకు వచ్చి " ఏం కృష్ణమోహనరావు! ఎప్పటి వరకు ఉంటావ్ ! " అని ప్రశ్నించడంతో నా వక్షః జలదరించింది. " నేను వచ్చి 5 రోజులైంది తమ అనుజ్ఞ " అన్నాను. " నేను చూస్తూనే ఉన్నానులే ! ఉండు!" అని ఆశీర్వదించి వెళ్ళిపోయారు ఇంతమందిలో అనేక కార్యక్రమాలలో నిమగ్నులైన బాబాగారు నన్ను పలుకరిస్తారని ఊహించలేను, కలలోనయినా భావించలేదు. ఇంతటి అదృష్టం నాకు లభించినందుకు ఎంతో ఆనందించాను. భక్తునికి ఇంతకన్నా ఏంకావాలి, సాక్షాత్ పరమాత్మే కళ్లముందు ప్రత్యక్షమై పలుకరించినప్పుడు కలిగే ఆనందం వర్ణించడానికి మాటలు చాలవు. అదే ఆనాటి నా పరిస్థితి

26 వ తేది ఉదయం మరల భక్తుల వరుసలలో నేను కూర్చున్నాను దివ్యమంగళ స్వరూపం మరల ప్రత్యక్షమైంది. అడుగడుగులో అడుగు వేసుకుంటూ భక్తుల ముఖాలను పరికిస్తూ ఎవరికోసమో, దేనికోసమో అన్వేషిస్తున్నట్లుగా చూస్తూ బాబాగారు ప్రశాంత వదనంతో ముందుకు సాగిపోతున్నారు. వారి దృష్టి ఎవరి మీద పడుతుందో! ఆ అదృష్టవంతులు ఎవరో ? ఎవరు చెప్పగలరు. కాని వేలాదిమంది భక్తుల దృష్టిమాత్రం వారిమీదనే ఉంటుంది. నేను కూర్చున్న ప్రదేశానికి వస్తూ దూరం నుండి నన్ను రమ్మని చేయి ఊపారు. నా కళ్ళ వెంబడి ఆనంద బాష్పాలు వచ్చాయి. వెంటనే వెళ్ళి బాబాగారికి నమస్కరించి, " పిల్లల్ని కూడా తీసుకొని రానా బాబా ! " అన్నాను. ' ఊ ' అన్నారు. నా ముగ్గురు కుమారులను వెంటబెట్టుకొని మందిరం వరండాలోనికి వెళ్ళాను. మహిళల వైపు నా శ్రీమతి కోసం చేయి ఊపాను. నా శ్రీమతి. నా కూతురు నా తమ్ముడి కూతురు బయలుదేరారు. ఇంతలో బాబాగారు వరండాలో నా సమీపానికి వచ్చి మహిళల వైపు చేయి చూపించారు. మహిళా స్వచ్ఛంధ సేవకులు నా శ్రీమతిని కూర్చోమన్నారు. బాబాగారు నా వైపు చూచి నీ శ్రీమతిని ఒక్కదానినే రమ్మనమని చెప్పమన్నారు. " బాబా! మా అమ్మాయికూడా ఉంది గదా ! " అని జాలిగా అడిగాను, ఊ ! అని చేయి ఊపారు. ఆ సంకేతాన్ని చూచిన వలంటీయర్లు నా శ్రీమతిని పిల్లల్ని వెళ్ళమన్నారు.

ఇంటర్వ్యూ కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గది లోనికి మా కుటుంబ సభ్యులం ఏడుగురం వెళ్ళాం. మాతో పాటు సినీ యాక్టర్ జమున, విజయలక్ష్మి; ఢిల్లీస్టేట్ సత్యసాయి సేవా సమితి అధ్యక్షులు, వారి శ్రీమతి, సౌత్ అమెరికానుండి వచ్చి 6 నెలల నుండి ప్రశాంతి నిలయంలో ఉన్న ఒక ప్రముఖ పారిశ్రామిక వేత్త కూడా మా గదిలోనికి బాబాగారి ఆదేశంపై వచ్చారు. బాబాగారి పాద పద్మముల చెంతనే కూర్చొనే భాగ్యం నాకు లభించినందుకు ఎంతో సంతోషించాను. " కృష్ణమోహనరావ్ ! నీకు ఉంగరం యివ్వలేదా ! " అన్నారు బాబాగారు. "గురు పూర్ణిమ సమయంలో నాకు శివలింగం యిచ్చారు " అన్నాను. వెంటనే చేయి పైకి ఎత్తారు. ధగ ధగ మెరిసే ఉంగరం వారి పవిత్ర హస్తాలలో

ప్రత్యక్షమైంది, నా చేయి తీసుకొని వేలికి తొడిగారు. వారి పాద పద్మములకు నమస్కరించాను. వారు నా తల మీద చేయి పెట్టి దీవించారు. జమునకు కూడా ఒక ఉంగరం యిచ్చారు ఇది చూస్తున్న అమెరికా పారిశ్రామిక వేత్త తన వేలికి ఉన్న ఉంగరమును బయటకు తీసి " Baba it is not good. I want new one అని బాబాగార్ని ప్రాధేయ పూర్వకంగా వేడుకున్నాడు. " what do you want " అని బాబాగారు అడిగారు. అతనికి ఆ ఉంగరం పేరు తెలియక " I Want Nine Stones Ring " అని అడిగాడు. " You Want Nine" Stones Ring, is it Navaratna " అని బాబాగారు ప్రశ్నించారు. " Yes ! Yes ! " అని ఆతురతతో ఆ పారిశ్రామిక వేత్త అన్నాడు. ఆ పాత ఉంగరం బాబాగారు తీసుకొని " కృష్ణమోహన్ రావ్ ! మీరు అందరికి చూపించు. ఈనాటి యువతరానికి అనుమానం పెనుభూతం " అంటూ నాకిచ్చారు. ఆ గదిలో ఉన్న అందరికీ ఆ ఉంగరం చూపించి బాబాగారికి యిచ్చాను " నేను అడుగకుండానే మీ ఇద్దరికి ఉంగరాలు యిచ్చాను. ఇతనికి ఇప్పుడు కోరిక జనించింది. 5 నెలల నుండి ఇక్కడ పడిగాపులు కాస్తున్నాడు. ఇతను పెద్ద పారిశ్రామికవేత్త. దానిని వదిలిపెట్టి ఇక్కడనే కూర్చున్నాడు. చూడటానికి పిచ్చివాడిలాగే వున్నాడు. ఇతనికి ఐదుగురు భార్యలట! ఏం చేసుకుంటాడో పాపం ! చాలా దూరం నుంచి వచ్చాడు గదా ! అతని కోరిక తీర్చకుండా పంపించుతే బాధపడుతాడు గదా ! ఇతనికి నవరత్నాల ఉంగరం కావాలిట. ఇప్పుడు నాకు పరీక్ష పెట్టాడు. " అని చెప్పి అతని పాత ఉంగరమును రెండు వేళ్ళమధ్య వుంచి మూడుసార్లు ఊదారు. " ఇదిగో ! కృష్ణమోహనరావ్ ! " అని నాకిచ్చారు. నవరత్నాల కొత్త ఉంగరం పాత ఉంగరము స్థానంలో ప్రత్యక్షమైంది. అందరికీ చూపించి బాబాగారికి యిచ్చాను. దానిని ఆ పారిశ్రామికవేత్త వేలికి తొడిగారు. తరువాత " ఇదే సంకల్పబలం అంటే " అని రెండు పర్యాయాలు బాబాగారు అన్నారు. మా తమ్ముడి కూతురి ఆరోగ్యం గురించి నన్ను అడిగారు. చెప్పాను. ఆ అమ్మాయిని పిలిచి బాబాబొమ్మ వున్న లాకెట్ గొలుసును సృష్టించి దాని మెళ్ళో వేసారు. ఆ మహిమాన్విత శక్తికి తలవంచాను. అంతే....

లోపల గదిలోనికి బాబాగారు వెళ్లారు. ఎవరికి వారికి ప్రత్యేక ఇంటర్వ్యూ యిచ్చి పంపిస్తున్నారు. ఆఖరికి మావంతు వచ్చి, మా కుటుంబ సభ్యులం ఏడుగురుం లోపలికెళ్ళాం. "ఏం! కృష్ణమోహనరావు! శ్రీవాణి పత్రిక ఎట్లా నడుస్తున్నది" అని అడిగారు. "మీరు చెప్పినప్పటి నుంచీ ఏ విషయాన్ని గురించి ఆలోచించడం లేదు నా డ్యూటీని నేను చేస్తున్నాను. కష్టాలు, సుఖాలు సహజంగా వుంటూనే వుంటాయగదా! దానిని గురించి నేను పట్టించుకోలేదు. పోయిన సంవత్సరమున్న పెన్షన్ ఈ సంవత్సరం లేదు" అన్నాను. "ఏం ఫరవాలేదు. నా అనుగ్రహం ఉన్నది" అన్నారు. "బాబా! జనవరి 12 వ తేదీన శ్రీవాణి ద్వితీయ వార్షికోత్సవం ప్రత్యేక సంచిక తీసుకొని రాసంకల్పించుకున్నాను. మీ ఆశీస్సులకోసం వచ్చాను మీ సందేశం యిస్తే బ్లాక్ చేయించి ప్రత్యేక సంచికలో వేస్తాను" అని అన్నాను. "బ్లాక్ అక్కడకాదు. హృదయంలో ఉండాలి" అని చూపించారు వారి మహోన్నతభావాలకు నా హృదయం పులకరించింది. నేను ఏమీ చెప్పకుండానే నా పిల్లల మనస్తత్వాలు పూస గుచ్చినట్లు చెప్పారు. స్నేహం ఎటువంటివారితో చేయాలో చక్కటి ఉదాహరణ పిల్లలకు చెప్పారు. "ఇసుక గాలితో కలిస్తే లేచిపోతుంది. నీటితో కలిసినప్పుడు అణిగి వుంటుంది. ఎటువంటి స్నేహం చేయాలో ఆలోచించండి. ఎవరినీ ఈసడించుకోవద్దు తిరస్కరించవద్దు ఎవరితో ఎంత స్నేహం చేయాలో అంతే చేయాలి. మీ కన్న తల్లిదండ్రులకు మంచి పేరు తీసుకొని రావాలి." అని పిల్లలకు హితవు చెప్పారు. ఎవరు పెద్దో, ఎవరు చిన్నో చెప్పకుండా మా పిల్లలు చదువుతున్న క్లాసులను వివరించాను. సహజంగా మా రెండవ వాడిని చూసిన వారందరూ వీడే పెద్దవాడా అంటారు అందులో రెండవ వాడే ఫైనల్ ఇయర్. పెద్దవాడు సెంకడ్ ఇయర్ తరువాత "బాబా వీళ్ళలో ఎవర్ని యం. బి ఏ. తమ వద్ద చదివించమంటారు." అని అడిగాను, గురుపూర్ణిమకు పిల్లల్ని తీసుకొని వెళ్ళలేదు. అప్పుడు జరిగిన ఇంటర్వ్యూలో మీ పెద్దవాడు నా దగ్గర చదవాలన్నారు ఇప్పుడు ఎవరు పెద్దో, ఎవరు చిన్నో చెప్పకుండా అడిగాను. అందరి ముఖాలు చూచి పెద్దవాడినే చూపించి "వీడే నా దగ్గరకు వచ్చే సంవత్సరం యం. బి. ఏ. చదవడానికి పంపించు" అన్నారు. నాకు ఆశ్చర్యం వేసింది. వారి సునిశిత పరిశీలనా దృష్టికి, దూరదృష్టికి ముగ్ధుడనైనాను.

నా శ్రీమతి వైపు చూచారు. "మొహం తేటగానే ఉంది. బాధలు తగ్గాయిగదా! (గురుపూర్ణిమ అప్పుడు వారు ఆశీర్వదించిన వెంటనే, సంవత్సరాల తరబడి కీళ్ళనొప్పులతో బాధలు పడుతున్న నా శ్రీమతికి స్వస్థత చేకూరింది) ఏం పరవాలేదు. నా అనుగ్రహం ఉన్నది" అన్నారు. "నీవు అప్పుడప్పుడు ఈయనమీద చికాకు పడుతుంటావ్. ఈయన ఎటువంటివాడంటే, టాంక్‌లో నీళ్ళు ఉన్నాయా! లేదా! అని చూడకుండానే ఒకే పర్యాయం టాప్‌లన్ని వదిలేస్తాడు. ఈ సమాజమంతా నాదే నంటాడు. అంతా మనవాళ్ళే అంటాడు. ఏం ఫరవాలేదు. నా అనుగ్రహం ఉంది। డైరెక్టుగా రివర్ నుంచి కనెక్టు చేసేవాడ్ని నేను ఉన్నాను గదా" అని నవ్వారు. ఈ మాటల వెనుకనున్న భావం, ఆప్యాయత, మమకారం, వాత్సల్యం నన్ను పరమానంద భరితుడ్ని చేసింది. ఇది నిజంగా నా జీవితంలో మరువలేని మధుర క్షణం. నా జీవన ప్రయాణంలో ఎంతోమంది పెద్దలను కలిశాను. మహానుభావుల్ని సందర్శించాను నేను నిజంగా పేదవాడ్నే. నా వల్ల బాబాగారికి కలిగే ప్రయోజనం ఈషన్మాత్రం లేదు. ఎందరో లక్షలాధికారులు, కోటీశ్వరులు వారి అనుగ్రహం కోసం సుదూర ప్రాంతాల నుండి వచ్చి నెలల తరబడి పడిగాపులు కాస్తున్నా వారి మీద కలగని అనుగ్రహం నాకు లభించింది. బాబాగారి పవిత్రమైన ఆశీస్సులు నాకు లభించాయి. ఇప్పుడు నా మీద మరింత బాధ్యత పడిందని భావిస్తున్నాను. నా శ్రీవాణిని యింకా మంచిగా నడుపవలసిన బాధ్యత నా మీద వున్నది. నాకు ఏ కోరికా లేదు. నా శ్రీవాణిని ఇంకా మంచిగా, ఆదర్శవంతగా నడపడానికి అవసరమైన శక్తి సామర్థ్యములను కలుగ చేయమని భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగారిని వేడుకుంటున్నాను. వారి పవిత్రమైన ఆశీస్సులను అర్థిస్తున్నాను.

"ఏ పూర్వ పుణ్యమో
ఏనాటి బంధమో
కలిపింది నన్ను
నీతో కలిసింది హృదయం"

— కొమరగిరి కృష్ణమోహనరావు

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్
కవితా కామేశ్వర శర్మ
అవనిగడ్డ - 521 121

పరిమి సుబ్రహ్మణ్యశాస్త్రి  నందిగామ
సమా : యం. ఏ. 1988 దాటకుండా పూర్తి అవుతుంది. ఆటంకములు లేవు. 1989 నుంచి అభివృద్ధి కనిపిస్తుంది. ప్రస్తుతం అష్టమ శని ఇంకా ఒక సంవత్సరం వరకు.

వి. అనూరాధ  అవనిగడ్డ
సమా : మీ నక్షత్రం కూడా అనూరాధ అన్నారు. జన్మంలో ఏలినాటి శని. మరి 10th ఏలా ప్యాసవుతారు. మరల కట్టండి ప్యాసవుతారు. పెళ్ళి సంగతి అప్పుడే ఎందుకు యీ రోజులలో. చేసుకొన్నప్పటినుంచి అత్త పోరు - మామ పోరు - భర్త పోరు యింకా యింకా - అనూరాధ నక్షత్ర జాతకులు జాతకులంటారు గదా అంటే అది మంచి నక్షత్రం గనుక అలా అంటారమ్మా అనూరాధగారూ.

షేక్ దస్తగిరి  గుడివాడ
సమా : బి యల్. పూర్తి అవుతుంది. ఉద్యోగం వస్తుంది. ప్రస్తుతం గురు మహాదశ 89 లో పూర్తి. శని దశ బాగా వుంటుంది. Banks వగైరా సంస్థలలో పరీక్షలు వ్రాయండి ఇంతకూ మీది మచిలీపట్టణమా ? గుడివాడా ?

యం. శశి  బందరు
సమా : శ్రీవాణిలో మీ బ్రదర్ జాతకమును గురించి వ్రాశాను సమాధానం. 1987 రావాలి. దుర్గా స్తోత్రం-పఠించడం మంచిది. రాహుజపం ముఖ్యం.

తాటికొండ వెంకటసుబ్బయ్య సీతానాగులువరము
సమా : భార్య పేరు, మామగారి పేరు, అత్తవారి ఊరు, యిలాటి వివరాలు నాడీ గ్రంధంలో కొంతవరకు దొరకగలవు. జ్యోతిషంలో అలా ఎవరూ చెప్పలేరు. 1987 లో మీకు వివాహం కాదగును. ర స ల వ క న యీ అక్షరము మొదట గల ఆమె మీకు భార్య కావచ్చును (ఊహ). దురదృష్టం కాకపోతే తేలుకుట్టి ఆమె చనిపోవడ మేమిటి ?

కూరాడ కృష్ణ నాగేశ్వరవిఠల్  మచిలీపట్టణం
సమా : జాతకం పంపువారు లేఖ వ్రాయు తేది వగైరాలు వ్రాయనక్కరలేదు స్వామీ విఠల్ దేవా ! ది. 24-1-'87 నుంచి శనిదశ వస్తుంది. ఆ దశ యోగిస్తుంది-37 లో బ్యాంకు జాబ్ రాగల అవకాశం వుంది. 87 ఫిబ్రవరిలో శని జపం చేయించండి. గోచారంలో శని ప్రస్తుతం Bad ఇప్పుడు జాతకరీత్యా కూడా Bad. నిరుత్సాహం అవసరంలేదు. నాలుగు గ్రహాలు స్వక్షేత్రం. ( Bad తాత్కాలికం ) బందరు వచ్చినప్పుడు నా మకాం వ్రాస్తాను. ఆసక్తి వుంటే నన్ను కలవండి.

జొన్నగిరి భిక్షపతి  విజయవాడ
సమా : 1. మీరు ప్రభుత్వ ఉద్యోగి అవుతారు. 2. జీవితంలో 1988 లేక 89 లో స్థిరత్వమునకు నాంది. 3. స్థలం మార్పు జరుగు సూచన గలదు.
మీ యిష్ట దైవమును ఆరాధించండి.

ఫణిభట్ల అన్నపూర్ణ  నందిగామ
సమా : కూపను పూర్తిచేయునపుడు టైం వ్రాయలేదు. నక్షత్రం మాత్రం వ్రాశారు-టైం వుండాలి. అయినా 1987 కూడా మీకు అనుకూలం కాదు. హనుమాన్ చాలీసా చదవండి.



## జ్యోతిషవాణి

పేరు ........................................
పూర్తి చిరునామా..................................
........................................
లేఖ వ్రాయు తేది......................
టైము పగలు/రాత్రి............ .........
జనన తేది...................... లేనిచో సుమారు వయస్సు

రచన : జెఫ్రీ ఆర్చర్

అనువాదం : మల్లాది వెంకటకృష్ణమూర్తి

# న్యూయార్క్‌లోని సెయింట్ రెగిస్ హోటల్‌లో రద్దీగా వున్న ఓ గదిలోని నావంక చూసి ఆమె చేతిని వూపింది.

ఆమె మొహం నాకు సుపరిచితమే కాని పేరు గుర్తురాలేదు. నేను తిరిగి చేతిని వూపాను. ఆమె ఎవరో చుట్టుపక్కలవారిని అడిగేలోగానే అతిథులని, వెయిటర్లని తోసుకుంటూ నా దగ్గరికి వచ్చేసింది.

ఆమె పేరు ఎంత గుర్తుకు తెచ్చుకుందామనుకున్నా తట్టలేదు. ఆమె ఎవరో తెలిసేదాకా జాగ్రత్తగా మాట్లాడదలుచుకున్నాను.

"ఎలా ఉన్నారు ?" అడిగింది. నలభై దాటుతోంది ఆమెకి. ఉచ్చారణని బట్టి అమెరికన్ అని తెలుస్తోంది. జుట్టుని చుట్టలా చుట్టుకుని వున్నది. ఆవిడ తెల్ల బట్టల్లో ఉంది.

"కులాసా. మీరు ?" అడిగాను.

తల వూపింది.

"ఎలా ఉన్నారు మీ కుటుంబ సభ్యులు ?" అడిగాను. ఆమెకి కుటుంబం అసలు వుందో లేదో తెలియకుండానే.

"అంతా కులాసా. లూజీ ఎలా ఉంది ?" అడిగింది.

"బావుంది" చెప్పాను.

అంటే నా భార్య తెలుసన్నమాట. అమెరికా అమ్మాయిలు మొగవాళ్ళ భార్యల పేర్లు గుర్తు పెట్టుకోవటంలో నిపుణులు. వాళ్ళు తరచు విడాకులు ఇచ్చి కొత్త భార్యలని తెచ్చుకుంటారు. కాబట్టి, విధిగా పేర్లు గుర్తు పెట్టుకోవాలి.

"లండన్ నగరానికి ఈ మధ్య మళ్ళీ వచ్చారా ?" అడిగాను.

"మనిద్దరం ఓ మధ్యాహ్నం భోజనం చేశాక మళ్ళీ ఇదే రావటం" చెప్పింది.

సుసేన్.

నా మొట్టమొదటి పుస్తకం అప్పుడే అచ్చయ్యింది. ప్రచురణ కర్తనించి వచ్చిన డబ్బు తక్కువే అయినా, విమర్శకులు దాన్ని అద్భుతమని పొగిడారు.

సుసేన్ న్యూయార్క్ నించి నాకు ఫోన్ చేసి నా పుస్తకాన్ని అమితంగా పొగిడింది. అలాంటి ఫోన్ కాల్స్‌కి పొంగని రచయిత ఉండడు. ఆవిడ తన పేరు చెప్పగానే ఇంకాస్త పొంగిపోయాను.

ఆమె భర్త హాలీవుడ్ లోని సినిమా నిర్మాత. అప్పటికే ఆయన పది హిట్ సినిమాలు తీసాడు.

"నేను ఈ సారి లండన్ వచ్చినప్పుడు మీరు నాతో లంచ్ తీసుకోవాలి" చెప్పింది ఫోన్‌లో.

"కాదు. మీరే నాతో తీసుకోవాలి" చెప్పాను.

"మీ ఇంగ్లీషు దేశస్తులు ఎంత సహృదయులు !"

హాలీవుడ్ నిర్మాత భార్యకోసం కొంత డబ్బు ఖర్చు చేయటం మంచిదే అనుకున్నాను మనసులో. ఆవిడ భర్త నా నవలని సినిమాగా తీయవచ్చు.

ఆరు నెలల తరువాత ఓ రోజు ఫోన్ మోగింది. సుసేన్ అడిగింది, లంచ్ ఎక్కడ చేద్దామని. ఆవిడ లండన్ వచ్చింది.

"మీ ఇష్టం"

"మీ ఇష్టం నేను మీతో లంచ్ చేస్తున్నాను కాబట్టి.... మే ఫెయిర్ " అడిగింది.

" అలాగే "

ఆ మాట అన్నాక వులిక్కిపడ్డాను. లండన్‌లోని అత్యంత ఖరీదయిన హోటళ్ళలో అదొకటి.

" సోమవారం మధ్యాహ్నం ఒంటిగంటకి, సీట్స్ బుక్ చేయడం నాకొదిలెయ్యండి. అక్కడ అంతా నాకు తెలుసు " చెప్పి ఫోన్ పెట్టేసింది సుసేన్.

సోమవారం వున్నంతలో మంచి బట్టలని వేసుకుని, పేంట్ వూడి పోకుండా బెల్ట్‌లా కట్టుకోడానికి పువయోగించని త్రైని మెడకి కట్టుకుని బేంక్‌కి వెళ్ళాను. బేంక్‌లో నా అకౌంట్‌లో ఎంతుందో కనుక్కున్నాను. ముప్పై ఏడు పౌండ్లు, అరవై మూడు పెన్స్. ముప్పైఏడు పౌండ్లకి చెక్ రాసిచ్చాను. పెన్స్ కూడా తీసుకోవాలని వుంది కాని కొంత బేలన్స్ తప్పనిసరిగా అకౌంట్‌లో వుండాలనే నియమం అడ్డొస్తుందని బేంక్ మే నే జ ర్ కరకుగా చెప్పాడు.

మే ఫెయిర్ రెస్టారెంట్‌లోకి అడుగు పెట్టగానే యూనిఫారాల్లో వున్న వెయిటర్లు, ఖరీదయిన సోఫాలు కంటబడ్డాయి. ఓ మూల బల్లముందు మధ్య వయస్కురాలొకామె కూర్చుని వుంది. ఆమె చేతిలోని గ్లాసులో వైన్ వుంది. నన్ను పిలిచింది.

" నాకు మీ పుస్తకం భలే ఇష్టం. బాగా రాశారు " మెచ్చుకుంది ఆమె ఎదురుగా కూర్చోగానే.

" థ్యాంక్స్ " చెప్పాను.

" మీరు వైన్ తీసుకోరు ? " అడిగింది వెయిటర్ కోసం చూస్తూ.

" భోజనం ముందు తాగే అలవాటు లేదు " బయటికి చెప్పి " మీ భర్త నా పుస్తకం సినిమా కోసం కొంటే అప్పుడు నాకా స్తోమత వస్తుంది " అనుకున్నాను మనసులో.

నాట్ ఏ పెన్నీ మోర్ - నాట్ ఏ పెన్నీ లెస్, ది ప్రాడిగల్ డాటర్, షల్ వి టెల్, ది ప్రెసిడెంట్, కేన్ అండ్ ఏబెల్ మొదలయిన పాప్యులర్ నవలలు రాసిన బ్రిటీష్ రచయిత 'జెఫ్రీ ఆర్చర్' ప్రఖ్యాత బ్రిటీష్ రచయిత 'సోమర్ సెట్ మామ్' కథ చదివి ఇన్‌స్పైర్ అయి రాసిన కథ ఇది.

వెయిటర్ ఖరీదైన తోలుతో బైండ్ చేసిన మెనూ కార్డ్‌తో వచ్చాడు నన్ను చూసి. నా నవలకన్నా ఆ కార్డ్ తయారుకే అధికంగా ఖర్చయి వుంటుందని గ్రహించాను. అనవసరమైన డాంబికాలు మే ఫెయిర్‌లో వున్నాయని పించింది.

మెనూ తెరిచి మొదటి అధ్యాయం చదివేసరికి ముచ్చెమటలు పట్టాయి. తోటలో చెట్లకి కాసే పళ్ళు మే ఫెయిర్‌లోకి రాగానే వాటి ధర పదిరెట్లు ఎలా పెరుగుతుందో నా కర్థం కాలేదు. అక్కడినించి వంద గజాల దూరంలో వున్న పళ్ళ దుకాణంలో అవే పళ్ళని అతి చవకలో కొనచ్చు. మెనూకార్డ్‌లో మిగతా పదార్థాల పేర్లు తప్ప, వాటి ధరలు వేయలేదు.

ఆ మెనూకార్డ్‌లోని ఆ హా ర ప దా ర్థా ల జాబితా చదువుతుంటే, నెల నుంచి నేను సరిగ్గా భోజనం చేయలేదన్న సంగతి గుర్తొచ్చింది నాకు.

" ఏం తీసుకుంటారు ? " అడిగాను లేని వుత్సాహాన్ని తెచ్చిపెట్టుకుంటూ.

" మధ్యాహ్నం అస్సలే తినను " చెప్పింది.

తృప్తిగా నిట్టూర్చాను.

" అస్సలే తినను " అంటే ఖర్చు తగ్గకపోగా పెరుగుతుందని క్రమంగా గ్రహించాను

వెయిటర్ ఆమెకి మాంసంతో చేసిన కట్‌లెట్లు, ఇతర ఖరీదైన ' మాంసాహారాలు ' తెచ్చాడు. నేను

## ఏటమ్మా అక్షయా

ఏటోలమ్మ వరదలు
వరదల్లో మా బతుకులు బురదలయిపోతన్నయి
నవతులతో సంతోషంగున్న సముద్రుడి మీద
అలిగిన గోదారమ్మ, అంతర్వేది దేవుడు
అడ్డం సెప్పినా
అన్నా మిన్నా కానకుండా ఇరుసుకుపడింది
ఆ యమ్మ సరె, ఏరూ గెడ్డా ఇయ్యన్నీ
ఎందుకిలా ఇరగబడి పోతన్నయి ?
జనం బతకాలనా ? సావాలనా ?
సిన్నప్పుడు బల్లొ తెలుగు మాష్టారు సెప్పాడులె
నదులన్నీ సముద్రుడికి భార్యలని
సేతకాని నాయకుళ్ళా సేతులు ముడుసుక్కూకోక
సెప్పడేం ఆళ్ళకి జాగరతగుండండని
కసరడేటా కదలి దేవుడు ? సుడి తిరిగే
వాయుగుండాల్ని
ఏటమ్మా ? అక్షయా పెజలకీ కష్టాలు.

— కావిలిపాటి విజయలక్ష్మి

మెనూని జాగ్రత్తగా చూసి తక్కువ ఖరీదుండే శాకాహార పదార్థం తీసుకురమ్మని చెప్పాను.

"ఇంత పిసినారివా ?" అన్నట్లు చూసి వెళ్ళిపోయాడు వెయిటర్. ఆవిడా నా వంక అలాగే చూడటం గమనించి, "ఆట్టే ఆకలి లేదు" చెప్పాను.

ఆవిడ రాబర్ట్ రెడ్ ఫోర్డ్, గ్రేటా గార్బో, షీన్ కానరీ, విట్టోరియా డిసికా లాంటి హాలీవుడ్‌కి చెందిన వాళ్ళ గురించి మాట్లాడుతూ తినసాగింది. మధ్యలో ఆగి "ప్రస్తుతం ఏం రాస్తున్నారు ?" అని అడిగింది.

కొత్త నవల గురించి చెప్తే అది నచ్చినట్లు మొహం పెట్టి, "మంచి నవల అవుతుంది త్వరగా రాయండి" అన్నది.

తన భర్త గురించి చెప్తుందనుకున్నాను కాని ఆయన పేరే ఎత్తలేదు. నేనే ఆయన ప్రసక్తి తీసుకువస్తే ? !! ఊహూ నాకేదో డబ్బు అవసరం ఉండి, ఆవిడకి లంచ్ ఇస్తున్నా ననుకుంటుంది. బావుండదు.

"వైన్ తీసుకుంటారా ?" అడిగాను మర్యాదకోసం.

"వద్దు" చెప్పింది.

నేను కొంచెం తొందరగా నవ్వేశాను.

"వైట్ వైన్ దొరికితే తప్ప" చెప్పింది.

వైన్ సర్వ్ చేసే వెయిటర్ వైన్ కార్డ్ అందించాడు. సగం బాటిల్స్ వుండే బ్రాండ్‌ని, ఆర్డర్ చేసి చెప్పాను తాగాలని నాకూ వున్నా.

"నేను మధ్యాహ్నం తాగను."

కొద్దిసేపట్లో వెండిగిన్నెలో, మంచు ముక్కల మధ్య వైన్ బాటిల్‌ని, నా శాకాహారం సలాడ్‌ని తెచ్చాడు వెయిటర్.

నేను తినే పదార్థం బావున్నా, దాన్ని సరిగ్గా అనుభవించ లేక పోయాను. బిల్లు నా జేబులో వున్న ముప్పై ఏడు పౌండ్లు దాటుతుందనే భయంతో.

ఆవిడ వైట్ వైన్ పూర్తి చేసి చెప్పింది "నేను లండన్ వచ్చినప్పుడల్లా రెడ్ వైన్ తాగుతాను. ఇప్పటికీ మించిపోయింది లేదనుకోండి."

నవ్వలేక నవ్వడం అంటే ఏమిటో నాకప్పుడు అనుభవ పూర్వకంగా తెలిసింది.

మరో బాటిల్ రెడ్ వైన్‌ని ఆర్డర్ చేసిందావిడ. దాంతో పాటు మరో మాంసాహారం.

"ఏపిల్స్ సీజన్ అయిపోయింది. అయినా మీ దగ్గర దొరకచ్చనుకుంటాను ?" అడిగింది వెయిటర్‌ని.

"తప్పకుండా వుంటుంది తీసుకురా" చెప్పాను నేను. బిల్లు గురించి బాధపడే స్థితి దాటిపోయాను. ముప్పై ఏడు పౌండ్లు దాటితే ఆవిడ దగ్గరే అప్పు తీసుకో

దలిచాను. తిరిగి చెల్లించటానికి నా నవల పూర్తయి అచ్చవాలి. బహుళ తన భర్త నా నవల సినిమాకి కొందామనుకున్నా కొననివ్వదు అప్పు తీసుకుంటే.

" ఆఖరి ఏపిల్ ఒక్కటే వుంది మేడమ్ " వెయిటర్ చెప్పాడు.

" అదృష్టం ! తీసుకురా " చెప్పాను.

" ఇంకా ఏమైనా కావాలా ? " అడిగాడు వాడు చిరునవ్వుతో.

ఇంకేం అడుగుతుందోనని వూపిరి బిగపట్టాను నేను.

" కాఫీ చాలు " చెప్పింది.

" మీకు ? "అడిగాడు నన్ను.

" ఏం వద్దు " చెప్పాను.

" అదేం ? " అడిగిందావిడ ఆశ్చర్యంగా.

" నేను పుట్టాక ఇంతదాకా కాఫీ అనే పదార్థమే తాగలేదు " నీటుగా అబద్ధం ఆడేశాను.

నమ్మలేనట్టుగా ఆవిడ నా వంక చూస్తుంటే, బూటు లేసు కట్టుకుంటున్నట్టుగా కిందకి వంగాను, ఆవిడ మొహంలోకి చూసి దొంగ నవ్వు నవ్వలేక.

తప వేనిటి బ్యాగ్ తెరిచింది. అందులోంచి నా నవలని తీసి అందించి " మీ సంతకం పెట్టండి " అడిగింది.

నేను సంతకం చేస్తుండగా ఆ వెయిటర్ని చూస్తే బావుండుననుకున్నాను కాని కనుచూపు మేరలో వాణ్ని కనబడలేదు.

అంతదాకా కనపడని, ఆకుపచ్చ రంగు యూనిఫాంలో వున్న వెయిటర్ వెండి ట్రే మీద మడిచిన బిల్‌ని తీసుకొచ్చి నా ముందు వుంచాడు.

బిల్ ఎంతై వుంటుంది ? నా గుండె గబగబ కొట్టుకుంటుంటే దాన్నందుకుని కొద్దిగ తెరిచి చూసాను.

ముప్పైఆరు పౌండ్లు, నలభై పెన్స్.

జేబులోంచి సరికొత్త నోట్లని తీసి సిల్వర్ ట్రే మీద వుంచాను. కొద్దిసేపటికి ఆ ఆకుపచ్చ రంగు బట్టల వ్యక్తి చిల్లరతో వచ్చాడు.

## మనసు

కొత్త కొత్త
" కోరికల పాపాయిల్ని " కంటూ
వాటికి
లాలలు పోస్తూ
జోలలు పాడుతూ
' బువ్వ ' పెడుతూంటుంది !
అది ఎప్పటికీ
ఓ " పచ్చిబాలెంతరాలు ! "

— కె. కిశోరుబాబు

నేను ఏమాత్రం సంశయించలేదు. మిగిలిన అరవై పెన్స్ తీసుకుని జేబులో వేసుకున్నాను. ఇంటికి బస్సులో వెళ్ళాలంటే ఆ డబ్బు తీసుకోక తప్పదు.

వెయిటర్ నావంక చూసిన చూపుని ఆవిడ గమనిస్తే తన భర్తకి అతన్ని నటుడిగా తీసుకోమని చెప్పి వుండేది. కాని ఆవిడ నా అదృష్టం కొద్దీ ఇవేం గమనించ లేదు.

ఆవిడ లేచి బయటికి నడుస్తుంటే మిగతా బల్లల ముందు కూర్చున్న అనేకమంది ఆవిడని గుర్తించి చేతులు వూపారు.

తలుపు దాటి కర్జన్ రోడ్ మీదకి వచ్చాం. తళ తళ మెరిసే ఓ రోల్సు రాయెస్ కారు వచ్చి ఆగింది. యూనిఫాంలో వున్న డ్రయివర్ కారు దిగి వెనకాల తలుపు తెరిచి పట్టుకున్నాడు. ఆవిడ కారులో కూర్చోగానే తలుపు మూసేశాడు.

" గుడ్‌బై మంచి భోజనం ఇచ్చినందుకు థ్యాంక్స్" చెప్పింది.

" గుడ్‌బై - మీరు మళ్ళీ లండన్ వచ్చినప్పుడు మీ భర్తని కలిసే అవకాశం లభిస్తుందని ఆశిస్తాను " చెప్పాను.

" అరె ! మీకు తెలియదా ? " అడిగిందావిడ.

" ఏమిటి తెలియాలి ? " అడిగాను.

" మేం విడాకులు తీసుకొని నాలుగు నెలలయింది. "

" విడాకులు తీసుకున్నారా ? "

" అవును. ఆ తర్వాత మళ్ళీ ఆయన్ని చూడలేదు నేను. అసలు చూడదలుచుకోలేదు "

నా మొహం లోని బాధని ఆవిడ అపార్థం చేసుకుంది.

" బాధపడకండి నేను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాను. నిజానికి నా భర్త కనపడవచ్చనుకున్నాను ఇవాళ ఇక్కడే .... ఈ రెస్టారెంట్ ఆయన స్వంతం. "

రోల్స్‌రాయిస్ కదిలి వెళ్ళిపోయిన కొన్ని నిమిషాల దాకా నేను అలాగే నిలబడి పోయాను. తర్వాత ఇంటికి వెళ్లే బస్‌స్టాప్ వైపు నడవసాగాను.

నా భార్యకి ముప్పైఏడు పౌండ్ల గురించి ఏం చెప్పాలి ? నా మీద విరుచుకు పడుతుంది ఆ డబ్బుని ఎక్కడ ఖర్చు పెట్టానో తెలిస్తే. ఏం కథ అల్లాలా అని ఆలోచించ సాగాను.

* * *

సెయింట్ రెగిస్ హోటలులో రద్దీ వున్న ఆ గదిలో నన్ను పలకరించిన, తెల్ల బట్టల్లో, జుట్టుని చుట్టగా చుట్టుకున్న సుసాన్ వంక చూస్తూ, ఆవిడెవరా, ఎక్కడ చూసానా అని ఆలోచించసాగాను. గుర్తు వచ్చీ రాకుండా వుంది.

" నన్ను మీరు మర్చిపోతారనుకోలేదు. మిమ్మల్ని చాలాకాలం క్రితం అప్పటి నా భర్త హోటల్ మేఫెయిర్‌కి లంచ్‌కి తీసుకెళ్ళాను. " చెప్పింది.

అప్పుడు గుర్తుకొచ్చింది. ఆవిడ మాత్రమే కాదు. ముప్పైఏడు పౌండ్ల ఖర్చు చేసినందుకు నా భార్య నన్ను తిట్టిన తిట్లు.

(డబ్ల్యు సోమర్ సెట్ మామ్ కథ ' అతిథి ' ఇన్‌స్పిరేషన్‌లో రాయబడ్డ కథ ఇది.) ★

# తులసి

యస్. యస్. దుర్గారావు

( OCIMUN SANCTUM )

తులసి మొక్క పవిత్రమగు క్షుపము. భారత దేశంలో విశేషించి ఆంధ్ర రాష్ట్రములో తులసికోట లేని గృహముండదు. ఈ మొక్క పుట్టుక గూర్చి పురాణాలలో దీనికొక గాధ కలదు.

పూర్వము శ్రీకృష్ణుడు తులసీ వనమున విహరించెడివాడట! తులసి వనమున శవమును ఎంతకాలముంచిననూ చెడిపోదట! తులసిగాలి, స్పర్శ మిక్కిలి ఆరోగ్యదాయకము. ఈ విషయాన్ని విదేశీయులు గ్రహించి వారుకూడా తమ నివాసముల సమీపమున స్థలములలో ఎక్కువగా పెంచుతున్నారు. తులసి ఉన్నచోట భూత ప్రేతాత్మల బాధ ఉండదు.

తులసి దేవతలకు ప్రీతి పాత్రమైనది. పూర్వము సిద్ధులు దీనిని వైద్యమున అమితముగా ప్రయోగించిరి గాన ఇది సిద్ధ మూలిక అయినది. దేవతలు, ఋషులు, సిద్ధులు, రాజులు మొదలైనవారు తులసి కాండమును పూసలుగా చేసుకుని ధరించేవారు. నేటికీ ఈ పూసలను ధరిస్తూనే ఉన్నారు.

తులసిలో పలురకములు కలవు. కృష్ణ తులసి, లక్ష్మి తులసి ముఖ్యమైనవి. అడవి తులసి అని మరియొకటి కలదు. కృష్ణతులసి ఊదా వర్ణము కలిగియుండును. లక్ష్మి తులసి మామూలు ఆకుపచ్చ వర్ణమే. అడవిలో పెరుగునది అడవి తులసి ( Wild Ocimun Sanctum ). ఇది మోటు కలిగిన ఆకులుగా నుండును. తులసి మొక్క గూర్చి అందరకూ తెలియును గాన వర్ణన అనవసరమే!

తులసి రుచి పరిశీలించిన కారము, చిరుచేదు కలిగి ఉండునని తెలియును. లఘు గుణము, ఉష్ణ వీర్యము. పార్శ్వ శూల, కుష్ఠ, మూత్రకృచ్ఛ్ర, హృద్రోగములను నశింపచేయును. క్రిములను చంపును. దగ్గులు, వాంతులను కూడా అరికట్టును.

తులసి ఆకు రసమును అగ్గిపురుగు కుట్టినచోట రాసిన విషము హరించును; తులసి రసము వాతముగల అంగమునకు రాసిన ఆయా వాతములు హరించును; తులసి ఆకు పసరుతో నిమ్మరసం చేర్చి, గజ్జి, తామర మొదలగు చర్మరోగములచే బాధపడుచున్న వారి శరీరమునకు పూసి, అరగంట గడచిన పిదప స్నానము చేసిన ఆయా చర్మ రోగములు తగ్గిపోవును. ( ఇటుల రెండు మూడుసార్లు చేయవలెను. ) ఆకు రసములో మిరియాల చూర్ణము




కలిపి త్రాగిన శ్లేష్మ జ్వరము నివారణ యగును; ఆకు కషాయం త్రాగుచున్న ఉదరములోని క్రిములు నశించును; కృష్ణతులసి రసములో తేనె చేర్చి సేవించిన శ్లేష్మకాసలు కట్టును; తులసి రసము రెండు చుక్కలు చెవిలో వేసిన కర్ణశూలలు హరించును! తులసి రసములో మోదుగ గింజ భావనచేసి అదినూరి, కంటికి కాటుక పెట్టిన కంటిలో తెల్ల పొరలు హరించును; తులసి రసములో పసుపు కలిపి ముఖమునకు రాసిన శోభి, మొటిమను హరించును; ఎండబెట్టిన ఆకు చూర్ణము నస్యము చేసిన పీనస రోగములు పోవును; తులసిఆకు పొగపీల్చిన ఆమవాతము హరించును; జలుబుచేసి ముక్కు వెంబడి శ్లేష్మము పడుచున్న తులసి రసములో అడ్డసరము రసము కలిపి సేవించిన తగ్గును; కృష్ణతులసి ఆకులు రోజుకు 6 లేక 7 చొప్పున తేనెతో సేవించుచున్న హృదయమునకు మంచిది; కృష్ణ తులసిఆకులు 8, మిరియాలు 3, మెంతులు20 ఈ మూడిం

( తరువాయి 29వ పేజీలో )

# ఆఫ్రికా ఖండాన్ని హడలెత్తిస్తున్న క్వేలాపక్షి

ఆఫ్రికాను హడలెత్తిస్తున్న క్వేలాపక్షి




ఒక చిన్న పక్షి పెద్ద ఖండాన్ని హడలెత్తిస్తున్న దంటే నమ్మటం కష్టమే. కాని క్వేలా పక్షి ఆఫ్రికా ఖండంలో సహారా ఎడారికి దక్షిణంగా వున్న అనేక దేశాల ప్రజలను గడగడలాడిస్తున్నదనే విషయం యదార్థం. ఆ దేశాలలో రైతులు పండించే పంటలో సుమారు నలభై శాతం పంట క్వేలా పక్షులు తినేస్తున్నాయి. ఆఫ్రికా ఖండంలో తరచుగా సంభవించే క్షామానికి అక్కడి వాతావరణ పరిస్థితులే కాక క్వేలా పక్షులు కూడా కారణమని నిర్ధారించడం జరిగింది. ఆఫ్రికా ఖండం మొత్తంమీద వెయ్యి మిలియన్‌ల క్వేలా పక్షులున్నాయని, ఒక్కొక్క మిలియన్ పక్షులు రోజుకు అరవై టన్నుల ధాన్యాన్ని తింటాయని అంచనా. దీనినిబట్టి ఆ ఖండానికి క్వేలా పక్షి ఎంత చేటు చేస్తున్నది ఊహించవచ్చు.

ఆకారంలో క్వేలా పక్షి మన పిచ్చుకను పోలి వుంటుంది. ముక్కురంగు మాత్రం ఎఱ్ఱగా వుంటుంది. వరి, గోధుమ, బార్లీ, జొన్న వంటి ధాన్యాలన్నీ క్వేలా ఆహారం. జనవరి నుండి ఏప్రిల్ వరకుండే కాలం వీటి సంతానోత్పత్తి సమయం. సరిగా ఆ సమయంలో మగ క్వేలా పక్షి శరీరంమీది పాత ఈకలు పోయి ఎఱ్ఱ రంగులో వుండే ఈకలు వస్తాయి. ఆడ పక్షి ముక్కురంగు పసుపు పచ్చకు మారుతుంది. ఈ మార్పులు మగ, ఆడ పక్షుల మధ్య ఆకర్షణ కలిగేందుకు ఉపయోగపడతాయి.

గుబురుగా వుండే పొదలలో క్వేలా పక్షులు గూడు అల్లుతాయి. ఈ గూడు నిర్మాణం మన ప్రాంతంలోని గిజిగాడు గూడును పోలి వుంటుంది. ఒక్కొక్క పొదలో నాలుగు వందల గూళ్ళ వరకు వుంటాయి. ఆడ పక్షి 2-4 గుడ్లు పెడతాయి గుడ్లు పదిరోజుల్లో పొదగబడతాయి. పిల్ల క్వేలాలకు ఆరంభంలో కీటకాలు ఆహారం. దీనివల్ల పిల్ల పక్షులు అతి త్వరగా ఎదుగుతాయి. ఎదిగిన క్వేలాలు మాత్రం స్వచ్ఛమైన శాకాహారులు.

ఒక్కొక్క పొదనుండి కొన్నివేల పక్షులు ఒక్కసారిగా బయటపడతాయి. అక్కడ నుండి ఈ పక్షులు ఏ పని చేసినా సామూహికంగా చేస్తాయి. వీటి సామూహిక గమనం మిడుతల దండును గుర్తుకు తెస్తుంది. క్వేలా పక్షి పుట్టిన మూడు వారాల్లో సంతానం పొందేందుకు సిద్ధమవుతుంది. అందువలననే ఈ క్వేలా పక్షుల జనాభా అమిత వేగంగా పెరుగుతున్నది.

ఆఫ్రికా రైతులు క్వేలా జాతిని అంతం చెయ్యాలని ఎన్నో ప్రయత్నాలు చేశారు. 1954 లో ఒక్క సీజన్‌లో 124 మిలియన్ పక్షులను సంహరించారు. అయినా నేడు వాటి సంఖ్య తిరిగి ఎప్పటిలానే వున్నది. డైనమట్‌లు పేల్చారు, బాంబులు వేశారు, విష పదార్థాలు చల్లారు, పొదలు తగలపెట్టారు. సంవత్సరానికి ఒక లక్ష ఏభైవేల డాలర్లు ఖర్చు చేస్తున్నారు.

క్వేలా మాంసం చాల రుచిగా వుంటుంది. దీనికి ఐరోపా దేశాల హోటళ్ళలో మంచి గిరాకీ వున్నది. ఒక పక్షిని ముప్పయి సెంట్లు ఖరీదుకు కొంటారు. కాని భారీ మోతాదులో ఎగుమతి చేయటం కుదరడంలేదు.

ఒక టన్ను మాంసం తయారుచేయాలంటే లక్ష క్వేలా పక్షులను చంపాలి. కాని అంత ఎక్కువ సంఖ్యలో క్వేలా పక్షులను ఒకేసారి చంపగల సులభ మార్గాన్ని అటు శాస్త్రవేత్తలు గాని, ఇటు రైతులు గాని కనుక్కోలేక పోయారు.

ఇదిలా వుండగా ఈ సంవత్సరం జింబాబ్వేలో పండిన పంటలో పన్నెండువేల టన్నుల గోధుమను, రెండువేల టన్నుల బార్లీని క్వేలా పక్షులు తినేసాయి. పరిష్కారం కనపడని ఈ క్వేలా పక్షుల సంతానోత్పత్తి సీజన్ తిరిగి ఈ జనవరిలో ఆరంభమవుతున్నది. సహజంగానే అక్కడి రైతులకు హడలు పుడుతున్నది.

—డాక్టర్ దుగ్గరాజు శ్రీనివాసరావు

తులసి ( 27వ పేజీ తరువాయి )

టిని చూర్ణము చేసి బహిష్టు నొప్పితో బాధపడే వారికిచ్చిన నొప్పి శాంతించును; తులసిరసము, వెల్లుల్లి రసమును కలిపి రెప్పలు మృదువుగా తోమిన "పోధకి" హరించును. (పోధకి అనగా కంటి రెప్పలలో చిన్న పొక్కులవలె లేచును); తులసి గింజలు మూత్రమును జారీచేయును; తేలు కుట్టినచోట పలుమార్లు వేరునుత్రిప్పిన విషము హరించును;

అడవి తులసి ఆకులు ప్రక్కపై పరచి వాటిపై నిద్రించిన మంచి నిద్రపట్టును; కొంచెం లోనికి సేవించ వచ్చు; ఈ ఆకులను నూరి ప్రసవం కాక కష్టపడు చున్న వారి పొత్తికడుపై వేసికట్టినను లేదా ఆకు రసం తులము మోతాదులో యిచ్చినను వెంటనే ప్రసవించెదరు.

★★

## ప్రశ్నలు-సమాధానాలు

1. తెలుగు పుస్తకాలలో అత్యధికసంఖ్యలో అమ్మకమైన పుస్తకమేది? దానిని రచించిన దెవరు?
2. ప్రముఖ ఇంగ్లీష్ రచయిత మార్క్‌ట్వెయన్ అసలు పేరేమిటి?
3. "రాజ తరంగిణి" ని రాసినదెవరు?
4. మనదేశంలోఉన్న కేంద్రపాలిత ప్రాంతాలెన్ని?
5. భారత వాయుసేన ఎప్పుడు ఏర్పడింది?
6. ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించిన మొదటి భారతీయ మహిళ ఎవరు?
7. 'Morning Star of Indian Renaissance' ఎవరు?
8. భారత రాజ్యాంగమును రూపొందించుటకు ఎంత కాలం పట్టింది?
9. వేదము లెన్ని? వేదాంగాలెన్ని?
10. "భారతదేశపు నెపోలియన్"గా పేర్గాంచినదెవరు?
11. అత్యధిక జనసాంద్రత కల రాష్ట్రమేది (మన దేశంలో)
12. ఈవెనింగ్ స్టార్ అని పేరొందిన గ్రహమేది?
13. భారతీయ రైల్వేలు ఎన్ని భాగాలుగా విభజింపబడినవి?

1. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిచే రచింపబడిన గయోపాఖ్యానం 2. శామ్యూల్ లాన్ గోర్న్ క్లెమెన్స్ 3. కల్హణ కవి, 4. 9, 5. 193., ఏప్రిల్ 1 న 6. బచేంద్రిపాల్ 7. రాజారామమోహనరాయ్ 8. 1946, డిసెంబర్ 9 నుండి సుమారు 3 సం॥ లు 9. 4;6 10. సముద్రగుప్తుడు 11. కేరళ 12. వీనస్ 13. 9

# విజయవా కనకదుర్గ

శ్రీదేవీ పరాశక్తి, త్రిపురసుందరి, లలిత, రాజ రాజేశ్వరి, మొదలైన పెక్కు నామములతో వ్యవహరింప బడుతోంది. సృష్టిస్థితి లయకారిణి యైన దేవి, పరబ్రహ్మ మనబడు దానికంటె భిన్నము కాదు, స్త్రీ కాని, పురుషుడును కాని కాదు. నివృత్తి ముఖంగా ఉన్న పరబ్రహ్మను, బ్రహ్మ అనీ, ప్రవృత్తి ముఖంగా ఉన్న సచ్చిదానంద బ్రహ్మ వస్తువును పరాశక్తి అనీ, భక్తులు భావిస్తారు. నామ రూపాత్మకమైన సృష్టి అంతా, పరాశక్తి విలాసమే. అందులోని చేతన విలాసమంతా బ్రహ్మ స్వభావం – అంటే, శివస్వభావం.

## పైడిపాటి సుబ్బరామశాస్త్రి

ఇంకా చెప్పాలంటే, శక్తిమయమైన అఖండ విశ్వమూ పరాశక్తి విలాసం. సృష్టి స్థితి లయములను సంపాదించేది శక్తి. దానిని స్త్రీగా నవరాత్రములలో ఆరాధిస్తారు. బ్రహ్మకు సృజనాశక్తి, విష్ణువుకు రక్షించే శక్తి, శివునికి లయశక్తి, పై శక్తి స్ఫురణం వల్లనే కలుగుతోందని దేవి భక్తుల ప్రవచనం.

పరమేశ్వరుడు శక్తికి అధిష్ఠానం. ఆధారమంటున ఈశ్వరుని విడచి శక్తి ఉండజాలదు. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు లేకుంటే శివుడూ నిస్సహాయుడే. ఇదే శివ శక్తి సంబంధం. ఇంకా వివరించాలంటే, శివునిలోని శక్తియే ప్రకృతి శక్తి, అదియే దేవి. ఈ దేవిలోని రాజసీ శక్తి మహా సరస్వతి. సాత్త్వికీ శక్తి మహా లక్ష్మి. తామసీ శక్తి మహాకాళి. ఈ మూడు శక్తులున్న కారణముచేత త్రిమూర్తులు సృష్టి స్థితి లయములకు సమర్థులు.

ప్రకృతి పురుషులందు వాస్తవంగా అంతరం లేదు. సృష్టికి దేవి ప్రథమముగనున్నది కనుక ప్రకృతియని వ్యవహరింప బడుతోంది. దుర్గాదేవి శివప్రియ, శివ స్వరూప, పరమాత్మయొక్క సర్వశక్తి స్వరూపిణి. దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ కోసం బహు రూపాలు ధరిస్తుంది. గౌరి, బ్రహ్మి, రౌద్రి, వారాహి, వైష్ణవి, వారుణి, కౌబేరి, నారసింహి, పరాశక్తి స్వరూపాలే.

## ఆర్యావర్తము

మనము భరతవర్షములో భరతఖండములో నున్నాము. మొత్తం భారతావనికి ' ఆర్యావర్తం ' అనే పేరున్నది. సృష్టి ఈ దేశంలో సరస్వతీ దృషద్వతీ నదుల నడుమ జరిగినది. ఇది యజ్ఞీయమైన దేశం. కనుక పుణ్యభూమి. సర్వ మానవులును, ఇచ్చట నుండియే మిగిలిన దేశములకు క్రమ క్రమముగా పోయినారు. సంస్కృతం మొదటి భాష. దాని వికారాలు ప్రాకృతాలు దాని వికారాలు సర్వ దేశ భాషలును, కనుక భారతమే సర్వ ప్రపంచమునకు మూల పీఠము. గురు పీఠము – " సర్వే జనా స్సుఖినో భవంతు " అని ప్రతి దినం ఆకాంక్షించేవాడు భారతీయుడు. ఇది కర్మ భూమి. ఋషిప్రోక్తములైన పురాణములును, తొలి పలుకులును, ఇక్కడే ప్రభవించినాయి.

## శక్తిస్థానములు

భారతదేశం నిండా, శక్తి స్థానములు, శివ స్థానములు నున్నవి.

" అనంతో వై వేదాః "

అని యున్ననూ, నాలుగు వేదములనే మనము పేర్కొనుచున్నాము. ఉప పురాణములున్ననూ, అష్టాదశ పురాణములనే పేర్కొనుచున్నాము. అ అనేక శక్తి స్థానములున్నను అష్టాదశ పీఠములనే పేర్కొనుచున్నాము. విజయ వాటిక యందు దుర్గాదేవి యొక్క శక్తి. పరాశక్తికి ప్రతీకయగు అమ్మవారి ఆలయ

మున్నది. ఆ సేతు శీతాచల పర్యంతమిది సేవ్య స్థానము. కాశి నుండి రామేశ్వరము, రామేశ్వరము నుండి వారణాసి పోవు వారీ దేవతను దర్శింపక ఉండరు. భారతీయైకాత్మతకిది ఒక నిదర్శనము. తెలుగునాట సోదె చెప్పువారి నోట, కంచి కామాక్షి, మధుర మీనాక్షి, బెజవాడ కనకదుర్గ నామములు ప్రార్థనలో తాండవ మాడుచుండును.

తామగ్ని వర్ణాం తపసాజ్వలంతీం
వైరోచనీం కర్మ ఫలేషు జుష్టాం
దుర్గాం దేవీం శరణ మహం ప్రపద్యే —

అను శ్రుతి మంత్రము దుర్గాదేవి స్వరూపమును వెల్లడించు చున్నది. మార్కండేయ పురాణాంతర్గత దుర్గా సప్తశతి పలువురకు పారాయణ గ్రంథము.

## ఇంద్ర కీలాద్రి

మానవ నిర్మితములయిన మూర్తుల కన్న, స్వయ
వ్యక్తములైన విగ్రహములు ప్రశస్తములు. భూమి
నున్న ఆలయముల కన్న భూధరములపై నున్న ఆల
ములు ప్రశస్తములు. ఇంద్ర కీలాద్రి యొక భూధరమ
ఇంద్రకీలుడను యక్షుడు తపస్సు చేసి దేవిని తన
నిలచి యుండవలసినదిగా వరము కోరి తదనురూపము
నతడు పర్వత రూపమును ధరించినాడు. ఆ గి
మంగళాద్రి నరసింహస్వామి నెలకొన్న పర్యంతం ఒ
కీల వలె నున్నది. మహిషాసురుని, దుర్గమాసురు
సంహరించిన శక్తి స్వరూపిణి కొండపై వెలసినది.

" ఉమా కాత్యాయనీ గౌరీ కాళీ హైమవతీశ్వరీ
శివా భవానీ రుద్రాణీ శర్వాణీ సర్వ మంగళా
అపర్ణా పార్వతీ దుర్గా మృడానీ చండికాంబికా

## నీతి మంజరి

శ్లో॥ అనిత్యాని శరీరాణి
విభవో నైవ శాశ్వతః
నిత్యం సన్నిహితో మృత్యుః
కర్తవ్యో ధర్మ సంగ్రహః

ప. స్థిరముకాదు తనువు స్థిరముకాదు ధనమ్ము
స్థిరముకాదు ప్రాణ మరయనెపుడు
ధర్మమే స్థిరమ్ము ధర్మమే దైవమ్ము
ధర్మ నిరతి వీడఁదగదు భువిని

శ్లో॥ సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్
సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్
షణ్ణాం రసానాం లవణం ప్రధానమ్
భవేన్నదీనా ముదకం ప్రధానమ్

ప. అరయ దేహమందు శిరము ప్రధానమ్ము
ఇంద్రియముల లోచనేంద్రియములు
ఆఱు రసములందు నగు ప్రధానముప్పు
నదులకిల ప్రధాన ముదకమండ్రు

శ్లో॥ ఏకై కాగౌ త్రయస్సింహాః
పంచ వ్యాఘ్రాః ప్రసూతిభిః
అధర్మో నష్ట సంతానః
ధర్మస్సంతాన వర్ధనః

ప. అవున కొకటొకటి హరులకు మూడేసి
పులులకైదునైదు పుట్టు శిశులు
గుణము సత్త్వమౌట గోజాతి వర్ధిల్లె
తామసమ్మున మృగ తతి నశించె

— పృథివి సుబ్బనాగయ్యకవి

ఇవి యన్నియు దుర్గకు పర్యాయ పదములే. "దుఃఖేన గంతుం శక్యతే దుర్గా" అని ఒక వ్యుత్పత్తి. కష్టముచే నెఱుగదగినదని భావము. పరాశక్తి నెఱుగుటకు జ్ఞాన సంపన్నుడు కావలెను కదా! జ్ఞాని యగుట కష్ట సాధ్యము కదా! ఇక, భక్తితో కొలచిన దేశమును, దుర్గ, దుర్గమువలె రక్షించును. తూర్పున జగన్నాథ క్షేత్రమునకు దగ్గఱలో "భువనేశ్వరి" దక్షిణమున కన్యాకుమారి యగ్రమున "కౌమారి" యు, పశ్చిమ మున "బృందావన మందు" రాధా దుర్గ యు, నుత్తర మున హిమాచల ప్రదేశమున "హైమవతి" యు, దుర్గా స్వరూపములే. శాక్తేయ తంత్రముల ననుసరించి అష్టోత్తర శత దుర్గా పీఠములు కలవనియు అందు అష్టాదశ దుర్గలు ప్రధానములనియు, అందు [1] బాల [2] కౌమారి [3] త్రిపురసుందరి [ ] కల్యాణి [5] కామాక్షి [6] ఉమ [7] మీనాక్షి [8] సుభద్ర [9] సతీదేవి బాలదుర్గ లనియు, [1] శైల పుత్రి [2] బ్రహ్మచారిణి [3] చంద్రఘంట [4] కూష్మాండ [5] స్కందమాత [6] కాత్యాయిని [7] కాళరాత్రి [8] మహాగౌరి [9] సిద్ధి దాత్రి, ప్రౌఢ దుర్గలనియు, నివి కాక స్థల దుర్గ, గ్రామ దుర్గ, నదీదుర్గ, వన దుర్గ, పర్వత దుర్గ, సాగర దుర్గ, గ్రామ దుర్గ, పట్టణ దుర్గ, రణ దుర్గ, చండీ దుర్గ, శూలిని దుర్గ, రూప ములతో జగన్మాత ఉపాసించబడుచున్నదనియు దీవి నరసింహాచార్యులవారు వ్రాసి యున్నారు. విజయవాటీ దుర్గను బ్రహ్మచారిణీ దుర్గగా భావించుచున్నారు. బ్రహ్మ యనగా తపస్సనియు దాని నాచరించినది కావున బ్రహ్మ చారిణి యనియు నొక యభిప్రాయము. కనుక దుర్గా క్షేత్ర మహాత్మ్యము స్కాందములోని సహ్యాద్రి ఖండము లోనను, పద్మ పురాణ పూర్వభాగములోనను, బ్రహ్మాండ పురాణపు టుత్తర ఖండమందును విశిష్టమై యున్నది.

### కృష్ణవేణి

"నదీ నా మగ్రజన నాన్మాహాత్మ్యాచ్చ మహత్వతః
సర్వాం కర్షతి చాఘౌఘం తేన కృష్ణా ప్రకీర్తితా"

నదులలో అగ్రజ, సర్వపాప కర్షిణి యగుటచే "కృష్ణ" అని, యీశ్వర వచనము. "యేయం దక్షిణతో గంగా, సాదేవీ ప్రసీదతు" అని మార్కండేయుడు కృష్ణను దక్షిణ గంగగా కీర్తించెను. సాక్షాద్విష్ణు శరీరిణి కృష్ణానది యని ఈశ్వరుడు స్కందునితో చెప్పెను. "విష్ణుపాదోద్భవా గంగా, అపరాదేహ సంభవా, ఏకత్ర శస్యతే స్నానం,

పానమేకత్ర శస్యతే" గంగయందు స్నానము విశేషము కాగా, కృష్ణయందు పానము విశేషమని యొక వచనము. గంగాది నదులు బ్రహ్మ సృష్టి. అంతకు పూర్వమే విష్ణువుచే సృజింపబడి బ్రహ్మకు దత్తము చేయబడినది. " మాతరం సర్వతీర్థానాం, నదీనాం అగ్రజం " అని స్కాందమున విష్ణువు బ్రహ్మతో చెప్పినట్లున్నది. పడమటి కనుమల నుండి సాగర సంగమము వఱకును దాని పొడుగు 795 మైళ్ళు. శ్రీశైలము వఱకును గంగ ఇచ్చు ఫలితము నిచ్చును కాని యాపైన నూఱు రెట్లు ఫలదాయి.

" అఘనాశన సామర్థ్యం ప్రాప్నువంతి పునః పునః, స్నాత్వాణాం పాత కాద్గంగా జాతా వాయస రూపిణీ, సంగమస్నాన పూతాపై యాతి హంస స్వరూపతః హంస తీర్థం తతః ప్రోక్తం సంగమం పావనాశనమ్ " అని స్కాందపురాణము. గంగ, జనుల పాపముల మోసి కొని, కాకి రూపముతో వచ్చి, మునిగి హంసయై వెడలి పోవునట ! ఆ ప్రదేశమే హంసలదీవి.

" ఇయంవై నిర్మితా పూర్వం మయావై వేదరూపిణీ। వేదో పాదాత్సముత్పన్నా పుణ్యా లోకైక పావని " అని, బ్రహ్మ, కృష్ణానదిని సాగరుని కప్పగించెను. కృష్ణానది ప్రభావ మిట్లుండుటవలన జనులకు మిగిలిననదుల యందాదరము తగ్గగా, నవి మొఱపెట్టుకొనగా కృష్ణామాహాత్మ్యము నాతడు తన మాయచే కప్పిపుచ్చెను. పుష్కర సమయములయందు మాత్రమది ద్యోతకమగు చుండును.

## కనకదుర్గ

దుర్గాదేవి ఇంద్రకీలాద్రిపై వెలయుటతో, నీశ్వరుడును మల్లికేశ్వరుడై యచ్చట వెలసెను. మహిషాసురునిపై విజయముతో జయపురిగా పేరుగాంచిన నేటి విజయవాడ, స్వర్ణరూపమున వెలుగొందు కనకదుర్గ విలసిల్లుటచే ఇంద్ర కీలాద్రి, కనకాద్రి యయ్యెను. పురము కనక పురమయ్యెను. దుర్గాదర్శనమున పాపములు పటాపంచలగును. పుణ్యాత్ములకు దుర్గకొండ, బంగరుకొండగనే కన్పించును.

## నేనెవర్ని

తెరపై బీదరికం చూసి
వెక్కి వెక్కి ఏడుస్తుంటా !
ఎదురుగా బీదరికం చూసి
వెక్కిరిస్తూ పోతుంటా !!

– పాటిబండ్ల శ్రీమన్నారాయణ

" తత్పశ్చా దర్జునశ్చాపి తపస్త్వాతు ఫల్గునః, మల్లికేశ్వర దేవాచ్చలబ్ధ్వా పాశుపతం ధనుః, స్తుతించక్రే తతఃపశ్చాద్విజయాహి పురీహ్యాభూత్ " విజయుడు మల్లయుద్ధములో శివునిచే నభినందింపబడి పాశుపతాస్త్రమును సంపాదించిన ప్రదేశమగుటచే నిది విజయపురి యయ్యెను. విజయుడు ఆ గిరిపై లింగమును ప్రతిష్ఠించెను. అదియే నేటి విజయేశ్వరాలయము.

సాగర సంగమము అనగా పతి యోగము నాకాంక్షించి వచ్చు కృష్ణకు, ఇంద్రకీలాద్రి యడ్డు వచ్చెను.

" బీజ నిక్షేపణాద్ధాత్రోరియం బీజపురీమతా కీలాద్రి దక్షిణే భాగే నృసింహోయత్ర తిష్ఠతి " అనుట వలన కృష్ణానది ఓషధుల బీజముల తీసికొనిపోవుచు నడ్డము వచ్చు నింద్ర కీలాద్రి యందుంచుట వలన నిది బీజపురి యయి క్రమముగా బెజవాడగా మాఱియుండవచ్చును, యుద్ధమల్లుని శాసనమున బెజవాడగా పేర్కొనబడినను. శ్రీకృష్ణదేవరాయ లాముక్తమాల్యదను "విజయవాటిక" అనియే వాడెను. అమ్మవారి పేర్లలో " విజయ " యొక్కటి.

## మల్లికేశ్వరుడు

(1) శ్రీశైలము (2) మహానంది (ఓంకారము) (3) త్రిపురాంతకము (4) దొనకొండ (5) సిద్ధముని

పురము (సిద్ధవటము) ఉమామహేశ్వరము, హేమలాపురి- (6) సిరికొండ (7) చేజెర్ల (కపోతేశ్వరము) (8) కోటప్పకొండ (9) అమరావతి (10) తాటికొండ (11) గుంటూరు (12) కాకాని (13) మంగళగిరి (14) కొప్పర్తి (బాపట్లకు సమీపము) (15) చేజెండ్ల (16) విజయవాడ (17) వేదాద్రి (18) శ్రీకాకుళం- ఇవి, శ్రీగిరి మల్లికార్జున మహిమా ప్రసార క్షేత్రములుగా పెద్దలచే భావింపబడుచున్నవి. బ్రహ్మ కృష్ణా తీరమున నూరశ్వమేధములు చేయగా, జ్యోతిర్లింగ స్వరూపుడైన శివుడనుగ్రహించెను. బ్రహ్మ మల్లికా కుసుమములచే పూజించుటచే శివుడు మల్లికేశుడయ్యెను.

## తీర్థము - క్షేత్రము

" సర్వదేవ మయోహ్యద్రిః, సర్వదేవాత్మక శ్శివః
నృసింహావాస పర్యంతం కీలారూపేణ వర్తతే "

అట్టి యగ్ని పర్వతము కృష్ణానది, ఎంత కృష్ణ స్వరూపిణి యైనను ఛేదించుటకు సాధ్యము కాలేదు. అప్పుడు దేవతలు, పతి సమాగమమున కవకాశము కల్పింపవలసినదిగా ఇంద్రకీలుని యాచించిరి. ఆతడు సమ్మతించి యా మార్గమున మెత్తబడెను. అప్పుడు కృష్ణవేణి హుంకరింపగా నా కొండపెళ్ళ రెండు క్రోశముల దూరమున బడెను. అదియే యనమలకుదురు. కృష్ణానది రాకతో విజయవాడ క్షేత్రమే కాక తీర్థము కూడ నైనది. సాగర సంగమము వఱకును కృష్ణానదీ తీరములో గల 1'8 తీర్థములలో విజయవాడ ప్రాంతములో 17 తీర్థములు కలవు.

## శ్రీ చక్రము

కనకదుర్గ జయ స్వరూపిణి, సింహవాహన, ధృవమూర్తి స్వయంభువము. ఈ అగ్నిశిఖను దర్శించుట కష్టమని, ఆదిశంకరులు శాంతి యంత్రమును శ్రీ చక్రముగా దేవీ నామ పార్శ్వమున ముందుగా ప్రతిష్ఠించిరి.

"అరిశంఖ ఖేట శూలక పాశాంకుశ మౌర్వీసాయకాన్ దధతీన్, సింహస్థాం, మగ్నివిభాం, దుర్గాం దేవీం ప్రపద్య ఇహాశరణమ్ " అని ధ్యానము. అష్టవిధాయుధముల ధరించినది. విద్యారణ్యుల వారును, ఆదిశంకరులును దుర్గను కీర్తించినవారే.

## అలంకారములు

మల్లేశ్వరస్వామికి లక్ష బిల్వార్చనము కార్తీక మాసమున మహాశివరాత్రిని కల్యాణోత్సవము జఱుగగా, అమ్మవారికి వాసంత నవరాత్రోత్సవములు, శ్రావణ మాసంలో పవిత్రోత్సవము శరన్నవరాత్రోత్సవము జఱుగును. దసరాలో, (1) స్వర్ణకవచాలంకారము (2) గాయత్రి (3) అన్నపూర్ణ (4) బాలాత్రిపురసుందరి (5) లలితా త్రిపురసుందరీదేవి (6) సరస్వతి (7) శ్రీ మహాలక్ష్మి (8) కనకదుర్గా మహిషాసురమర్దని (9) శ్రీ రాజరాజేశ్వరీ అలంకారములు జఱుగును. లక్షలాది భక్తులు దర్శించెదరు. ఈ అలంకరణములలో శ్రీ కుందుర్తి సత్యనారాయణగారు ప్రవీణులు. వారు అమ్మవారిపై శతకమును కూడ రచించిరి.

## దక్షిణ వారణాసి

తన పూర్వుడే అర్జునునకు తపస్సు యోగ్యమైన ప్రదేశమును చూపించెనని యొక అగ్నికుల క్షత్రియుడు సంస్కృత భాషలో కిరాతార్జున స్తంభ శాసనమును వేయించెను. విష్ణువర్ధనుడొక శివాలయమును కట్టించినట్లొక శాసనము కలదు కాని, యది నేడు కానరాదు. తూర్పు రాజు శాసనము కలదు. పూర్వ చాళుక్య చక్రవర్తి ' పెమ్మన ' శాసనము కలదు. యుద్ధమల్లుని బెజవాడ శాసనము చారిత్రక ప్రసిద్ధమైనది. మాధవ వర్మ సంతతి వారు ఆలయ మంటపములు నిర్మించి దానములు చేసిన శాసనములు కలవు. అందు మాధవవర్మకు అమ్మవారు ప్రత్యక్షమైనట్లు కలదు. రాయల కానుకలకును, కపిళేశ్వర గజపతి దానములకు సంబంధించిన శాసనములు కలవు. బెజవాడ మల్లేశ్వర శ్రీమాన్ మహాదేవర గుడి భోగపు పడతి శ్రీరామయయును, మాచలిదేవియు ధూప దీప నైవేద్యముల కిచ్చిన దాన-శాసనములు కలవు. పల్లవ చక్రవర్తియైన త్రిణయస పల్లవుడు (747 వ శాసనము) " స్వస్తిశ్రీ శ్రీ మహన్మండలేశ్వర త్రిణనయన పల్లవ

సిద్ధయ దేవ మహారాజులు, ఇంద్రకీల పర్వత నివాసుండైన ఈ దక్షిణ వారణాసి బెజవాడ మల్లేశ్వర శ్రీ మహాదేవరకు హవిబల్యర్చనాదులకు "— వెనిగళ్ళ గ్రామము నిచ్చెను.

## అమ్మవారి మహిమలు

మాధవవర్మ తన కుమారుని మరణదండనము విధించిన తీర్పునకు సంతోషించి దుర్గాదేవి కనక వర్షము కురిపించుట జగత్ప్రసిద్ధము. ఆ రాజు కొడుకు తెలికుల బాలకుని పై రథము పోనిచ్చెను. దుర్గ ఆ మృత బాలకుని బ్రదికించి నట్లుగా కొండక్రింద భ్రమరాంబా మల్లేశ్వర దేవాలయమున వదిల పరుపబడిన శాసనమునుండి తెలియుచున్నది.

కొండలో దుర్గ గుడి క్రింద నింకొక గుడి యున్న దనియు, నది స్వర్ణమయమనియు, సిద్ధులు పోయియర్చింతు రనియు, పెద్ద పెద్ద పాదముల గుర్తులు బ్రాహ్మణవీధిలో కన్పడుచుండెడివనియు నర్థ శతాబ్దము క్రిందట చెప్పికొనెడి వారు. గాంధీనగరంలోని శ్రీ మొక్కపాటి శివసుబ్రహ్మణ్య శర్మ తండ్రి మేనత్త, ఒక యతితో కలిసి కొండ దగ్గఱ సూక్ష్మమైన నృసింహబిలము దగ్గఱకు పోగా, నా యతి సూక్ష్మరూపియై కొండలోని కంతర్థానమయ్యెననియు, వచ్చిన తర్వాత, లోన, తామరకొలను కలదనియు నచ్చట పలు ప్రదేశములనుండి సిద్ధులు వచ్చి బ్రహ్మ విచారణ చేయుచుండగా తాను పాల్గొనుటకు పోయితినని చెప్పెను.

కొల్లూరులోని చెఱువు లక్ష్మీనారాయణశాస్త్రిగారు సాహసించి, తన శక్తితో నొకమారు లోని కేగగా, లోన నొక యోగి, 'నవఖండ యోగము'లో నుండెననియు తన రాక నెఱిగి, నా ఖండములను తిరిగి యదికించుకొను చుండెననియు, భయపడి తిరిగి వచ్చివేసి యా విషయము శ్రీ కలగా ఆంజనేయశాస్త్రిగారితో చెప్పగా వారు నాకు చెప్పిరి.

పెదకళ్ళేపల్లి నుండి ఆలయ సంప్రోక్షణమునకు వచ్చిన శ్రీ బుద్ధు ఉమాపతిశాస్త్రి చలపతిశాస్త్రిగారి యింటిలో నలుగురు బాలికలు గాజులు వేయించుకొనగా, నయిదుగు రని గాజుల సెట్టి పేచీపెట్టి తన లెక్కను చూపించగా, అయిదవ యామె అమ్మవారని గ్రహించుకొని వెలను యిచ్చివేసినారట !

అమ్మవారు బాలిక వేషముతో కొండదిగి వచ్చి, క్రొత్త గుళ్ళలోని మఱియొక బాలికను "చెల్లీ రమ్మ"ని పిలచి, కంభంమెట్టు నుండి వచ్చి జీవించు "ఢిల్లీ వెంకన్న" అను యాదవుని రిక్షా నెక్కి "రోజులు మారాయి" ఆడు సినిమాహాలు దగ్గఱ దిగి, ఆతని నచ్చటనే యుండు మని, కొద్దిసేపటికి తిరిగివచ్చి, చెల్లెలిని యథాస్థానములో దింపివేసి కొండనెక్కుచుండగా, నతడు కిరాయి నడుగగా, "నీ తలపాగాలో పదిరూపాయ లున్నవి. వెనుకకు తిరిగి చూడక తిరిగి వెళ్ళు"మని చెప్పగా, నతడట్లే చేసి చూచుకొని యాశ్చర్యపడి, కనకదుర్గా క్షేత్ర మహాత్మ్యము రచించిన శ్రీమాన్ దీవి నరసింహాచార్యులవారితో చెప్పెనట ! స్వస్తి.



## విదేశీ అప్పులు - వడ్డీ

మార్చి 1986 ఆఖరుకు విదేశీ ప్రభుత్వాలకు అంతర్జాతీయ ఆర్థికసంస్థలకు మన భారత ప్రభుత్వం రు. 32,753.91 కోట్లు అప్పు వున్నది. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థనుండి తీసుకున్న రు. 5,284 కోట్లుకూడా ఇందులో వున్నది. 1985-86లో ఈ అప్పుకు వడ్డీగా రు. 1,007.99 కోట్లు మన ప్రభుత్వం చెల్లించింది. వడ్డీని చెల్లించడానికోసం మరల అప్పు చేయవలసి వస్తున్నది. ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే దశాబ్దాంతానికి ఈ ఋణం రెట్టింపు కన్నా ఎక్కువవుతుందని ఆర్థిక శాఖ మంత్రి శ్రీ జనార్దనపూజారి రాజ్యసభలో పేర్కొన్నారు. (11-11-1986) అసలు అప్పులు తీర్చలేకపోతే దేశాన్నే తాకట్టు పెట్టవలసి వస్తుందేమో !

# ఉపనిషత్కథ ప్రవాహణుడు - శ్వేతకేతువు

ఉద్దాలక మహర్షి కుమారుడు తండ్రివద్ద శాస్త్రాధ్యయనం చేసి - తాను సకల విద్యా పారంగతుడనైతినని తలచినాడు. పాంచాల దేశాధిపుడూ బ్రహ్మ జ్ఞాన సంపన్నుడూ అయిన ప్రవాహణ మహారాజు ఆస్థానానికి అతడు వచ్చినాడు. విద్వత్పరిషత్తులో తానుకూడా శాస్త్ర వితర్కము చేయగలనంటూ విద్వజ్జనులమధ్యకు వచ్చి నిలచినాడు.

**సి. వేదవతి**

మహారాజు - ముందుగా శ్వేతకేతువుకు స్వాగత సత్కారములు చేసి, కుశలమడిగి - ఆ తరువాత తాను కొన్ని ప్రశ్నలు వేసి, అతడి విద్వత్తును పరీక్షించ వలెనని తలచినాడు.

! మానవులు మరణించిన తరువాత ఎక్కడకు వెళతారు ? .... " ప్రశ్నించినాడు ప్రవాహణ మహారాజు.

శ్వేతకేతువుకు సమాధాన మేమి చెప్పవలయునో తెలియలేదు.

" చనిపోయిన వారు మళ్ళా ఈ ప్రపంచం లోనికి ఎట్లా తిరిగి వస్తారో చెప్పగలవా ?.... " రెండవ ప్రశ్న.

శ్వేతకేతువుకు ఈ విషయం కూడా అవగతం కానిది!

" చనిపోయిన వారు వెళ్ళే దేవ పితృ యానముల గురించి నీకు తెలియునా ?...." మూడవ ప్రశ్న.

సమాధానం తెలియలేదు శ్వేతకేతువుకు.

నిత్యమూ ఇంతమంది మరణించి దివికేగుతున్నా, ఆ స్వర్గం ఎప్పుడూ నిండిపోకుండా ఉండటానికి కారణం ఏమో తెలుపగలవా ?...." నాలుగవ ప్రశ్న.

నిరుత్తరుడే శ్వేతకేతువు.

" ప్రకృతి పరిణామ ధర్మంలో ఐదవ దశను పురుషుడుగా రూపు చెందే విషయం నీవు ఎరుగుదువా ?"

శ్వేతకేతువుకు సిగ్గుతో తలవంపులైనది. ఎంతటి ప్రమాదము ! ఏదో కొంత శాస్త్ర అధ్యయనము చేసి - తాను సర్వజ్ఞుడనైతినని తలచినాడు. విద్యా గర్వము ఎంతపని చేసినది ! తిన్నగా తండ్రి వద్దకు వచ్చి ఇట్లా వాపోయినాడు.

" తండ్రీ ! నా విద్యాభ్యాసమంతా పూర్తి అయినదని తలచాను కాని, నేను తెలుసుకోవలసిన బ్రహ్మ జ్ఞానం ఎంతో వున్నది. ప్రవాహణ మహారాజు వేసిన ప్రశ్నల్లో ఒక్క దానికిన్నీ సమాధానం చెప్పలేక పోయినాను "

ఆ ప్రశ్నలన్నిటినీ కుమారుడు ఏకరువు పెట్టగా విన్నాడు ఉద్దాలక మహర్షి. కుమారునితోపాటు తాను కూడా ప్రవాహణుని ముఖతః ఆ ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవలెనని తలచినాడు.

మహారాజు ఆ తండ్రీ కుమారులకు సముచిత సత్కారములు చేసి - " ఏమి కావలె మీకు మహాత్మా ! ధనమా ? ధాన్యమా ? " .... అని ప్రశ్నించినాడు.

" జ్ఞానదానం కోసమై వచ్చిన జిజ్ఞాసులము మేము. నా కుమారునికి మీరిచ్చిన ప్రశ్న పత్రానికి సమాధానం తెలియగోరి మీ సమక్షానికి వచ్చాము " .... అన్న ఉద్దాలకుని పలుకులకు హర్షించి ప్రవాహణుడు ఇట్లా అన్నాడు.

" నా ఐదవ ప్రశ్నకు ముందుగా సమాధానం చెప్తాను. స్వర్గమే అగ్ని. సూర్యుడు హవిస్సు. యజ్ఞఫలం సోమరసం. ఇది మేఘానికి చేరి వర్షం అవుతుంది. వర్షంవల్ల సస్యం పండుతుంది. ఈ అన్నం ఆధారంగా పరిపుష్టమై జీవోత్పత్తి జరుగుతున్నది. ఈ విధంగా అయిదు పరిణామ దశలను దాటి పురుషుడుగా రూపొందుతున్నది. "

ఇక - ఈ ప్రపంచంలో ప్రతి ప్రాణీ అగ్నిలో పుట్టి అగ్నిలో కలిసిపోతాడు. మానవుని యోగ్యత - అతడు గ్రహించే జ్ఞానం పైన ఆధారపడి ఉంటుంది. శ్రద్ధా భక్తి సంపన్నులు తమ ధార్మిక సంపత్తితో దేవయానంలో బ్రహ్మలోకం చేరుకుంటారు. ఫలాసక్తితో కర్మను ఆచరించినవారు స్వర్గానికి పితృయానంలో వెళ్ళినా. పుణ్యక్షయం కాగానే తిరిగి మర్త్యలోకానికి వస్తారు. వారు జీవన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటారు. కర్మానుభవ పరిపాక సిద్ధిగా ఈ పరిభ్రమణం జరుగుతూ ఉంటుంది. అందుకే పుణ్యలోకం ఎప్పుడూ నిండిపోదు.

తపస్సంపన్నులై బ్రహ్మలోకానికి వెళ్ళిన వారు మాత్రం జీవన్ముక్తు లవుతారు ! వారికి బ్రహ్మ నిర్వాణ సిద్ధి లభిస్తుంది. " .... అంటూ తత్త్వవేత్త అయిన ప్రవాహణ మహారాజు ప్రవచనం చేసినాడు. ★

# విద్య

" ఆత్మ విజ్ఞానం లేని విద్య వలన ప్రయోజనం లేదు. తామెవరో తెలుసుకొనక పరులను తెలుసుకొనుటకు ప్రయత్నించుట వ్యర్థం. "

శ్రీసత్యసాయిబాబా

" విద్య వేరు, వివేకము వేరు. మంచికీ, చెడుకూ వ్యత్యాసం తెలిసిన విమ్మట ఎవడూ తప్పుడు పనులకు దిగడు. మనస్సులో నిలకడగా నెలకొనిన జ్ఞానం వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలుస్తుంది. దానివల్ల ప్రయోజనం వుండదు. "

శ్రీరాజగోపాలాచారి

" వినయ వివేకాదులను వృద్ధి పొందించుటకు అనుకూలపడని విద్య లేకపోయినను దానివలన వచ్చెడి నష్టమేమియూ లేదు. సుగుణ సంపదను గడించుట కయి విద్య నేర్వవలసినదేగాని, విద్యానిమిత్తమై సద్గుణములను విడువరాదు. పలువురు మూఢులైన నిరక్షరకుక్షులు చేరి చేయు హాని కంటెను, ఒక చదువుకున్న దుర్మార్గుడు చేయు హానియే అధికము. "

శ్రీ కందుకూరి వీరేశలింగం

" శారీరక, మానసిక, ఆధ్యాత్మిక వికాసమునకు వలయునట్టి సమగ్ర విద్యాభ్యాసమే విద్యార్థులకు ఆవశ్యకము. "

శ్రీ రామకృష్ణ పరమహంస

" విద్య అనగా అక్షరాస్యత కాదు. వివేకము, విజ్ఞానము కలిగి వర్తించుట ఆధునికాంగ్ల విద్య కేవలము పరాధీనమైన బ్రతుకునకే మూలము. సాంకేతిక పరిశోధన విద్యలు ఆవసరం. "

– శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

" విద్యయొక్క పరమార్థము స్వతంత్రంగా ఆలోచించుట, స్వతంత్రంగా జీవించుట. "

– శ్రీ లాలా లజపతిరాయి

" విద్యకు, విజ్ఞానానికి వ్యత్యాసం ఉంది. విద్యద్వారా విజ్ఞానం సంపాదించినప్పుడే ఆ విద్యకు విలువ ఉంది. జీవిత దృక్పధాన్ని, ఇతర ప్రజలతో లేక ఇతర సంఘములతో ఉండవలసిన సంబంధాలను నిర్ణయించేదే విజ్ఞానం. "

– శ్రీమతి సరోజనీ నాయుడు

" మనకు స్వభాషలలో విద్య వుంటే స్వరాజ్యం ఎప్పుడో వచ్చిఉండేది. సంస్కృతం ప్రతి ప్రాంతీయ భాషను పరిపుష్టం చేస్తుంది. అందువల్ల ప్రతి రాష్ట్రీయుడు దీనిని తప్పక చదవాలి. మన ధర్మ సంస్కృతులలో గల మహోన్నత భావాలను గ్రహించడానికి సంస్కృత భాష చక్కగా ఉపకరిస్తుంది. "

– శ్రీ మహాత్మాగాంధీ

" మాతృభాషలలో విద్యను బోధించడం వల్ల మనస్సులు చురుకుగా పనిచేస్తాయి చదవడం చాలా వరకు తినడం లాంటిదే. మొదటి కబళంలోనే రుచి పుట్టితే, పొట్టనిండక ముందే జీర్ణరసాలు బాగా ఊరుతాయి. ఇంగ్లీషు భాషను బెంగాలు బాలుడికి నేర్పితే ఇట్లా జరుగదు. ఇటు ఆంగ్ల వర్ణమాలతోను, వ్యాకరణంతోను ఊపిరాడక తికమక లౌతుంటే, అటు కడుపెండిపోతుంది ఆరంభం నుండీ మనస్సంతా పనిచేయక పోతే, దాని పూర్ణవికాసం చివరికి కాకుండా పోతుంది. "

– శ్రీ రవీంద్రనాథ్ టాగూర్

# సాహిత్యము - జీవిత సాహిత్యం

ఒక అందమైన జంత్ర వాద్యము, మంద్రస్థాయి లోని రాగముతో ప్రేమికుని విన్నపమును వినిపిస్తుంటే, ఇంకొక సహజంత్ర వాద్యము తారాస్థాయిలోని రాగముతో ప్రేయసి ప్రతిస్పందనను రసస్పందనగా వినిపించటమూ సంగీత జగత్తులో ఉన్నది. ఆ విధంగానే, మూర్త జగత్తుకు చెందిన స్థంభాకృతులను తాకినపుడు, అమూర్త జగత్తుకు చెందిన సప్తస్వరాలు పల్కటమూ ప్రసిద్ధమై యున్నది కూడా !



ము ం గ ర జా షు వ



మధుర రాగాలు, రూపాలను అభాసగా ప్రత్యక్షపరుస్తుంటే సుందర శిలారూపాలు, స్వరాలను ఆభాసగా మన మానసంలో వర్షింప జేస్తున్నవి. ఈ విధంగా వైవిధ్యాన్ని చెరిపివేసుకుని, తనలోని రస తత్త్వాన్ని విస్తృతము జేసుకుంటూ సాగిపోతుంది కళాజగత్తు, గతి శీలతలో !

జీవితములో వెలుగునీడలు దాగుడుమూత లాడుతున్నట్లే ; కళాజగత్తులో కూడా వెలుగునీడల ప్రభావము అనివార్యమైనది అటువంటి దృష్టితో సాహితీ జగత్తును చూసినప్పుడు, ఒక వైపు కాంతి రేఖలూ వేరొక వైపు చీకటి గుహలూ ప్రత్యక్షమౌతాయి. ఆ విధంగానే, సాహిత్యమూ జీవిత సాహిత్యము అనునవి ఎంతో వైవిధ్యమూ వైరుధ్యమూ కలిగినవి. సాహితీ స్రవంతి ఎన్ని పాయలుగా ప్రవహించినా రమణీయతను ఆశ్రయించుకొని మనుగడ సాగించవలసినదే ! అలాగే జీవిత సాహిత్యము ఏ ప్రక్రియను చేతబట్టినా సామాజిక దౌర్బల్యాలను పెంచి పోషిస్తూ జీవనంకొరకు బ్రతుకవలసిందే ! అందువలన ఇవి సమన్వయానికి అతీతమైనవి కూడా !

మృదువైన లలిత స్వభావాన్ని కలిగినది సాహితీకళ. అటువంటి కళా స్వభావాన్ని జీవితము అర్ద్రితతో గ్రహించినపుడు సాహిత్య జీవితము ఏర్పడుతుంది. సాహిత్యమే జీవితముగా కలిగినది సాహిత్య జీవితము. సాహితీ కళలోని ఉత్తమ లక్షణాలయిన రసమూ, రమణీయత, లయా, ఔచిత్యమూ, ధ్వనీ,రీతులూ జీవితములోకి ఇంపుగా ప్రవహిస్తాయి. అప్పుడు పూవుకి తావి అబ్బినట్లు, అభివ్యక్తి రసాభివ్యక్తి ఔతుంది. ప్రతికృతీ ప్రవృత్తి నుంచి వెలువడినప్పుడు రసకృతియే! దీని యర్థం, ప్రకృతినుంచి, సమాజము నుంచి జీవితము నేర్చుకోవలసినది ఏమీ లేదని కాదు. కళా జీవితములో ప్రకృతి యొక్క మానవ సమాజము యొక్క సంబంధ, బాంధవ్యాలు అనివార్యమైనవీ, అవిభాజ్యమైనవి కూడా !

జీవిత సాహిత్యము, రచయిత యొక్క జీవిత లక్షణాలను కల్గియుంటుంది. ఒక వ్యక్తి సాహితీ జగత్తులో అడుగు పెట్టినపుడు ; అతని స్వభావానికి, సాహిత్య స్వభావానికి ఘర్షణ ఏర్పడి, కళాస్వభావము తెరచాటు ఔతుంది. అటువంటి స్థితిలో రచయిత ఉన్నప్పుడు, అతని రచనల్లో ఎక్కువగా జడాత్మక జీవిత లక్షణాలయిన అహాలు (Egos) ఆత్మ న్యూనత ( Inferiority ) ఆధిక్యతా (Superiority) భావాలు మరియూ అనేక సంకీర్ణతలకు చోటు ఏర్పడుతుంది. అయితే జీవిత సాహిత్యములో కళాంశములు కొంచెమొ గొప్పో ఉన్నప్పటికీ అవి జీవిత లక్షణాల ఆధిక్యతవలన బాగా ప్రస్ఫుటం కాజాలవు. కళా స్వభావాన్ని గ్రహించని జీవితము, తన స్వభావంతో కృతిని కూర్చినప్పుడు, అది అసుందరమూ, అసమగ్రమూ ఔతుంది సహజంగా !

సాహిత్య జీవితము వైవిధ్యాలను సమన్వయం జేసి రససరితను ఏకముఖంగా ప్రవహింప జేస్తుంది. జీవిత

సాహిత్యములో శిల్పం అప్రధానమై వైరుధ్యాలను ప్రస్ఫుటింపజేస్తుంది బహుముఖంగా !

ప్రస్తుతము అనేక ఒత్తిడులకు గురి అవుతున్న మనిషికి సేద తీర్చి, దుఃఖాన్ని మరిపించి, మనోవికాసము కలిగించేది ఉత్తమ సాహిత్యము. మనిషిలోని సంకీర్ణతలను, సహజ భావోద్రేకాలను (Instincts) బలహీనతలను ఆసరాగా తీసుకొని తాత్కాలిక విషాలో ముంచి, మురిపించేది జీవిత సాహిత్యము ఔతుంది. నిశ్చయంగా !

లలిత కళల్లో జీవించే కళాశీలులు, సృజనశక్తిని, అంతరంగంలో సజీవంగా, సంజీవిగా వుంచటానికి కొంత స్వచ్ఛతా, సరళతా, విమలతా, విశాలతనూ కలిగియుండక తప్పదు. రచయితలో సజీవ ప్రేరణలు, రస సంవేదనలూ ఉండి కళాకృతి రూపంలో వ్యక్తమౌతాయి. సహృదయుల నిమిత్తం కూడా !

అటువంటి ప్రేరణలనూ, సంవేదనలను, కళాశీలి చుట్టూ వున్నటువంటి, ఆదర్శ పురాణ గాధలూ, సుందర దృశ్యమాలికలూ, పీడిత మానవ సమస్యలూ, తీయని వలపు తలపులూ కలిగిస్తుంటాయి. అవి ఎరజాజి లతల్లా అల్లుకొని ప్రేరణాత్మక సంఘటనలుగా జీవిస్తుంటాయి. అప్పుడు సాహితీ శీలి తన దృష్టి కోణాన్ని ప్రచలితంజేసే సంఘటనలనుండి మాత్రమే కళాకృతిని నిర్మించుకోగలడు. అది శ్రీరామచంద్రుని మనోహర రూపమో, ప్రకృతి దృశ్య సౌందర్యమో, కర్షకుని విలువ కట్టలేని ఘర్మజలమో, లేదా ప్రేయసి వ్యధాభరిత వియోగమో కావచ్చును. రచనా వస్తువుగా ఏ విషయాన్ని అయినా స్వీకరించే స్వేచ్ఛ రచయితకు గలదని గుర్తించటము చాలా అవసరము. అందువలన కళాశీలి మత దృక్పథానికో, రాజకీయ సిద్ధాంతానికో విధేయుడై ఉండాలని భావించటమూ, శాసించటమూ శృతిలేని పాటగా వినిపిస్తుంది. నిశ్చయంగా !

కళాకారులలోని దృష్టి వైవిధ్యమునుబట్టి, వస్తువులో ప్రక్రియలో, భిన్నత్వమూ సహజమే ! కళారీతులలోని

## ఆత్మోదయం

ప్రశాంతంగా నిలవటానికి
ఈ గిరి శిఖరం మీద చోటు దొరికింది !
మనో వీధిలో మనోజ్ఞ కాంతి మీద
ఆనందం నర్తిస్తూ
ఈ తరుణం పరిమళిస్తూ వుంది !
చూపులతో చుక్కల్ని త్రాగుతూ
సాగర తరంగ ధ్వానాల్లో ఊగుతూ
ఎంతసేపు గడిపినా
తనివి తీరటం లేదు !
ఇక్కడ ఏ శాసన భాషల ఘోషా లేదు
ఇక్కడ ఏ సింహాసనాల
రత్నచ్ఛటాద్యుతులూ లేవు
ఇక్కడ ఏ కిరీటాలూ
మొలకెత్తి మొగ్గ తొడగవు
శాంతి శబ్దం ఆవరించిన
ఈ శూన్యంలో-
దురహంకార మదాంధ చిత్తులు
కరిగిపోయిన ఈ శూన్యంలో-
పువ్వులా భూమి వికసిస్తున్న
ఈ అనంత శూన్యంలో-
ఇప్పుడు నేనీ శిఖరం మీదొక శిఖరం !
నా శిరస్సు నుండి రేపటి ఉదయం !!.

— ఆచార్య తిరుమల

వైవిధ్యము, వైరుధ్యము కాదు. మన దృష్టికి వ్యతిరిక్తమైన కళాకృతి ముందు నిల్చినప్పుడు, దానిని వెంటనే ప్రక్కకు నెట్టివేయకుండా, అందులోని కళారమణీయతను ఆస్వాదించే ఓర్పు, నేర్పూ అవసరము ఔతున్నది. రసజ్ఞతకు, రస సమీక్షకు ప్రాచీనత, ఆధునికత అనే భేద భావము ఉండజాలదు.

ప్రస్తుతము సాహితీ జగత్తు, భౌతిక, భావ వాద దృక్పథాల నేపథ్యంతో స్ఫూర్తి నొందటము వలన, తరచుగా కళాకృతి వెనుకనున్న సిద్ధాంతాలు ప్రాధాన్యత వహిస్తున్నవి. కళలో తాత్త్విక సిద్ధాంతాల ప్రాధాన్యత కళారమణీయతను తెరమరుగున దాచివేస్తున్నది. కనుక కళను కళాకోణము నుంచి చూసినప్పుడు మాత్రమే రసతత్త్వము ప్రవహిస్తుంది. ఒక ఝరిలా !

సాహితీ కళలోని వాస్తవ దృక్పథము, సామాజిక సమస్యలకు అద్దంపట్టి, పాఠకుని ఆలోచింప జేస్తుంటే ఆదర్శవాదము పఠితను ద్రవీకరింపజేసి, ఆనందానుభూతిని, ఉదాత్తతను అందిస్తుంది. కనుక కళారీతులలోని వైవిధ్యము ఉపయుక్తమైనదే !

సాహితీ కళ ఏ వాద భేదాల ననుసరించినా అది పూర్తిగా ప్రవృత్తిపరమైనపుడు జీవకళ ఔతుంది. కేవలం వ్యాపృతి ( Business ) పరమైనపుడు నిర్జీవ కళ ఔతుంది. వాస్తవంగా !

ఉత్తమ కళ కాలక్రమేణా వచ్చే మార్పులను తనలో కలుపుకొని సాగిపోతుంది. విశాలతలో ! అనుత్తమ కళ మార్పును అంగీకరించకుండా ఒకచోటే నిలచి స్థగితం ( Stagnate ) ఔతుంది. సంక్లిష్టతలో !

అందువలన, సాహితీ శిల్పి ప్రాచీన రీతుల నుంచి ఆధునిక రీతుల వరకు సమన్వయ సాధనజేసి, తన సృజనాత్మక పరిధిని విస్తృతము చేయవలసి వుంది. కొంతమంది చిత్రకారులు రూప కళను ప్రేమించి, నైరూప్య కళను ఆదరించినట్లుగానే !

కవి క్రాంతదర్శి గనుక, కవి వాక్కు సత్యవాక్కు అనే అభిప్రాయం ప్రచలితం ఆయి, కవి సమాజానికి మార్గదర్శి అనే అభిప్రాయమూ ఏర్పడి వున్నది. సాహితీ శిల్పి అయిన కవికి సత్యాన్వేషణతో సంబంధము లేదు. సత్యాన్వేషణ తాత్త్వికుని పని !

ప్రాచీన గ్రీకు తాత్త్వికుడైన ప్లేటో " కవి సంగతి చెప్పవలసి వచ్చినప్పుడు అద్దంలో భౌతిక వస్తువులు ప్రతిబింబిస్తున్నట్లే అతని రచనలో అన్ని వస్తువులు ప్రతిబింబిస్తున్నవి " అని అనుట పరిశీలనార్హమైనది.

కనుక కవి సృజనలోని భౌతిక వస్తువులు, అద్దంలో ప్రతిబింబించే అభాసలు. వాస్తవ సత్యానికి అభాసా రూపాలు. ఈ అభాసారూపాలు సౌందర్యము అనే మూలధాతువును ఆశ్రయించుకొని మనుగడ సాగిస్తూ ఉండటం కనిపిస్తుంది సహజంగా !

అందువలన కళాసృజన అనునది భ్రమాత్మకసత్యము (Verdical illusanation). వస్తువుయొక్క అందమైన అభాస, వస్తువుయొక్క వాస్తవ సత్యము కానేరదు. వాస్తవ వస్తువు రామణీయకానికి అస్తిత్వాన్ని ఇస్తుంది కాని, రామణీయకము వస్తువుకి అస్తిత్వాన్ని ఇచ్చుట లేదు. ఏదిఏమైనా రామణీయత ఒక స్వతంత్ర సత్తా గలిగిన మూలధాతువు. సాహితీశిలి దృష్టి రసదృష్టి, సత్యదష్టి కాదు. అతని సృజనలోని వస్తువు సౌందర్యాన్ని ఆశ్రయించుకొని అభాసగా కనిపిస్తూ ఉంటుంది.

కనుక సౌందర్యము చుట్టూ తిరిగే సాహితీకళను సంపూర్తిగా తాత్త్విక ప్రయోజనానికో, రాజకీయ సిద్ధాంత నినాదానికో ఉపయోగించటము, పూల తీగను పెంచి మధుర ఫలాలకు అర్రులు జాచటం లాంటిది. నిశ్చయాత్మకంగా !

" అగ్నిర్ వాగ్ భూత్వాముఖం ప్రావిశత్ " అని ఉపనిషత్తు రమ్యముగా, అగ్నితత్త్వము నుంచి వచ్చిన వాక్కు ముఖంలో ప్రవేశించినదని స్పష్టపరచుచున్నది. కనుక సాహిత్యములో, సామాన్య వ్యవహారంలో రమణీయంగా, ఔచితీవంతంగా ఉన్న వాక్కు శోభించ గలదు. స్ఫూర్తి నందిస్తూ !

మానవుడు పరిణామ శీలి. పసితనంలో పిచ్చిగీతలు గీస్తూ, వాటి కానందిస్తూ, పెరుగుతూ, రసదృష్టిని పెంచుకొంటూ బృహత్ సౌందర్య రూపాలను సృజించినట్లే. ఏ విలువల్లేని సాహిత్యాన్ని కూర్చినా, రస జిజ్ఞాస వుంటే ఉత్తమ రచనలు రచించవచ్చును. అందుకు ప్రధానంగా అంతర్ మథనం, అంతర్వివేచన వుండవలసి వస్తుంది. ప్రతి క్షణమూ !

రాజీ కొంచెం షాక్ తిన్నది.

ఈ మాటలు ఆయన జనరల్‌గా అన్నాడా? లేక కేవలం తన తండ్రి నుద్దేశించి అన్నాడా?

" క్షమించండి. మీకు ఆవేశం తెప్పించాను. "

" అలా ఎప్పుడూ అనకండి. నాకు ఆవేశం రాదు. మా అమ్మ నా ఆవేశాన్ని బాల్యంలోనే చంపివేసింది. ఉగ్గుపాలతో బాటు సహనాన్ని, పాషాణ క్షమను నాలో నూరిపోసింది. "




# హ్యూమానిటీ ఫర్ సేల్

" మీ స్వగ్రామం "

" విశాఖపట్టణం "

" అక్కడే ఉన్నారా మీ అమ్మా నాన్నా "

" లేరు. మా నాన్నగారు నేను పుట్టకముందే చనిపోయారు. అష్ట కష్టాలతో నన్ను మా తల్లి పెంచి పెద్ద చేసి విద్యా బుద్ధులు నేర్పింది. నాకు మా బంధువులెవరూ సహాయపడలేదు. బంధువులంటే ఎవరో నాకు తెలియదు. విశాఖ వీధుల్లో రోజూ వందలాది బిచ్చగాళ్ళనూ కుష్ఠురోగ పీడితులనూ చూస్తూ వుండేవాడిని. వారందరూ ఎందుకిలా వున్నారు? దేవుడు వారినిలా పుట్టించాడా? ఇదంతా విధి ప్రేరితం! అంటే తెలియని రోజుల్లో నాకేదో సమాధానం లభించినట్లు సంతృప్తి చెందేవాడినేమో కాని తర్వాత తర్వాత ఇదంతా మానవ నిర్మితమేననిపించింది. సముద్రం ఒడ్డున కాటేజ్‌లు, షిప్ యార్డు అధికారుల ఎయిర్ కండిషన్ భవనాలొకవైపూ, ఎల్లమ్మ తోటవద్ద కురుపాం మార్కెటు చుట్టూరా పందులు కూడా ముట్టుకోలేని సైడు కాలవల నుండి తీసిపోసిన చెత్త కుప్పల్లోపడి దొర్లే మానవులు, సజీవమైన మానవులు మరొక వైపూ చూచి నేను దిగ్భ్రాంతుణ్ణైపోయేవాడిని. అవమానాల మధ్య, అనుమానాల మధ్య తిరస్కారణతో బహిష్కారణతో మానవులే మానవుణ్ణి వెలివేస్తున్నప్పుడు, బలవంతుడే లోకాన్ని దోచుకుంటున్నప్పుడు జంగిల్ లాకు ఇంగితం కలిగిన నరలోకపు జీవన విధానానికీ తేడా ఏమిటీ అనిపించడం అసహజమా? ఈ నరలోకం కన్నా మరొక నరకలోకమే వరించాలని కోరుకోవడం పొరపాటా? కాని నేను బాధామయ జీవితం నుండి పాఠాలు నేర్చుకున్నాను. రోగమంటే ఏమిటో, ఆకలి అంటే ఏమిటో, డబ్బు లేకపోతే ఎలా గిలగిలా కొట్టుకోవాలో, సామాజిక గౌరవంకోసం, మిథ్యా ప్రతిష్ఠకోసం, మానవుడు ఎలా పశువుగా మారిపోతాడో ఇవన్నీ నేను చూచాను. విన్నాను-అనుభవించాను తెలుసుకున్నాను. నరలోకాన్ని

వదిలి మరేదో నందనం సుందరం నిర్మించుకోవాలని వాంఛ నాలో మరణించడాని కిదొక కారణం. నా చుట్టూ వున్న ఈ చీకట్లో ఓ చిన్న కొవ్వొత్తిని వెలిగించి సంతృప్తిపడాలనే ఆశావాదిని నేను. పలాయన వేదాంతం నాకు గిట్టదు-అందుకనే వైద్యాన్ని ఒక వృత్తిగా ధనం ముద్రించిపెట్టే ఒక మింట్‌గా కాక నా ఆవేదనలకు ఒక సాధనంగా తీసుకొని పోరాడుతున్నాను. నాకు వచ్చిన డబ్బును తిరిగి దాన ధర్మాలకూ, రోగులకూ ఖర్చు చేస్తున్నాను. ఇలా గాలిలోని దీపంలా ఒంటరిగానే పోరాడుతాను గాలి తుఫానుగా, సుడిగాలిలా మారి నన్ను తుడిచిపెట్టినా కూడా ".

రాణి మ క ర ం ద్ ఎదుట నిలబడలేకపోయింది. అతని మాటలనుండి వచ్చే సెగల మధ్య ఆమె శలభంగా వ కిపోతున్నది. తాను చేసిన చేయని తప్పులన్నిటినీ ఈ ప్రసంగం దర్పణంలా ఎత్తి చూపి వెక్కిరిస్తున్నట్లని పించింది. మకరంద్ ముఖం చూ డ లే క పో యి ం ది సూటిగా—

' వస్తాను.... ' లేవబోయింది—

' ఫరవాలేదు కూర్చోండి '

' మీకు భోజనంవేళ అయింది.... '

' ఏం మునిగిపోలేదు—ఇలాగే మా ట్లా డు తూ వుంటాను - మాట్లాడుతూ తింటూ వుంటాను - తింటూ మందులిస్తూ వుంటాను ...'

" ఇందరికి ఆరోగ్య నియమాలను బోధించే మీరు మాత్రం నియమాలను పాటించడంలేదు...."

మకరంద్ నవ్వాడు " అందరికీ పాయసాన్ని వడ్డించే గరిటకు మాత్రం పాయసం రుచి తెలియదు....విందులూ వినోదాలతో గడిపితే ఈ ప్ర జ ల దిక్కేమిటి ? "

" మీ రొక్కరే వైద్యులయినట్లు మీరే లోకాన్నంతా ఉద్ధరిస్తున్నట్లు...."

" లో కా న్ని ఉద్ధరిస్తున్నాననుకోవడం భ్రమ — అసంభవం—ఇది కేవలం ఆత్మోద్ధరణ-నా వికాసానికి నేను కల్పించుకున్న సాధనా మార్గం—"

( జ రి గి న క థ )

డా॥ రాజు, శ్యాంల ప్రచారం డా॥ మకరంద్ మీద ఎక్కువైంది. అసలు మకరంద్‌కు వైద్యం రాదన్నారు, కబుర్లు మాత్రం చెబుతాడన్నారు. అయితే అవన్నీ ఎదురు తిరిగి జనసామాన్యంలో మకరంద్ దేవుడూ, హస్తవాసిగల డాక్టరుగా పేరుపొందాడు. ఇవన్నీ కనిపెడుతుంది ఒక్క రాణి మాత్రమే. ఆమె ఎప్పుడు విన్నా తన తండ్రి, శ్యాంల నోటి వెంట మ క ర ం ద్ మాటే. ఆమె వైద్య విద్యార్థిని అవటంవల్ల డా॥ మకరంద్ దగ్గరికి వెళ్ళింది. పేషెంట్లతో అతను మాట్లాడే విధానం బాగా నచ్చింది. ఆ తర్వాత మకరంద్‌తో విడిగా మా ట్లా డి ం ది. అతని మాటల్లో ఆత్మీయత, అనురాగం ఆ మె కి కన్పించాయి. డాక్టర్ల దురాశలను మకరంద్ చాలా నిశితంగా విమర్శించాడు.

( ఇ క చ ద వ ం డి )

కొంచెం ఆగి మకరందే మళ్ళీ అన్నాడు—

" మిమ్మల్ని చూస్తుంటే నాకేమిటో ఒక విధమైన ఆనందం కలుగుతున్నది-ఎంతసేపు మాట్లాడినా ఇంకా మాట్లాడాలనిపిస్తున్నది. "

" కృతజ్ఞురాలిని-కాని మీ చిత్తవృత్తే అలాంటిదిలా కనిపిస్తున్నది—ఓ పె న్సి లి న్ పొడిస్తే సరిపోయే నరసింహానికి ప్రకృతి సౌందర్యం గూర్చి పొగ గొట్టాల ప్రమాదాలను గూర్చి వై ద్య శా స్త్రం బోధించారు గంటసేపు "

" అంటే వాచాలుణ్ణనా మీ ఉద్దేశ్యం "

" క్షమించండి గోటితో పోయేదానికి గొడ్డళ్ళెందుకు ?

" రోగ నిదానమే గొడలి-నివారణకు గోరు-ఇదే నా ఉద్దేశం...."

## జ్ఞాని - అజ్ఞాని

సారమున్న పచ్చి పుల్ల
విలుకాని ముందు వంగుతుంది వ్రమతతో
సారం లేని ఎండు పుల్ల
ఎదురుతిరిగి విరుగుతుంది మూర్ఖంగా !

— నారాయణం శేషుబాబు

" వస్తాను-ఈ కాసేపు మీతో సంభాషించింతరువాత నా మనసెందుకో ఉల్లాసంగా వుంది "

" అబద్ధం—నాతో మాట్లాడినవాడెవడూ ఉల్లాసంగా వెళ్తాడని నమ్మకంలేదు-ఇదేం సినిమా కాదు, సర్కసు కాదు-అన్నట్లు మీతో మరోమాట చెప్పదలచాను. రవి మీకు స్నేహితుడా "

గతుక్కుమంది రాణి -" ఔను-ఏం ? "

" ఏం లేదు-ఒకటి రెండుసార్లు మీరతనితో షికారు వెళ్ళడం చూచాను-నేను జీవితంలో ఎప్పుడో కాని సినిమాలకు పోను-అదీ డైరక్టరూ నిర్మాణ సంస్థా గొప్పవయితే వాటి పేర్లు చూచి మరీ పోతాను. ఏడాదికి ఒకటో రెండో-మొన్నటి సినిమాతో నా కా సద్భావం కూడా తొలిగిపోయింది-ఇక సినిమాలు చూడకూడదని నిశ్చయించుకున్నాను. అన్నట్లు - ఆనాడు మిమ్మల్ని రవితో చూచాను.

రాణి ముఖం కందగడ్డలా అయింది.

ఇంత సభ్యతలేని మనిషి డాక్టరేమిటి ? అనుకుంది. ఫ్రండ్స్ ఎన్నో రకాలుగా వుంటారు-బాయ్ ఫ్రండ్స్ గర్ల్ ఫ్రండ్సు, హాస్టల్‌లో మీట్స్ క్లాస్ మీట్స్,-వాళ్ళకు రకరకాల సరదాలుంటాయి. కోరికలుంటాయి. విహారాలుంటాయి—వినోదాలుంటాయి—

ఆడపిల్లా మొగవాడూ కలిసి తిరగడమే తప్పనడం మెడిసిన్ చదువుకున్న మకరంద్ అనవలసినమాట కాదు—

అసలు మకరంద్ ఎవడు తన్ను అనడానికి ?

" రవి అంత మంచివాడు కాదు. అతని ప్రవర్తన గూర్చి నాకు బాగా తెలుసు. బాధ్యతారహితమైన ప్రవృత్తితో పైసలు ఖర్చుచేసుకునేందుకైనా అతడు చదువుతో వుండాలి, లేదా సమాజంపై తిరగబడ్డ విద్రోహ మనస్తత్వం కలవాడైనా వుండాలి - ఇటీవల అతడు మా స్నేహితుడి చెల్లెల్ని అవమానించినందుకుగాను అతడిచేత తన్నులు తిన్నాడు - నేనూ వున్నానప్పుడు—"

రాణి బయటి సూర్యుడి తాపంకన్నా ఎక్కువ అనుతాపాన్ని అనుభవిస్తున్నది—

సెగకు మగ్గిన దొండపండులా అయింది—

చివాలున లేచింది—

" అయ్యా వడ్డించాను-" లోపల వంటమనిషి కేక.

" సార్ మీ కోసం ఎవరో పేషెంటు వచ్చాడు-అర్జంటుగా చూడాలిట-" నరసింగరావు అయిష్టంగా పిలిచాడు—

" వస్తున్నాను " మకరంద్ లేచాడు—

రాణి కృతజ్ఞతగా వెళ్ళేటప్పుడు చెప్పే వీడ్కోలు కూడా చెప్పకుండా బయటకు వచ్చింది—

కోపంతో ఆమె అడుగులు తడబడ్డాయి

ఇల్లు చేరింది—

"ఎండలో ఎక్కడినుంచి వస్తున్నావమ్మా" డాక్టరు రాజు ప్రశ్నించాడు—

" మకరంద్ డిస్పెన్సరీ నుంచి " చరచర ఇంట్లోకి వెళ్ళిపోయింది—

రాజూ—శ్యాం అయ్యంగార్ ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

( స శే షం )

## సర్వ మత సమన్వయమే

# సత్యం శివం సుందరమ్"- నేను

– శ్రీ స్వామీజీ భూమాత్మానంద సరస్వతి

జగత్తులోని అన్ని మతముల వారు కోరుచున్న ఏకైక సద్వస్తువు సచ్చిదానందము. విశ్వములో అన్ని జాతులవారు, సమస్త జీవులు అర్థం చేసుకొనుచున్న భాష ప్రేమ.

ప్రపంచములోని అన్నిమతములు, భాషలు, సంస్కృతులు చరిత్రలు సత్యం శివం సుందరమైన 'నేను'ను స్వీకరిస్తూ వున్నాయి. వేష భాషా అలవాట్లు వేరు వేరయిననూ, అందరికి సత్యం శివ సుందరమైన 'నేను' ఒక్కటే. ఉత్తమ పురుష ఏకవచనమైన నేను, అన్ని మతముల వారికీ, అన్నిభాషలవారికి పదములలో వేరు వేరయినా భావములో ఒకటే. కొందరు "అహం", కొందరు "ఐయామ్", మరి కొందరు "మై" అని పిలిచిననూ "నేను ఉన్నా"నను అనుభవము జాతి, కుల, మత భేదంలేక ఒక్కటే కదా. సత్యం శివం సుందరము నేను ఒక్కటే సత్యమైనది, శివమయినది, సుందరమైనది అయిన "నేను" అందరికి సమానమే. కనుక అందరు "నేను"ను సమానముగా ప్రేమిస్తున్నారు. దుఃఖమునిచ్చు అహంభావాన్ని ప్రేమించుట లేదు. సంకల్పమునకు ఆధారము నిర్వికల్పమైన నేనే.

సమస్త గుణములు, జాతులు, ద్రవ్యములు, సంబంధములులేని "నేను" ను సత్యమని వేదాలలో సమస్త ఋషులు వారి అనుభవంతో వర్ణించారు. సత్ అనగా మరణించక వుండునట్టి శాశ్వత వస్తువు అని అర్థము. శాశ్వత వస్తు భావమునే సత్యం అని విజ్ఞులు అన్నారు. దీనిని స్వరూపమని, సన్మాత్రమని ఉపనిషత్తులలో అన్నారు. "ఉన్నది" అన్న శబ్దానికీ, భావానికీ ఆధారమైన తత్త్వమును సత్యం అని జ్ఞానులు, భక్తులు అన్నారు నా ఉనికి శాశ్వతంగా, మారక, ఏకరసంగా అనంతంగా వుండాలని నాకు, మీకు, అందరికికూడ కోరిక వుంటుంది. కనుక ఉనికియే నేను, మీరు, అందరునూ గూడ. నేను వున్నాను (వుంది), చెట్టు ఉన్నది, గుట్ట వున్నది, అగ్నివున్నది, ఆకాశమున్నది, మనస్సున్నది, అజ్ఞానమున్నది-అన్నింటిలోనూ వున్న వున్నదను సత్యము నేను. నేను, మీరు, అందరున్నూ సత్యం కనుకనే మన మందరం ఒకరిచే అసత్యాన్ని వినలేము, వినటానికి ఒప్పుకోము. కనుక విలువైన సత్యానికే విలువనివ్వాలి. మనమందరము విలువలకు విలువనిచ్చే కళను ప్రపంచంలోని సమస్త జ్ఞానుల వలన, భక్తులవలన, యోగుల వలన నేర్చుకొని తరించాలి. విశ్వరూపము, భగవంతుడు,జీవుడు,సర్వమునూ ఒకటయిన సత్యమే. జీవేశ్వరులను అద్వైతంగా, అనంతమైన "నేను"గా బోధతో చూచుటయే సర్వమత సారము. పరిమితిగల నేనును సర్వవ్యాపకమైన, నిజమైన, "నేను" యొక్కజ్ఞానంలో బాధితంచేయాలి. బాధిత వృత్తియే నిత్యసిద్ధ బుద్ధ ముక్తమైన నేను.

సత్యమైనదే శివమ్, అంటే మంగళమని అర్థం. మంగళంలో దుఃఖము ఏ మాత్రములేదు. కనుక ఆనందమై, మంగళకరమైనది, ఎప్పుడు కూడ సుందరమైన సత్యమే గదా. శివమైనది సదా చైతన్యమైన జ్ఞానమే. సమస్త వ్యవహార జ్ఞానములకు, అన్ని జ్ఞానవృత్తులకును, వృత్తిజ్ఞానములకును ఆధారమై ప్రకాశింపచేయు

సద్వస్తువే చైతన్యము. నేను వున్నాను, జగత్తు వుందను వృత్తులకు అధిష్ఠానమై, ఈ రెండు అంతఃకరణ వృత్తులను ప్రకాశింపచేయు స్వయం జ్యోతి స్వరూపం అందరిలో యున్న 'నేను' అనే ఉత్తమ పురుష ఏక వచనము. నేను, నాది అను వృత్తులకు అధారమైన వికల్పరహిత, నిరాకార చైతన్యమే శివము. శివమైనది ఎల్లప్పుడును సుందరంగా, ఆనందముగా వుంటుంది. శంకరుడు శివుడు కనుకనే శివశక్తి సర్వమంగళా అని ప్రసిద్ధి. మంగళరూపుడయిన శివునిలో త్యాగము,భక్తి జ్ఞానము, వైరాగ్యాలున్నాయి. లోక కల్యాణం కోసం శివుడు హాలాహల విషమును తన కంఠ మధ్యములో నుంచుకొని నీలకంఠుడయ్యాడు. కనుకనే శివుడు ఆనందాన్ని ప్రసాదించు మహాదేవుడు. చైతన్య సముద్రంలో ఎన్నో అలలు, బుద్బుదములు, నురుగు ఉదయించి, లయమవుతూ వున్నాయి. కామక్రోధాదులను తరంగాలు, రాగద్వేషాదులను బుడగలు, అహంకారమను ఫేనము చైతన్య సముద్రంలో పుట్టి, పెరిగి, లయం చెందుతున్నాయి. ప్రపంచములోని సర్వమతముల వారు, అన్ని సాంప్రదాయముల వారును గూడ సర్వమంగళ ప్రదమయిన చైతన్యమునే అర్థించుచున్నారు. అందరికి గూడ తెలిసికోవాలను బలమైన కోరిక వుంటుంది. ఒక విషయము తెలిసినచో సంతోషము. లేకున్నచో దుఃఖము. కనుకనే మానవులందరును సదా అన్ని విషయాలు తెలిసికొని అనుభవించాలనే కోరికతో వుంటున్నారు తెలిసినవి కొన్ని, తెలియనివి చాలా వున్నాయి తెలియనివన్నియు మనకందరికి తెలుసునన్న సత్యము జగద్విదితమే గదా ! మనకు తెలిసినవి, తెలియనివి, అన్నింటిని తెలుసుకొను "తెలివి" చైతన్యము, అఖండజ్యోతి స్వరూపము, చీకటిని ప్రకాశింపచేయు చిత్. తెలిసిన బుద్ధివృత్తులకును, తెలియని బుద్ధివృత్తులకును ఆధారమైనదే "నేను". సత్యం శివం సుందరమును అన్ని జాతులవారును, మతములవారును వదలిక్షణమైన

## మీకు తెలుసా !

1976 లో న్యూయార్కులోని మెట్రోపాలిటన్ ఆసుపత్రిలో ఒక పిచ్చివాని కడుపునుంచి 300 నాణాలు, తాళం చెవులు, చిన్నగొలుసులు, థర్మామీటరు ముక్కలు, నట్లు, బోల్టులు మొదలైన 200 ఇతర వస్తువులు బయటికి తీసారు.

*　　*　　*

1970 లో వెస్లికోన్స్ 9 సెకనులలో 26 పచ్చి కోడి గ్రుడ్లు తిన్నాడు.

*　　*　　*

1971 లో డిశంబరు 5 న క్లిఫర్డ్ ఫీర్స్ ఒకొక్క బీన్స్ కాయను పుల్లకు గుచ్చుకుంటూ 1?20 కాయలను తిన్నాడు.

స్త్రీ ముఖము సింహపు శరీరంగల పెద్ద రాతి ప్రతిమ The sphinx of Egypt. ఇది ఈజిప్టులో గిజెవర్ వద్ద కలదు. క్రీ. పూ 2750 లో నిర్మించ బడింది. ఒకే శిలతో చెక్కబడింది, దీని పొడవు 172.5 అ. ఎత్తు 66 అ.

*　　*　　*

ప్రాచీన సర్కస్ ప్రదర్శనశాల రోమ్ లో ఉన్నది. క్రీ. పూ 605లో నిర్మించబడి జూలియస్ సీజర్‌చే ఇది అభివృద్ధి పరచబడింది. దీని పొడవు 1875 అ; వెడల్పు 6256 అ; ఎత్తు 312 అ.

---

బ్రతకలేరు. కాన అందరిస్వరూపము జ్ఞాన స్వరూపమైన చైతన్యమే అని సనాతనసాంప్రదాయము. చనిపోవు అహంభావము పోయినచో చనిపోని, సత్యమైన "నేను" అహంగా ప్రకాశించును. అహంవృత్తి యొక్క పుట్టుక స్థలమును కనుగొనువాడు పరబ్రహ్మముగా మిగులును. జ్ఞాతా జ్ఞానం జ్ఞేయములు ఒక్కడైన నేనే.

సత్యమైనది నిత్యము. నిత్యమైనది మంగళము. మంగళమైనది సదా, సర్వదా సుందరమే గదా! సౌందర్యాన్ని సమస్త మతాలు, జాతులు, వర్ణములు, భాషలవారు ఉపాసించుచున్నారు. ప్రకృతి సౌందర్యమును, విషయ సౌందర్యమును, మానసిక సౌందర్యమును అందరును తు. చ. తప్పక సేవిస్తున్నారు. ఒకవ్యక్తి సుందరంగా వున్నచో, ఆ వ్యక్తిమీద ప్రేమ అంకురించి ఆనందమును వెంటనే కలుగచేయును. ప్రకృతిలోని ప్రతిక్షణము, ప్రతి అణువును కూడ సుందరమే, ప్రేమమయమే. సౌందర్యమును తెలుసుకున్నప్పుడు, ప్రేమను అనుభవించినప్పుడు ప్రతి మనిషి నిజముగా సుందర ప్రేమానంద స్వరూపుడే కదా! ప్రపంచంలోని కళాకారులు, పిల్లలు, కవులు,పండితులు,స్త్రీలు,పురుషులు, తత్వవేత్తలు, యోగులు,భోగులు అందరునూ, అనంత సౌందర్యానందమునే ప్రేమించుచూ అనుభవించుచున్నారు. అనంత ప్రేమలో ఏ విధమైన భేదము, వర్ణము, జాతి, కులములు లేవు. పవిత్ర ప్రేమ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులదే కాదు. అయితే విశ్వములోని సమస్త మానవులది. ఈ విధమయిన స్వార్థరహిత, విశ్వమానవ ప్రేమ ఉన్నది, ఉన్నట్లు తెలియుచున్నది. కనుక ప్రేమ ఆనందంగా, అందముగా విశ్వమును తీర్చి దిద్దుతున్నది. సుందరమయినది సర్వము. కానిది కేవలం అహంకార, మమకార భావనలే కనుక మనిషి వీటిని త్యాగము చేయాలి. జ్ఞానం చేతనే బాధితం చేయాలి. అప్పుడు తాను తానుగానె, సత్యం శివం సుందరంగానే, కర్మేంద్రియములతో సమాజ సేవ, లోక సేవ చేసి కృతకృత్యుడయి అందరిని గూడ కృతకృత్యులుగ చేయుచున్నాడు. కావున మనకు అవివేకంతో జీవ జగత్, ఈశ్వరులు అసహ్యముగ అమంగళముగ తోచినప్పటికీ, వివేకంతో పైమూడు భావనలు అత్యంత సుందరానందంగా వున్నాయి. గనుక జీవజగదీశ్వరులు, సత్యం, శివం, సుందరములు, జ్ఞాతా జ్ఞేయ జ్ఞానములు, సచ్చిదానందములు, సర్వస్వము ఒక్కటే. అనంతమైన ఏకమైన, భేద రహితమయిన సుందర ప్రేమానందామృతమును సద్గురు బోధద్వారా అందరును పానముచేసి ధన్యులగుటకు వినయముగా ప్రయత్నించెదము గాక ! ★

" శ్రీవాణి " ద్వితీయ వార్షికోత్సవ

సంక్రాంతి శుభాకాంక్షలతో




ఫోన్ : 38

# శ్యాంప్రసాద్ వీవర్స్ కో-ఆపరేటివ్ ప్రొడక్షన్ & సేల్ సొసైటీ లిమిటెడ్

No. H. W. 7

**పోలవరం, బందరు తాలూకా, కృష్ణాజిల్లా**

స్త్రీల సౌందర్యమును ఇనుమడింపజేసే సరిక్రొత్త డిజైనులలో
మావద్ద 100, 80, 60 నెంబర్లుగల డార్కు చేనేత వస్త్రములు
పక్కా రంగులలో దొరుకును.

**మా సేల్స్ డిపో : రత్నం మార్కెట్, విజయవాడ - 1**

పిచ్చుక నాగేశ్వరరావు - ఛైర్మన్ వుట్ల కోటవీరభద్రుడు - మేనేజరు

పర్చేస్ ఇన్‌చార్జి : మాచర్ల కోటమల్లిఖార్జునుడు, ఊటుకూరి నాంచారయ్య
బూసం దొంతుకోటనాగేశ్వరరావు, పిచ్చుక కోటవీరభద్రుడు

# పుస్తకసమీక్ష

## శ్రీమత్ప్రతాపగిరి ఖండము

'శ్రీ మత్ప్రతాపగిరి ఖండము'- ఆధునిక కాలంలో వెలువడిన ప్రౌఢ కావ్యం. కవి శ్రీ కపిలవాయి లింగమూర్తి గారు చారిత్రిక విషయ సేకరణలో చూపించిన శ్రద్ధ దీనిలో ప్రస్ఫుటంగా కనబడుతుంది. స్థల పురాణానికి చరిత్రను జోడించి ప్రౌఢ కావ్యంగా రూపొందించారు కవి.

ఈ కావ్య రచనకు ప్రేరణను కవి ఈ విధంగా తెలియచేశారు.

"వచనం. ఒక్కనాడు ఏదేని సరస ప్రబంధంబు చేయ నూహించి ఆలోచించు చున్నంత మజ్జనని నన్ను దరిసి తన జన్మ దేశంబగు ప్రతాపగిరి సీమ కేదేని చరిత్ర గలదేని వినిపింపుమని గోర-" తాను ఈ ఇతివృత్తమును స్వీకరించినట్లు తెలియచేశారు.

శ్రీ మత్ప్రతాపగిరి మొదటి పేరు 'అమరావతి' యట—అనగా ఇది పంచారామాలలో ప్రసిద్ధమైన గుంటూరు జిల్లాలోనున్న 'అమరావతి' కాదు. ఇప్పటి మహబూబ్‌నగర్ జిల్లాలో ఒకప్పుడు ఆ పేరుతో వున్న స్థలం మహబూబ్‌నగర్ జిల్లాకు చెందిన తాలూకాలోని మున్ననూరు, అమ్రాబాద్ ప్రాంతాలలో ప్రాచీనకాలంలోని రాజులు సాగించిన పలుకుబడినీ, ఆ కాలంలో జరిగినవిగా ప్రచారంలో గల వైతిహ్యాలనూ ఆధారంగా తీసుకొని ఈ ప్రబంధాన్ని రచించారు శ్రీ లింగమూర్తిగారు. ఈ విషయాలనన్నింటినీ కవిగారే ఈ కావ్యానికి వ్రాసుకొన్న భూమిక 'అమరావతి చెప్పిన కథ' అన్న పేరుతో స్పష్టం చేశారు. ఇది గవేషణాశీలురైన పాఠకులకు ఆనందాన్ని కలిగిస్తుంది.

లింగమూర్తిగారు ప్రౌఢ కవి. సాంప్రదాయిక పద్ధతిలో కవితా రచనం చేసిన ప్రాచీన కవితా పక్షపాతి. ఛందోబద్ధమైన శార్దూలం ; కందం, ఆటవెలది, తేటగీతి ఇత్యాది పద్యాలు వచనాలు కలిగిన ఆరు ఆశ్వాసాలు కలిగిన చంపూ కావ్యం వీరి 'ప్రతాపగిరి ఖండం'. కావ్య నిర్మాణంలోనూ పద్య రచనలోనూ కూడా వీరి రచనా ప్రౌఢత ప్రస్ఫుటిస్తుంది. అవతారికలో ప్రాచీన కవుల కంటె ఒక అడుగు ముందుకు వేస్తూ అవతారికలో చేసిన అపంచ వర్గీయ షష్ఠ్యంతాల రచన ఈ విషయాన్నే స్పష్టం చేస్తుంది. ఆశ్వాసాంతాలలో శైల, శంఖ, ధనుర్లతికా, మయూరాది బంధాలు కూడా ఇటువంటివే. ఇవి పాఠక లోకానికి మరింత స్పష్టంగా, సులభంగా విశదం కాగలవన్న అభిప్రాయంలో కాబోలు కవిగారు వీటికి చిత్రాలు కూడా ముద్రింపించారు. ఇవి వీరి ఆశయాన్ని సిద్ధింపచేశాయనే చెప్పవచ్చు.

ఈ కావ్యానికి డాక్టర్ యస్. లక్ష్మణమూర్తి వ్రాసిన ఫోర్‌వర్డ్, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి అభిప్రాయం శ్రీ తీర్థ శ్రీధరమూర్తి, డాక్టర్ వి. వి. యల్. నరసింహారావుగారి 'సమీక్ష', నల్లపురెడ్డి బుచ్చిరెడ్డిగారి 'కొత్త వూపిరి', డాక్టర్ యం. కులశేఖరరావుగారి 'అధివీక్షణం', విడదవోలు వెంకట్రావుగారి 'యశస్తిలకమ్'—లు కావ్యావలోకనానికి తోడ్పడుతున్నాయి. శ్రీ నల్లపురెడ్డి బుచ్చారెడ్డి తమ సమీక్ష 'కొత్త వూపిరి'లో సంఘంలో దినం దినం వర్ధమానమవుతున్న అన్యాయాన్నీ, అవినీతినీ గూర్చి బండబూతులు రాస్తే ఈనాడది సామాజిక స్పృహ వున్న-కవితగా భావింపబడుతోంది. సంఘంలో తానూ ఒక భాగమన్న నిజాన్ని కవి గుర్తించడంలేదు. ప్రబలుతున్న అన్యాయంలో అవినీతిలో తనకూ కొంత వాటా వుందని గ్రహించడంలేదు. గురివెందలాగు తన నలుపును చూసుకోలేని కవి జటిలమవుతున్న సమస్యలకు పరిష్కారం చెప్పటానికి బదులు అనవసరమైన ఆవేశాన్ని వెళ్ళగక్కుతున్నాడు. ఇందువల్ల ప్రజా కవిత ప్రజల కర్థం కావడంలేదు. అభ్యుదయ కవిత నేతిబీరకాయలా

మారింది దిగంబర కవిత్వం దిక్కుల నధిగమించి సగటు మనిషి పాఠకుని దృష్టి కందకుండా పోయింది.

"ఆధునిక కవిత్వానికి ఇంతటి దౌర్బల్యం ఎందుకు దాపురించినట్లు ?...." అంటూ వేసిన ప్రశ్న సాహితీవేత్త లందరూ ఆలోచించతగినది.

ప్రాచీన కవితను అభిమానించే పాఠకులకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తుంది కావ్యం.

వెల : రు. 18-00

ప్రతులకు : కె. కిశోరుబాబు

15-34, వాణీ సదనం, విద్యానగర్ కాలనీ,

నాగర్ కర్నూల్, మహబూబ్‌నగర్ జిల్లా-509209.

# భక్త మీరా

మీరాబాయి శ్రీకృష్ణ భక్తురాలు. భక్తిపూరిత మైన ఆమె హృదయం లోంచి మధురమైన సంకీర్తనలు జాలువారాయి. వ్రజ భాషలో గోకుల చక్రవర్తిని కీర్తించిన కీర్తనలు, వీటిని గానం చేసిన మీరాబాయి చరిత్ర భారతదేశమంతటా, అన్ని భాషల వారికీ సుపరిచితాలు. అందరి అభిమానాన్ని చూరగొన్నాయి కూడా.

మీరా చరిత్రను సరళంగా అందరికీ అర్థమయే విధంగా అందరికీ అందచేయాలని కవయిత్రి జ్యోతిరాణి చేసిన ప్రయత్నమే ఈ 'భక్త మీరా' వచన గేయ ప్రబంధం.

మీరా బాల్యం, ఆమె వివాహం, అత్తింటి ప్రయాణం, భర్త ఆదరణ, భర్త భోజరాజు మరణం, ఆ తరువాత మీరా పడిన కష్టాలు— ఇత్యాది సంఘటనలన్నీ దీనిలో ఒకదాని తరువాత ఒకటి క్రమంగా చిత్రించారు శ్రీమతి జ్యోతిరాణి.

స్వీకరించిన ప్రక్రియ వచన గేయం. రచన అంతా సరళంగా సాగుతుంది.

"రాజస్థానంలో జోధ్యపుర సంస్థానం
స్థాపించినవాడు రావు జోథాజీ
జోథాజీ సుతుడు దూజాజీ
దూజాజీ పుత్రుడు రత్నసింహుడు—"

అంటూ సూటిగా వేగంగా చెప్పదలచిన విషయాన్ని చెప్పారు జ్యోతిరాణిగారు.

అందమైన వర్ణనలు కొన్ని దీనిలో వున్నాయి.
మీరాని వర్ణించే సమయంలో చేసిన
"అన్నార్తులకోసం అన్నపూర్ణే దిగి వచ్చింది
మోక్ష పిపాసులకోసం భక్తి భాండమే తెచ్చింది"
...వర్ణన ఇలాంటి వాటిలో ఒకటి మాత్రమే.

సరళంగా సాగిన ఈ గేయ ప్రబంధంలో గేయంకంటే వచనమే అధికంగా పాఠకులకు దర్శనమిస్తుంది.

భక్త మీరా—(గేయ ప్రబంధం)
రచన : జ్యోతిరాణి
వెల—రూ. 15/-

ప్రతులకు :
శ్రీమతి జ్యోతిరాణి రవీంద్ర
1 89 ప్రభాత్ నగర్ కాలని
చైతన్యపురి, హైద్రాబాద్.

— మంగళగిరి ప్రమీలాదేవి

## మానవ శరీరంలో నీరు

మానవ శరీరంలోని నీరు రోజూ సగటున మూత్రం ద్వారా 1500 ఘ. సెంటీమీటర్లు; చెమట ద్వారా 600 ఘ. సెం., బయటకు వదిలే గాలి ద్వారా 400 ఘ సెం., మలం ద్వారా 100 ఘ. సెం. బయటకు పోతుంది. శరీరం లోని నీరు 10 శాతం కన్నా ఎక్కువపోతే ప్రమాదం. 20 శాతం పోతే మరణం తథ్యం కనుక బయటకు పోయే 2500 ఘ సెం. నీటిని విధిగా మనం రోజూ భర్తీ చేస్తూ వుండాలి



# క్షితిజ రాగం

డా॥ సంజీవదేవ్

వినిపిస్తుంది. రాగం
ఎక్కడనుండో తెలియదు
ఏమి రాగమో తెలియదు
దేని రాగమో తెలియదు
వినిపిస్తుందని తెలుస్తుంది
వినిపించేదే కాని కనిపించదు
కన్ను తెరిచినా వినిపిస్తుంది
కన్ను మూసినా కూడ.

దగ్గరనుండి కాదా వినిపించేది
సుదూర క్షితిజాల కావలినుండి
అనంత దిగంతాల అంచులు దాటిన
దూర సుదూర తీరాలనుండి
వంపు వంపుల తెంపులేని
అదొక శ్రవ్య మేఘమాల.

దూరాని కంటే దూరాన
దూర దూర తీరాలను దాటిన
నదీ నదాలను సాగర తరంగాలను
అధిగమించిన అత్యంత దూరాన
కొండలను కోనలను పశుపక్షులను
తేలిపోయే మేఘాల నీలి నీడలను
అతిక్రమించిన క్షితిజరేఖల కావలినుండి
ఒకోసారి వీణానాదం వలె
మరోసారి వేణు రవంవలె
ఇంకోసారి గాత్ర గానం వలె
వినిపిస్తుంది ఆ రాగం
అస్ఫుటంగా ఆకశాన్ని చీల్చుక.

ఆ రాగం ఏ ధ్వనికీ కాదు ప్రతిధ్వని
ఆ రాగం అనురాగానికి ప్రతిధ్వని
అనంత దూరాల్లో పుట్టిన
ఆ సునాద క్షితిజ రాగం
ఎక్కడా ఆగక సూటిగా వచ్చి
స్పందిత హృదయాలను చొచ్చుతుంది
అటునుండి తిరిగి పయనిస్తుంది
తాను పుట్టిన క్షితిజాల వైపుకు
జడ చేతనాలను రాగరంజితం చేస్తూ
అనురాగ ప్లావితం చేస్తూ.

క్షితిజాల కావలి రాగం చేస్తుంది
క్షితిజాల కీవలి జగత్తును రసమయం
దుఃఖాలను చేస్తుంది దూరం
దైన్యాలను చేస్తుంది దగ్ధం
అది శ్రవ్యమైనా, దృశ్య జగత్తును
మారుస్తుంది మధుమయంగా
నింపుతుంది మందారాల రంగుతో
మల్లెల మధుసిక్త సురభితో.

క్షితిజ సంగీతం మన్నుగుండా
మిన్నుగుండా అలలలలుగా ప్రకంపిస్తూ
భూచరాల జలచరాల నభచరాల
మానస కాసారాలను వెలిగిస్తుంది
ఆనంద కాంతితో
అపూర్వ శాంతితో
ఆ క్షితిజరాగం
విశ్వమంతటికీ అనశ్వర అనురాగం. ★

 

# ధృతరాష్ట్రుని ఆవేదన

ఇలా ఉండగా - ఒకనాడు, కుంతి చేత గాంధారి చేత సేవింపబడుతున్న ఆంబికేయుని దగ్గరకు పాండవులూ, శతయూపుడు మున్నగు ముని జనమూ ఎప్పటిలాగే వచ్చారు ; వారంతా సముచితమైన ధర్మ బద్ధమైన సద్గోష్ఠిలో వున్నారు. ఇంతలో భగవంతుడు పరాశరుడు అక్కడకు వచ్చాడు.

వేదవ్యాసుణ్ణి చూడగానే అందరూ లేచి ఆయనకు ప్రత్యుత్థానము చేశారు. భక్తితో ఆయనను లోనికి తీసికొని వచ్చారు. ఆయనకు ఉచితమైన ఆసనాన్ని సమర్పించారు. తర్వాత ఆయన అనుమతితో అందరూ తమ తమ స్థానాలలో అసీనులయారు. ఆ మహాత్ముణ్ణి అంబికేయుడు సముచితంగా అర్చించాడు.

వేదవ్యాసుడు మృదువుగా, మధురంగా ధృతరాష్ట్రుని యోగక్షేమాలను విచారించాడు ; ఇలా అడిగాడు.

" ఈ వనవాసానికి నీ మనసు అలవాటు పడిందా ? నియమంతో తాపస క్రియలను ఓర్చుకోగల్గు తున్నావా ? కొడుకుల్ని పోగొట్టుకున్న శోకాన్ని తరించావా ? అది నీ మనసున లేదు కదా ! సర్వ ధర్మాలను ఎఱిగిన ప్రాజ్ఞురాలు, గాంధారి ! ఈమె శోకాన్ని పొందకుండా ఉన్నదా ? నీకు పరిజ్ఞాన నిష్ఠ కల్గిందా ? నీకూ, గాంధారికీ, తగు విధంగా శుశ్రూష చేస్తోందా ? మీరు ఇలా అడవికి వస్తూంటే, తాను ఇంట నుండడం అనుచితమని రాజ్యాన్ని వదలి ఇలా వనవాసానికి వచ్చింది, కుంతి ! ఈమె ఈ మేలు నీ మనసున పట్టి ఉన్నదా ? "

" ఈ ధర్మరాజుకు ఎవరి పట్ల శత్రుత్వమనేదే ఉండదు, అతని పట్ల నీ మనసు ఆదరాన్ని వహించి ఉంటుందా ? ఈ భీముని, అర్జునుణ్ణి నకుల సహదేవులను, వాత్సల్యంతో గౌరవించ గల్గుతున్నావా ? దృఢమైన శాంతికి కావలసింది మనస్సు నిర్మలంగా ఉండడం. నీ చిత్తము అలా మిక్కిలి నిర్మలత్వ మొంది ఉన్నదా ? "

మరి ఆయన మనసున ఏమున్నదో ? ఆయన ఇలా కూడా అన్నాడు ; " దీర్ఘ వైర వృత్తీ, క్రోధ చింతనమూ, పనికిరావు. ఈ రెండూ లేకుండా ఉండడమూ, మనస్సూ వాక్కూ ఒక్క విధంగానే ఉండడమూ, శాంతిని సాధించడానికి పరమ సాధనాలయ్యా !

వడలి మందేశ్వరరావు

" విదురుడు దేహాన్ని విడిచిన విధానాన్ని విన్నావు కదా ! మాండవ్యుడు ఇచ్చిన తీవ్ర శాపం వల్ల ధర్మదేవత ఇలా శూద్ర భావాన్ని పొంది, బ్రహ్మదేవుని ఆన వల్ల నీతి విదుడై, నిర్మలాత్ముడై, విచిత్రవీర్యుని కొడుకుగా పుట్టాడు. ఈ ధర్మరాజు శరీరమే ధర్మదేవతకు మరో తనువు సుమా ! దీని నెఱిగి యుండడం వల్లనే కదా ఆ యోగీశ్వరుడు – విదురుడు యోగబలాన ఈయనలో ఐక్యమయాడు !

" మఱి సాక్షాత్తు ధర్మదేవతాత్మకుడైన ఈ రాజు నిన్ను ఇలా సేవించి ఉండడమంటే, నీ అదృష్ట మెంతటిదో ఊహించుకో గల్గుతున్నావా ? ఆ ఆనందాన్ని అనుభవిస్తున్నావా ? "

ఇలా అన్న వ్యాసునితో పరమ వినయంగా అంబికేయుడిలా అన్నాడు.

" ఈ వనవాసం నాకు ఏ మాత్రమూ దుఃఖాన్ని కలిగించడం లేదు. ఈ దేహమూ, మనస్సూ కూడా తపస్సుకు అనుకూలంగానే ఉన్నాయి. గాంధారి నన్ను శోకాన్ని పొందనీయదు. ధర్మరాజు అంటేనూ,

## నిత్య సత్యాలు

అహంభావం తలకెక్కినవాడు అహంకారంతో తనకే అన్ని విషయాలు తెలుసునని విర్రవీగుతాడు. అహంకార, అహంభావాలు మానవుని పతనం చేస్తాయి.

చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనం ఎంతో, కాలం మించిపోయిన తరువాత విచారిస్తే ప్రయోజనం అం (శూన్యం)

ఓర్పు వహించిన వారికి జయం లభించి తీరుతుంది. ధన మదోన్మాదంతో కన్నుకానని వాళ్లు నశించితీరుతారు.

వేదనలో నలిగినప్పుడే, అవమానాగ్నిలో క్రాగినప్పుడే మానవ హృదయం లోని అసలైన లోతులు బైటపడుతాయి.

కష్టాలవల్లా, దుఃఖాలవల్లా మనస్సు వికలమైపోయి విచక్షణా జ్ఞానాన్ని పోగొట్టుకొనకుండా నిశ్చలంగా నిలబడే వారే గొప్పవారు.

ఆత్మ ప్రశంస కన్న మిన్నయైన ఆత్మహత్య లేదు. స్వకార్యములు ఘనకార్యములుగా స్వముఖతః కీర్తించుకునే వాడు ఆత్మహంతకులలో అగ్రస్థానం అలంకరిస్తాడు.

ఏవస్తువైనను ఉన్నప్పుడు దానివిలువ తెలియదు.

చదువురాని దుర్జనుడి కంటే, చదువుకొన్న దుర్జనుడు ఎక్కువ ప్రమాదకారి.

ముఖం అందంగా, పరిశుభ్రంగా ఉన్నందువల్లనే ప్రయోజనం లేదు. హృదయం విశాలమైనదిగా, గొప్పదిగా వుండాలి.

పక్షులలో కాకి నీచము. మృగములలో గాడిద నీచము. సన్యాసులలో కోపము గలవాడు నీచుడు. ఒకరిని ఎప్పుడూ దూషించువాడు అందరి కంటె నీచుడు.

సంపద వల్ల అవగుణాలు బయట పడుతాయి. కష్టాల వల్ల సుగుణాలు వెల్లడవుతాయి.

ఆయన తమ్ములంటేనూ నా హృదయంలో వాత్సల్యం తప్ప మరేమీ లేవు. ఈయన దేవతాత్ముడని నేను గ్రహించానని నా మాటలవల్ల, చేతలవల్ల ఈతనికి కూడా తెలిసే వుంటుంది. కుంతి ప్రవర్తన ఆమె చేసే శుశ్రూష నాకు ఆశ్చర్యాన్ని, సంతోషాన్ని కలిగిస్తాయి. నాకు పరిపూర్ణ జ్ఞానము, మానస నిర్మలత్వము నీ అనుగ్రహం వల్ల కల్గునని ఆశిస్తున్నాను."

ఈలోగా వ్యాసుడు వచ్చాడని ఆయనను చూడగోరి ద్రౌపదీ సుభద్రలు, ఇతర స్త్రీ జనం అక్కడకు వచ్చారు. ఆ మహామునికి నమస్కరించి, యథోచితంగా నిలచి ఉన్నారు.

వేదవ్యాసుడు పరమ జ్ఞాని, అందరికీ మాననీయుడు, ధృతరాష్ట్రుని మాటలను విన్నాడు. మరి ఆ వృద్ధరాజు మనసులో ఏమున్నదో గ్రహించాడో ఏమో, ఆయన ఇలా అన్నాడు.

"మీ మనసులలో శోకం ఏమయినా ఉంటే, బెంగ ఏమయినా ఉంటే దానిని తొలగించడానికీ, మీ కోర్కె ఏమయినా ఉంటే దానిని తీర్చడానికీ, నేనిక్కడికి వచ్చాను. నీ కోర్కె ఎట్టిదయినా సరే, మనస్సులో ఒక శంకను పెట్టుకోకుండా అడుగు. నీకు తృప్తీ, ఆనందం కల్గేటట్లుగా, నీవేమి అడుగుతే దానిని నీకు సమకూర్చి పెడతాను."

అలా అనేసరికి పాండవులు ఓహో! అనుకున్నారు. వృద్ధరాజూ సంతోషించాడు. వేదవ్యాసు డింకా ఇలా అన్నాడు.

"ఇది అడగవచ్చు. ఇది అడగకూడదు అని మనసున సందేహం పెట్టుకోవద్దు. అది ఎంతటి లోకోత్తరమైన కోరిక అయినా, అతి మానుషమైనదైనా, మునీంద్రులందరూ అద్భుతాన్ని పొందేటట్లుగా, అవలీలగా ఆ కోర్కెను తీరుస్తాను, నీవు కోరింది ఇస్తాను!"

వ్యాసుడిలా అనగా, ధృతరాష్ట్రుడిలా అన్నాడు. "మీరు ఇక్కడకు రావడమే మీ కరుణకు, ఆదరానికి తార్కాణం! ఇంతకన్న మేము కోరదగింది ఏముంటుంది? ఇంతకన్న

మాకు కలిగే మేలు ఏమి ఉంటుంది? కోరదగిన వస్తువు మానుషమైనదైనా, అతి మానుషమైనదైనా, మీ అనూనమైన కృపకన్న మిన్న అయినది నాకేమీ కనిపించడంలేదు. మీరింతగా చూపే ఈ ఆదరణవల్ల నా జన్మ చరితార్థమైంది. ఇంక నాకు పరలోక భీతి లేదు. నేను ధన్యులలో ధన్యుణ్ణి. ఇంతకంటె నాకు కావలసింది ఏముంది?

"అయినా మీరు నన్ను ఏదయినా ఒకటి కోరుకోమన్నారు కదా! నా మనసును తొలిచే సంశయ మొకటి ఉన్నది. మన్నిస్తే విన్నవిస్తాను.

"దుష్టచిత్తుడైన దుర్యోధనుడు నిష్పాప స్వభావులైన ఈ పాండవులను పరిభవించాడు. లోకంలోని రాజులందరూ తమతమ కరితురంగాలతో మృతి నొందేటట్టు చేశాడు. రాజ్యంకోసం భీష్మద్రోణ కర్ణులను, ఎందరో సత్పురుషులను చంపికొన్నాడు. ఈ అల్పబుద్ధికై మహారాజులందరూ భార్యలను, బిడ్డలను విడచి, అచలంగా నిలబడి అలా పోరి, పోరి నేల నొరిగి పోయారు. ఈ రాజులందరూ మరణించాక ఎటి గతిని పొందారో! అలా మూఢులై యుద్ధంలో కూలిపోయిన కురు కుమారు లేమయి ఉంటారో! దీని నెఱుగక పోవడమే నాకు పెద్ద బెంగగా పరిణమించింది. ఈ బెంగను తీర్చడానికి పరమబోధ గల మహాత్ముడవు నీవే సమర్థుడవు!"

గుండెల్ని కరగించే ఈ మాటలను వినేసరికి గాంధారికి, కుంతికి, పాంచాలికి, సుభద్రకూ, అక్కడి మిగతా స్త్రీ జనానికి, వెనుకటి శోకం మళ్ళా ముంచుకొని వచ్చింది.

అప్పుడా గాంధారి కండ్లకు కట్టిన పట్టం నుంచే చూస్తూ దయాధామమైన ఆ మామ వైపునకు చేతులు మోడ్చి, ఆయన నుద్దేశించి ఇలా అన్నది.

"ఓ మహాత్మా! మునీంద్రా! ఈ రాజు తన కొడుకు లందరూ యుద్ధంలో తెగిన నాటినుంచీ ఈ పదునారేండ్లూ, ఆ పిల్లలకోసం బెంగ పడి, వాళ్ళ నొకటి కొక్కమారు కనిపిస్తే చాలు ననుకుంటాడు. మహాతపస్వివి నీవు! నీ తపోశక్తివల్ల పదునాల్గు లోకాలనూ చూడడానికి సమర్థుడవు. ఈ రాజునకు ఆయన కొడుకులను కనిపింప చేయడమంటే నీకు ఏమంత పని! ఇక్కడ ఉన్న ఈ కుంతి, ద్రౌపది, సుభద్ర, ఈ తక్కిన స్త్రీ జనమంతా తమ పతులను, కొడుకులను, తండ్రులను, మామ

## నాభి

నిలువునా ప్రవహించే
నీటిలో తప్ప
నిలకడగా ఉన్న జలంలో
నిప్పు పుట్టదు—
కండ గల చేల
గుండెల్లో తప్ప
బండబారిన క్షేత్రంలో
పంట పివ్వదు—
ఘనీభవించిన మేఘపు
కారుణ్యంలో తప్ప
వాయువుకు లొంగిన మొయిల్లో
వర్షం జనించదు—
మానవత్వం కుసుమించిన
మనసులో తప్ప
దానవతా పరాకాష్ఠలో
దాతృత్వం హసించదు—
తాడనలో తపించే
తనువుల్లో తప్ప
కళకళలాడే గుండెల్లో
కసి వికసించదు—
చేతన కుసుమి స్తేనే
చీకటి లయి స్తుంది
వేదన ప్రసవి స్తేనే
వేకువ జయి స్తుంది.

- నాగభైరవ కోటేశ్వరరావు

లను చూడగోరుతారు. ఈ మాట నేను చెప్పనక్కరలేదు. ఇది నీ దివ్యబోధ వల్ల నీకు అవగాహన కానిదికాదు!

" పరమ మునీంద్ర సమర మృత
కురు వీరుల మా మనముల గోడుడుగ భవ
త్కరుణ వెలయ లోకం బ
చ్చెరు వందంగఁ జూపవే విచిత్రపు మహిమన్ "

గాంధారి ఎట్టి కోరికను కోరుతుందో చూడండి ! కురు వీరు లందరూ మృతులై అప్పటికే పదునారేండ్లు పైగా అయింది. వారందరికీ దహన సంస్కారాలు జరిగాయి. వారి శరీర అవశేషాలు కించిత్తుకూడా మిగల లేదు. కాని వేదవ్యాసుని మహిమ విచిత్రమైనది, అద్భుతాన్ని గొల్పేది, లోకానికి పరమాశ్చర్యాన్ని కలిగించేది ! ఆయనకు దయ పుట్టాలి కాని, ఇది ఆయన కెంతటి పని ! అందుకే మా మనసుల్లోని చింతను ఏరివేసినట్టుగా ఆ మృత వీరులను మాకు అందరికీ చూపవయ్యా అని గాంధారి కోరుతోంది.

వెను దిరిగి చూసుకుంటే, ఈ కోర్కెను కోరవలసిన వాడు ధృతరాష్ట్రుడు. అసలే పుట్టు గ్రుడ్డి యీ వృద్ధ రాజు. కొడుకులు లేక పోవడంతో లోకం మరింత చీకటి అయిపోయింది.గుండెలో ఈ బెంగే గూడు కట్టు కొని ఉంది. దీనినే వేదవ్యాసుడు పసిగట్టి " పుత్రనాశజ మైన శోకమ్ము భవదంతరంగబునందు లేదు గదా ! " అని అడిగాడు. ధృతరాష్ట్రుడు, " గాంధారి బుత్రశోకం బొకింత యేనియుఁ బొందంగనీదు ! " అనే అంటాడు కాని తన బెంగను బయటపెట్టే బెండు గుండె కాదాయనది. ఆ మీద గూఢమతి అవడం వల్ల " నీవు మా పట్ల కన బరచే ఆదరమే మాకు పరమమైన విషయం " అంటు న్నాడు. అయినా ఆ కోర్కెను బొత్తిగా దాచుకోలేక, దానికొక చిన్న ఆచ్ఛాదనను కల్పించి, తన కొడుకుల మాట ప్రత్యేకంగా అడగకుండా, " మృత వీరులంతా ఏమయి ఉంటారు ? వారి కెట్టి గతులు కల్గాయి ? " అని అడిగాడు.

గాంధారి ఆ కాస్త ఆచ్ఛాదననూ తొలగించి, ఆ వృద్ధ రాజు మనసులోని కోర్కెను బయట పెట్టింది.

కాని అది ఎట్టి కోరిక ! ఎంత అసంగతమైనది ! అంతటి లోకాద్భుతమైన మహిమను చూపగల్గితే వ్యాసుడే చూపాలట !

(ఇంకా ఉంది)

# మారని నోటు (చిన్న కథ)

– ఇల్లిందల సరస్వతీదేవి

**విజయవాడ స్టేషన్‌లో అరిస్టోక్రాట్ చేతబట్టుకుని గోలకొండలో ఎక్కిందామె. ఆమె ఎక్కిన కంపార్ట్‌మెంటు కిటకిటలాడుతూ ఉంది.**

ఒక బెంచిమీద నలుగురు ప్రయాణీకులు కూర్చుని పగలబడి నవ్వుకుంటున్నారు. గవాస్కరు, రవిశాస్త్రి, కపిల్‌దేవులను గురించి వాదనల్తూ, చర్చలూ, పొగడ్తలూ, నవ్వులతో ఆ కంపార్టుమెంటు గలగలలాడిస్తున్నారు.

ఆమె ఆ కంపార్టుమెంటు చివరవరకు వెళ్ళి తిరిగి వచ్చింది. ఎక్కడా సీటు ఖాళీగా లేదు. ఆ సాయంకాలం హైదరాబాదు నగరంలో ఒక పెద్ద సినీతారకు సన్మానం జరుగబోతున్నది. అందరికీ ఆమెను వెండితెరమీద కాకుండా ప్రత్యక్షంగా చూడాలన్న ఉబలాటంగా వుంది. కొందరికి ఆటోగ్రాఫ్ తీసుకోవాలన్న సరదాకూడా వుంది.

ఆమె ఒక నిమిషం సేపు నిలబడగానే – కిటికీ దగ్గరగా ఉన్న రెండు సీట్లలో ఒక సీటు ఖాళీచేసి, ఆ నలుగురి ప్రక్కన చోటు చేసుకుంటూ "మేడమ్ ఆ సీట్లో కూర్చోండి" అన్నాడొక యువకుడు హిందీలో.

"థాంక్యూ సోమచ్" సన్నగా వినీ వినబడకుండా ఆమె అన్నదానికి "నోమెన్షన్" అంటూ పెదవులు బిగ బట్టాడతడు.

బెంచీమీద కూర్చున్న యువకులు మళ్ళీ క్రికెట్‌మాచ్ మీద కొందరూ సినీ జగత్తును గురించి కొందరూ మళ్ళీ చర్చలు మొదలు పెట్టారు. ఒక్కొక్కరికి ఒక్కొక్కరి మీద అభిమానం.

ఆమె పెట్టెను పక్కకు పెట్టి సర్దుకొని కూర్చుంది. అంతలో బేరర్ వచ్చి "మేమ్ సాబ్. అక్కడి నుంచి కంపార్టుమెంటులన్నీ వెతుక్కుంటూ వస్తున్నాను" అంటూ చేతిలో బిల్లుపెట్టాడు. ఆమె తన హ్యాండ్‌బ్యాగ్ తెరచి సొరుగు సొరుగూ జిప్ లాగి చెయ్యి పోనిచ్చి వెతికింది. విడి రూపాయలు లేవన్నట్టుగా ఏభయి రూపాయల నోట్ తీసింది. దాన్ని వేళ్ళ మధ్య రెప రెపలాడిస్తూ "చిల్లర తీసుకురా" అన్నది హిందీలో.

"మేమ్‌సాబ్. ఇప్పుడు నా దగ్గర అంత నోటుకు చిల్లరలేదు. రైలు దిగి తీసుకువస్తాను. ఇవ్వండి" చెయ్యి చాపాడు.

రైలు కదిలేటట్టుగా ఉంది.

ఆ నోటు బేరర్ చేతికివ్వటానికి ఆమె సందేహిస్తున్నట్టుగా కనబడ్డది.

వాళ్ళిద్దరినీ గమనిస్తున్నట్టుగా కనబడ్డ యువకుడు నవ్వులలోనుంచి తేరుకొని, దిగ్గున లేచి హిప్‌పాకెట్‌లో నుంచి తన చిన్న పర్సు తీశాడు. తెరచిచూస్తే అతడి దగ్గర కూడా ఏభయి రూపాయల నోటుకు తగిన చిల్లర

లేదు. కాని తన ఉదారస్వభావాన్ని దాచుకోలేక " మేడమ్ మీ బిల్లెంత ? " అడిగాడు.

" అదేంతో లేదు. ఐదు రూపాయల చిల్లర "

" అయితే ఈ ఐదు రూపాయల చిల్లర ఇచ్చేయండి. మీ నోటు మార్చిన తరువాత నాకు ఇవ్వవచ్చు. " అతడు వికసించిన ముఖంతో ఆమెకు అందించాడు.

బేరర్ వెళ్ళిపోయాడు.

నలుగురు ప్రయాణీకులు పెట్టెలో నుంచి పేక ముక్కలు తీసి రమ్మీ ఆట మొదలు పెట్టారు. మళ్ళీ పక పకలూ, సిగరెట్టు పొగ ఊదటం, ఓడిపోయిన వాళ్ళను గేలి చేయటం, చప్పట్లు కొట్టటం సాగించారు.

ఆమె తన సీట్లో సర్దుకొని కూర్చుంది. కొంతసేపు కిటికీలోంచి వెనక్కు పోతున్న చెట్లనూ పొలాలనూ చూసింది. వాటిని చూసి విసుగెత్తినట్టుగా దీర్ఘంగా ఊపిరి తీసుకుంది. ప్రక్కనున్న పెట్టె తెరచి స్టార్ అండ్ స్టయిల్ పేపరు చేతిలోకి తీసుకుంది.

బిల్లు చెల్లించటానికి డబ్బు ఎడ్వాన్సు ఇచ్చిన యువకుడు సంభాషణలో నుంచి తేరుకుని మధ్య మధ్య ఆమె వైపు తన దృష్టిని పోనిచ్చాడు.

కత్తిరించిన ఆమె తల వెంట్రుకలు గాలికి ఎగురుతున్నాయి. వాటిని బంధించిన క్లిప్పులు గాలికి ఆమె ఒత్తయిన తలవెంట్రుకలను ఆపలేక పోతున్నాయి. కళ్ళ మీద పడిన తల వెంట్రుకలను ఆమె ఒక చేత్తో ప్రక్కకు తోసుకుంటున్నది. ఆమె దేహచ్ఛాయ అంతగా ఆకర్షించక పోయినా- తీర్చిదిద్దినట్లున్న ఆమె ముక్కూ- కళ్లూ గడ్డమూ ముఖానికి కళాకాంతులనూ ఒక విధమైన సోయగాన్నీ ఇస్తున్నాయి. ఆ సోయగమే ఎదటి వారిని మొదటి చూపులోనే కళ్ళు తిప్పుకోనివ్వటం లేదు.

## అగ్నిమయం జీవితం

సమాజ సంస్కృతీ గర్భం నుండి
ఎప్పటికప్పుడు పరిణామ దశలతో
సామూహిక శక్తుల వర్తనతో సంపదతో
వైయక్తిక చేతనా ప్రకాశంతో స్వేచ్ఛతో
ప్రయాణించేను మానవుడు స్థలంనుండి స్థలానికి
తెరలను ఛేదిస్తూ సీమల్ని చెరపేస్తూ.

ప్రయాణంలో పగిలిన జీవిత శకలాల్లో
కదలుతూ జ్వాలారూప బింబాలు
జ్ఞాపకం చేసేను పూర్వ పూర్వ స్థితుల్ని,
ద్వేషం కోపం అసూయ స్పర్థతో వివిధ వర్ణాల్లో
ఇవి లేంది ఏ కథ లేదు! చరిత్ర అసలే లేదు
ఏ అడవి పల్లె నగరం వరకూ ఏ దశలోనూ.

పెదవుల కదలికలో నాలుక మలుపులో గాక
స్వరంలో స్పందనలో ఒకే ఒక రూపమై
ఆత్మలో వెలుగు నందుకోవాలనే మనిషి నుండి
యుగాలుగా జరుగుతూంది మానవ యత్నం.
కించిత్ విజయం! అంతలో నైష్ఫల్యం
చరిత్ర పునరావృతమై చేసేను పరిభ్రమణం!

అహంలో జ్వలించే ఆశతో
స్వరంలో దీపించే రాగంతో
హృదిలో రగిలే వేదనతో
జీవితం ఒక విధంగా అగ్నిమయం!

ఘనీభూత హిమ శిఖరాల్ని కరగిస్తూ
వచ్చే సూర్యుడు! ఏ ఖండం వాడు?
అంధీభూత హృదయాల్ని నరింపజేస్తూ
రావాలి మానవుడు; అవాలి సూర్యుడు;
కాలాన్ని మేల్కొల్పుతూ చీకటి నుండి
మేల్కొన్న జీవితాన్ని వెలిగిస్తూ ప్రేమతో.

— మాదిరాజు రంగారావు

అతడి ప్రక్కనున్న యువకుడు భుజం పట్టిలాగి మళ్ళీ సంభాషణల్లోకి దింపి, నవ్వుల జల్లులోకి లాగాడు.

మధ్య మధ్య అతడి దృష్టి ఆమె వైపుకు మళ్ళుతున్నది. అతడి మిత్రుడు భుజం పట్టి లాగుతునే ఉన్నాడు.

ఆమె చెవులకు ధరించిన ఈయర్ డ్రాప్స్ గాలికి ఊగుతున్నప్పుడల్లా రక రకాల రంగులు జిగ జిగ మెరుస్తున్నాయి. ఆమె ధరించిన నైలాన్ చీరె రంగూ, దాని మీద అద్దిన పువ్వులూ ఆ చీరెను ఆమె కట్టిన తీరూ చాలా ఆకర్షణీయంగా ఉన్నాయి. ఆమె స్లీవ్‌లెస్ బ్లవుజు గుండ్రటి భుజాలను కనబరుస్తోంది.

రైలు మంచి వేగంతో పట్టాలమీద సాగుతున్నది.

అంతలో టికెట్ కలెక్టరు వచ్చి అందరి టికెట్లూ చెక్ చేస్తున్నాడు.

అంతవరకూ ఆమె తల వంచుకొని పత్రికలో ముఖం దూర్చింది గాని– తన మెరుపులు ఎవరి కళ్ళల్లో పడుతున్నాయో ఓరగంట గమనిస్తునే ఉంది.

"టికెట్ ప్లీజ్"

ఆమె గ్గున లేచి తన పర్సు తెరచి అంతా వెతికి "టికెట్ నాదగ్గర లేదు. నా హస్బెండ్ అవతల కంపార్టుమెంటులో ఉన్నాడు. ఆయన దగ్గరుంది. మాకు రిజర్వేషన్ లేదు. కనుక ఎక్కడ చోటుంటే అక్కడ ఎక్కాము. ఈ స్టేషనులో చాలా సేపు రైలాగుతుంది కనుక వెళ్ళి తీసుకు వస్తాను ఉండండి" ఆమె తన హ్యాండ్ బ్యాగు చేతికి తగిలించుకుని, అరిస్టోక్రాట్ మరొక చేత్తో పట్టుకుని దిగిపోయింది. తలుపు దగ్గిరకు వచ్చిన తరువాత తనకు ఐదు రూపాయల చిల్లర ఇచ్చిన యువకునితో "ఈ నోటు మార్చి మీ డబ్బు మీకు తెచ్చి ఇస్తాను" అంటూ ధిగింది.

ఆమె వెంట టికెట్ కలెక్టరూ దిగాడు.

ఆమె నతడు సమ్మోహనంగా కళ్ళనిండా చూశాడు. ఆమె దిగి వెళ్ళంతుతే ప్రయాణీకులంతా దిగాలు పడ్డట్టూ చూశారు. కంపార్టుమెంటంతా ఒక్కసారి కాంతి విహీనమైనట్టు తోచింది.

కాజీపేట ఒక పెద్ద జంక్షను. ప్రయాణీకులతో–పళ్ళూ, పత్రికలూ– బిస్కెట్లూ సెనగలూ టీ కాఫీ మొదలైన అమ్మకాలతో, కేకలతో కోలాహలంగా ఉంది. చిన్నపిల్లల పరుగులూ, తల్లుల పిలుపులూ ప్రయాణీకుల పరుగులూ ఎప్పుడూ కిట కిట లాడుతూ ఉంటుంది.

టికెట్ కలెక్టరు ఆమెకోసం ఇటూ అటూ కొంత సేపు చూసి తరువాత కంపార్టుమెంట్లలోకి చూస్తున్నాడు. రైలు కదులు తున్నట్టుగా ఒక జర్క్ ఇచ్చింది. కొంత వరకూ చూసి అతడు గుంపులో కలిసిపోయాడు.

ఆమెకు చిల్లర బదులు ఇచ్చిన అతడు కళ్ళన్నీ కంపార్టుమెంటు తలుపుమీదనే ఉంచి, స్నేహితులతో ఆడుతున్నట్టుగానూ, మాట్లాడుతున్నట్టుగాను నటిస్తున్నాడు.

గోలకొండ కదిలింది.

ఆ యువకుడు దిగ్గునలేచి తలుపు కిటికీలో తలపెట్టి, అటూ ఇటూ పరీక్షగా చూశాడు. అతడికి " ఇది " అని చెప్పలేని భారమేదో మనసును దిగాలుపడేటట్టు చేస్తున్నది.

రైలు కాజీపేట దాటింది.

నవ్వులతో చప్పట్లతో కబుర్లతో కాలక్షేపం జరుగుతున్నా ఆ యువకుడికి మాత్రం మనసులో ఏదో వెలితని పిస్తోంది.

రైలు సాగిపోతున్నది. అతడి స్నేహిత బృందం కాఫీ, టీ, బిస్కెట్లు పళ్ళు తెప్పించు కుంటున్నారు. అతడూ వాళ్ళతో చేరాడు. స్నేహితులంతా హైదరాబాదులో చూడబోయే ఉత్సవాలను గురించి వారి వారి అభిప్రాయాలను వెల్లడించుకుని నవ్వుకుంటున్నారు.

సికింద్రాబాదు వచ్చింది. ప్రయాణీకులంతా ఎండా కాలం కావటంచేత బిలబిల్లాడుతూ దిగి ప్లాట్‌ఫారమ్మీద పరుగులు తీస్తున్నట్టుగా టికెట్ కలెక్టరుకు టికెట్లు ఇచ్చి బయట పడుతున్నారు.

స్నేహితబృందం బస్సుకోసం ఒకచోట గుంపుగా చేరారు.

వాళ్ళు సుందరమంచే ఒక టాక్సీ బయలుదేరింది. దానిలో ఆమే మరొక యువకుడూ ఉన్నారు. ఆమె ఎటు వైపు నుంచి వచ్చిందా అని స్నేహిత బృందం ఆశ్చర్య పడుతున్నది.

ఆమె బిల్లు చెల్లించిన యువకుడు గుటకలు మింగుతూ వెర్రిచూపులు చూస్తుంటే ఈ బృందాన్ని కలుకోవటానికి వచ్చిన ఒక స్నేహితుడు " ఆ వెర్రిచూపులు ఏమిటిరా ?" అంటూ వీపు చరిచాడు.

" ఆ మోటు సరసమేమిట్రా ? చిన్నప్పటి అలవాటు ఇంకా పోలేదూ ; " అంటూ వీపు తడుముకున్నాడు.

" ఆ కారులో కూర్చున్నావిడనేనా నీవు దిగాలు పడి చూస్తున్నావు ? " చెవి పట్టుకున్నాడు మెలి పెట్టటానికి.

మొఖమాట పడుతూ " కాదురా ! నీవన్నీ కథలు కల్పిస్తావు ! " అన్నాడా యువకుడు.

" నా కంతా అర్థమయిందిలే. నీ చూపులు ఎప్పుడైతే ఆమె మీద పడ్డాయో అప్పుడే నేను గ్రహించాను. టోపీ పెట్టించుకునే ఉంటావు. చిన్నదా- పెద్దదా ? "

మిగతావాళ్ళు అతడి షివ్రీని గురించి కథలు కథలుగా చెప్పారు.

పగలబడి నవ్వాడు స్నేహితుడు.

" నాయనా ! ఆ నోటు ఈ జన్మలో మారదు. ఎందరో టోపీలు పెట్టించుకున్నారు ఇప్పటికి. "

" నీకూ అనుభవమా ! " భుజమ్మీ చెయ్యేశాడు ఒక మిత్రుడు అతడి ముఖంలోకి చూస్తూ.

" ఎట్లా కాదంటాను ? "

ద్వారకా హోటల్‌కి వెళ్ళే బస్సు వచ్చింది. ముసి ముసి నవ్వులతో అంతా బస్సెక్కారు భుజాలు తడుముకుంటూ.

## అభిప్రాయవేదిక

" శ్రీవాణి " పత్రిక ద్వారా మీరు చేయుచున్న సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన కృషి శ్లాఘనీయము. దిగజారి పోతున్న నేటి వ్యవస్థలో మీ పత్రిక ఎనలేని సేవ చేయుచున్నది.

— ఆర్. మార్కండేయులు, హైదరాబాద్

" శ్రీవాణి " దిన దిన ప్రవర్ధమాన మగుచున్నది. వ్యాపార దృష్టిని మాత్ర మే కలిగిన నేటి పత్రికా ప్రపంచంలో ధార్మిక ప్రవృత్తిని సంతరింపుకొని పాఠక లోకానికి జ్ఞానచింతనను ప్రసాదిస్తోంది. "

— లంకా వెంకటేశ్వర్లు, కలిదిండి

" మీ సంపాదకత్వంలో వెలువడుతున్న ' శ్రీవాణి ' నన్ను విశేషంగా ఉత్తేజితురాల్ని చేసింది. భాషా పరంగా, విషయ పరంగా ఉత్తమ విలువలను ప్రోది చేసుకున్న మీ ' శ్రీవాణి ' ని చదువుతుంటే చాలా తృప్తిగాను, సంతోషంగాను వుంటుంది. "

— టి. వి. వి. యన్. మాణిక్యాంబ, కొత్తగూడెం

" ఉన్నంతలో శ్రీవాణి పత్రిక చక్కగా ఉంది. నిదానంగా మీ మాస పత్రికను వార పత్రికగా మార్చి నడపగలిగితే ఎంతయినా సంతోషిస్తాను. సర్దార్ పటేల్ ముఖ చిత్రం ఎంత బావుందో ఆయనను గురించి వ్రాసిన వ్యాసం అంత బాగున్నది. "

- బి యస్. ఆర్ కృష్ణ, మద్రాసు

" శ్రీ సత్యసాయిబాబాగారి వ్యాసములు అధ్యాత్మిక భావ సౌరభాలతో నిండిన గద్య కుసుమం - భక్తి తత్వ ప్రబోధం, సాహిత్యగోష్ఠి శ్రీవాణి ద్వారా పరిశీలనాత్మక రచనలు అందిస్తున్నందుకు ధన్యవాదములు. "

- పంగనామముల రామమోహనరావు, సికింద్రాబాద్

" ఆకర్షణీయమైన చిత్రములతో, మంచి వ్యాసములు, గీతములతో వివిధ దృక్పథములకు అన్వయింపునట్లు నిర్వహించుచున్న మీ సామర్థ్యము కొనియాడ దగి యున్నది. "

— చేబోలు చిన్మయబ్రహ్మకవి, రాజమండ్రి

**శ్రీవాణి** ద్వితీయ వార్షికోత్సవ మరియు
సంక్రాంతి శుభాకాంక్షలతో

ఫోన్ : 7658





# ది దీనదయాళ్ గణేష
## వీవర్స్ కో-ఆపరేటివ్
## ప్రొడక్షన్ & సేల్ సొసైటీ లిమిటెడ్

No. H. W. 11

**పెడన - 521 366, కృష్ణాజిల్లా**

మావద్ద అధునాతనమైన 100, 80 నెంబర్లలో డార్కు రంగులలో
చేనేత చీరెలు మరియు 60 నెంబరు గడి లుంగీలు, గడి చేతిరుమాళ్ళు
మా ప్రత్యేకత

మా సొసైటీని సందర్శించ ప్రార్థన

చైర్మన్ : మెట్ల కోటవెంకటశివరావు

P. I. C. లు : శ్రీ వార్త కోటమల్లయ్య, శ్రీ బిళ్ళ కోటమల్లయ్య
శ్రీ భట్ట రుద్రవరప్రసాద్, శ్రీ నల్లా కోటవెంకట సుబ్బారావు

అకౌంటెంట్ : శ్రీ వై. కె. సుబ్బారావు

# అభినవపాణిని
# డాక్టర్ సునీతికుమార చటర్జీ

భాషాశాస్త్ర అధ్యయనం ప్రప్రథమంగా భారత, గ్రీస్ దేశాల్లోనే ప్రారంభమైనట్లు చరిత్ర చెబుతున్నది. భారత దేశంలో అతి ప్రాచీనకాలంనుండి భాషాశాస్త్రాధ్యయనం జరుగుతూ వుంది. మనకు అత్యంత పవిత్రమైనవి వేదాలు. కాలక్రమంలో వేదాలను అర్థంచేసుకోవటం జటిలమైంది.

**జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

వేదాలలో ప్రతి శబ్దము విడివిడిగా పేర్కొనబడింది. వీటి అవగాహనకు అక్షర సంయోజనం, స్వరాఘాతం, సమాసాల వివరణం అవసరమైంది. కాబట్టే ధ్వని శాస్త్రానికి ప్రాముఖ్యత ఏర్పడింది. ధ్వనులలో స్వర, వ్యంజనముల వర్గీకరణ జరిగింది. యాస్కుడు శబ్దవ్యుత్పత్తి శాస్త్ర కర్త. పాణిని ఆవిర్భావంతో వ్యాకరణ శాస్త్రం నిర్దుష్ట రూపం సంతరించుకుంది. సంస్కృత భాషను తన అష్టాధ్యాయి సూత్రాలతో నిబంధించాడు పాణిని.

పాణిని ప్రతిభా వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న ఆధునిక భాషా శాస్త్రవేత్త లందరిలో అగ్రగణ్యుడు ఆచార్య సునీతికుమార చటర్జీ.

శ్రీ చటర్జీ 1890 నవంబర్ 26 వ తేదీన కలకత్తా సమీపంలోని శిబ్‌పూర్ గ్రామంలో మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు. తండ్రి హరిదాస చటర్జీ బ్రిటిష్ నౌకా వ్యాపార సంస్థలో ఉద్యోగి.

కలకత్తాలోని ప్రెసిడెన్సీ కాలేజీలో 1911 లో బి. ఏ. ఆనర్స్‌లో ప్రథమశ్రేణిలో ప్రథముడుగా ఆంగ్లభాషా సాహిత్యాలలో కృతార్థుడయ్యాడు. ప్రెసిడెన్సీ కళాశాల లోని ఆచార్యుల అంతేవాసిగ గ్రీక్, ల్యాటిన్ భాషల అధ్యయనం చేశాడు. ప్రాచీన మధ్యయుగ ఆంగ్లభాషా సాహిత్యాలతోపాటు భాషా శాస్త్రములలో దిట్టగా పేరు గాంచాడు. బెంగాలీ భాషా పరిశోధనలలో అప్పటికే ప్రతిష్ఠాత్మకమైన పురస్కారాలందుకున్నాడు.

1917 లో శ్రీ చటర్జీ విశ్వవిద్యాలయ కళాశాలలో ఆంగ్ల అధ్యాపకుడుగ నియమింపబడ్డాడు. 1919 లో భారత ప్రభుత్వ విద్యార్థి వేతనముతో లండన్‌లో సంస్కృతం మరియు యితర అనుబంధ భాషలో అధ్యయనం సాగించాడు.

1922 లో ఇంగ్లండు, ఫ్రాన్స్‌లలో అధ్యయనం ముగించి తిరిగి వచ్చిన చటర్జీ ధ్వని శాస్త్ర ఆచార్యుడుగ కలకత్తా విశ్వవిద్యాలయంలో నియమింపబడ్డాడు. పాళీ, పర్షియన్, ఇస్లామిక్ చరిత్ర-సంస్కృతి, బెంగాలి, హిందీ, ఉర్దూ, సంస్కృత భాషల తులనాత్మక భాషా బోధనలను చేపట్టాడు.

1924 లో చటర్జీ "వంగ భాష పుట్టుక-వికాసం" అన్న బృహద్గ్రంధాన్ని రచించి భాషా విజ్ఞుల ప్రశంస లందుకున్నాడు.

రవీంద్ర కవితోపాటు ఇండోనేషియా తదితర ప్రాచ్య దేశాలలో భారతీయ కళలు, సంస్కృతిని గురించి పెక్కు ప్రసంగాలు చేశాడు.

1938 లో పెక్కు యూరోప్ దేశాలలో పర్యటించి భాషాశాస్త్రం గురించి వుపన్యాసా లిచ్చిన తర్వాత కోపెన్ హేగన్ నగరంలో జరిగిన అంతర్జాతీయ మానవశాస్త్ర మహాసభలో పాల్గొన్నాడు.

1948 లో నాలుగవమారు యూరోప్‌లోని దేశాలలో పర్యటించి జులై నెలలో ప్యారిస్‌లో జరిగిన అంతర్జాతీయ ప్రాచ్య పండిత మహాసభల్లో భారత ప్రభుత్వ ప్రతినిధిగ పాల్గొన్నాడు.

అమెరికాలోని, పెన్‌సిల్‌వేనియా, కొలంబియా, విశ్వవిద్యాలయాల ఆహ్వానంపై విజిటింగ్ ప్రొఫెసర్‌గ పలు విశ్వవిద్యాలయాలలో వుపన్యాసాలిచ్చి యునెస్కో మహాసభలో భారత ప్రతినిధిగా ప్రసంగించాడు.

మిత్రుల, అభిమానుల ఒత్తిడిపై బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ ఎన్నికలలో స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసి విజయం సాధించి 1953 లో కౌన్సిల్ అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాడు. అలహాబాద్‌లో జరిగిన అఖిల భారత ప్రాచ్య విద్యా మహాసభకు అధ్యక్షత వహించాడు. 1954 లో భారత ప్రభుత్వ ప్రతినిధిగ ఆఫ్రికా ఖండమందలి పెక్కు దేశాలలో పర్యటించి, కేంబ్రిడ్జిలో జరిగిన 23 వ ప్రపంచ ప్రాచ్య సభలో పాల్గొన్నాడు. 1956 లో భారతీయ విశ్వవిద్యాలయ ప్రతినిధుల సంఘంలో సభ్యుడుగా చైనాలోని పెక్కు విశ్వవిద్యాలయాల్లో ఇండో-చైనా సంస్కృతిని గురించి వుపన్యసించాడు.

ఇలా ప్రపంచమందలి ప్రముఖ దేశాలన్నిటా పర్యటించి భాషాశాస్త్ర విషయాలనేకాక, భారతీయ కళలు-సంస్కృతిని గురించి ప్రసంగాలు చేశాడు.

1958 లో రష్యా ప్రభుత్వ ఆహ్వానంపై మాస్కో, లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయాలలో వుపన్యాసాలిచ్చి నాల్గవ అంతర్జాతీయ స్లావిష్ట్ మహాసభలో యూరోపియన్ భాషల గురించిన ప్రత్యేక పత్రమును సమర్పించి ప్రశంస లందుకున్నాడు.

భారతీయ సాంస్కృతిక రంగంలో అనధికార రాయబారిగ అవిరళంగా కృషి చేసిన ఆచార్య సునీతికుమార చటర్జీ 1965 లో లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్ష పదవికి స్వచ్ఛందంగా రాజీనామా చేసి, ధ్వని శాస్త్ర పరిశోధనకు భాషాశాస్త్ర వికాసానికి శేష జీవితాన్ని అంకితం చేశాడు.

సత్కారాలు, ఆయన వెంటాడాయి. 1955 లో భారత ప్రభుత్వం 'పద్మభూషణ' బిరుదంతో, 1963 లో

## పండుగ కోసం

సంతోషపు తోటల్లో
సరదాకై పండుగల్ని పండించాడొకప్పుడు మనిషి!
గుండెల్లో కన్నీటిబొట్లు జారని రోజున
దారిద్ర్యం చలిగాలిలా వీచని దినాన
బానిసతనం బ్రతుకుమీద ప్రాకనివేళ
భయాల రాబందులు జనపదాలకు రాని క్షణాన
పండుగల జెండాలెత్తి పాడుకున్నాడు మనిషి.
సూర్యుడ్ని అడుగు ! సుధాకరుడ్ని కనుక్కో
చుక్కల చెక్కిళ్ళపై చిటిక వేసి ప్రశ్నించు
అనాదికాలం గురించి ! ఆదిపర్వాల గురించి !
అంతా కలిసి ఏక కుటుంబంగా
ఏ సంపదల్ని ఏకపంక్తిలో
అనుభవించారో ఆ ప్రకృతినే అడుగు !
ఏ సౌందర్యం, ఏ మాధుర్యం, ఏ తన్మయత్వం
తారతమ్యాల్లేకుండా ఎందుకాస్వాదించారో
ఏ ప్రాచీన శిలా ప్రతిమనైనా ప్రశ్నించు !
అడుగు ! పండుగ కాని రోజు కోసం కాదు
రోజుకొక పండుగ కోసం పాటపడాలి !

- డాక్టర్ మిరియాల రామకృష్ణ

'పద్మ విభూషణ' బిరుదంతో సత్కరించింది. 1965 లో భారత ప్రభుత్వం ఆయనను జాతీయాచార్య పదవి నిచ్చి గౌరవించింది. దేశ, విదేశాల్లోని విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్ పట్టాలతో స్వర్ణ పతకాలతో సత్కరించాయి. 1968 లో కేంద్ర సాహిత్య పరిషత్ ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడిన ఆచార్య చటర్జీ 1969 లో అధ్యక్షుడై జీవితాంతం ఆ పదవిని నిర్వహించి ప్రశంస లందుకున్నాడు.

1974 లో బంగ్లాదేశ్ ప్రభుత్వం ఆయనను బంగారు పతకంతో ఘన సత్కారం చేసింది.

ఆచార్య చటర్జీ, ఇండో-మంగ్లాయిడ్ భాషలకు సంబంధించిన "కిరాట జన-కృతి : ఆఫ్రికనిజం - ద ఆఫ్రికన్ పర్సలిటీ; ఇండియనిజం అండ్ ది ఇండియన్ సింథెసిస్ ; ద్రవిడియన్ ; ది పీపుల్, లాంగ్వేజ్ అండ్ కల్చర్ ఆఫ్ ఒరిస్సా ; రెలిజియస్ అండ్ కల్చరల్ ఇంటెగ్రేషన్ ఆఫ్ ఇండియా ; వరల్డ్ లిటరేచర్ అండ్ టాగూర్ ; ఎ పాలిగ్లాట్ నేషన్ అండ్ ఇట్స్ లింగ్విస్టిక్ ప్రాబ్లమ్స్ విసా-విస నేషనల్ ఇంటెగ్రేషన్" మున్నగు పెక్కు గ్రంథాలను, అనేక విలువైన పరిశోధనాత్మక పత్రాలను వెలువరించాడు.

ప్రపంచ భాషా శాస్త్రవేత్తలందరి మన్నన లందుకున్న చటర్జీ, 1969 లో తన భాషా శాస్త్రాచార్యుడైన ప్రొఫెసర్ డేనియల్ జోన్స్ తర్వాత అంతర్జాతీయ ధ్వని శాస్త్ర సమితి అధ్యక్షుడయ్యాడు.

అనంతమైన అభిరుచులు కలిగిన ఆచార్య చటర్జీ అతి నిరాడంబరంగా వుండేవాడు. సంగీతం లలితకళ లంటే ఆయనకెంతో ప్రేమ. సూఫీతత్వశాస్త్ర పండితుడు. అస్పృశ్యతా నివారణకు కృషిచేస్తూ విధవా వివాహాలను, కులాంతర వివాహాలను జరిపించిన సంస్కర్త.

భారతీయ సాహిత్య కీర్తిని విశ్వవ్యాప్త మొనర్చిన రవీంద్రునివలె, తత్వ శాస్త్ర ప్రశస్తిని అంతర్జాతీయ రంగంలో ప్రవచించి మన్నన లందుకున్న రాధాకృష్ణ పండితునివలె, భాషా, ధ్వనిశాస్త్ర రహస్యాలను ప్రపంచ భాషల స్వరూప స్వభావాలను విశ్వమంతటా చాటి రవీంద్రకవిచే "భాషాచార్య" అని ప్రస్తుతింపబడిన మహా పండితుడు ఆచార్య సునీతికుమార చటర్జీ.

ఇరవైయో శతాబ్దపు భాషా శాస్త్రవేత్తలలో అగ్రగణ్యుడుగా విశ్వవిఖ్యాతుడైన 'అభినవ పాణిని' ఆచార్య చటర్జీ 29-5-1977 న దివంగతుడయ్యాడు.

# రంజనిమాల

సంకలనం
డా॥ వి. ఫణీంద్రుడు

చేప, కద్రువ, గయుడు, దండుడు, దుస్సల, దేవకి, ప్రమీల, లింగము, వాతాపి, కాలకలి, దేవసేన, పతంజలి, జాతహారిణి, జాతవేదుడు, దుస్సేనుడు, పిప్పలాదుడు, హరివాసము, హాలాహలము : ఈ పేర్లు పురాణగాధల నుండి తీయబడినవి : ఈ దిగువ ఆధారములతో పేర్లను గళ్ళలో నింపి రంజనిమాలను పూరించండి.

## ఆధారములు



10

12 13

14

16



**అడ్డము :**

1. పుట్టిన పిల్లలని మార్చి భక్షించిన పిల్లి
5. కృష్ణార్జున యుద్ధానికి కారకుడు
6. "అదిగో అల్లదిగో" అంటారు అన్నమాచార్య
8. కౌరవుల ముద్దుల చెల్లెలు
9. వృక్షములచే పెంచబడిన లోపాముద్ర తనయుడు
12. యుద్ధములో గెలవలేడని, ఆమెని వివాహమాడిన విజయుడు
13. కుమారస్వామితో ఆమె వివాహానికి దేవతలు సేనలు పంపేరుట !
15. కశ్యప ప్రజాపతి భార్యని అలా పిలిచేవారు
16. షట్సంహితలు రచించిన యోగి కుమారుడు

**నిలువు :**

1. అగ్నిని 'మమావహ' అని జపిస్తారు
2. నాగలినే మింగివేసిన విషం
3. అతని అసలి రూపానికి పూజలేదు, ఆ రూపానికి చేస్తారు
4. వసువు కుమారునికి దండవేయుటకు వుండుట ఇష్టం
7. అ "గణపతి భజేహం" లేక 'జీర్ణం' అంటారు
10. ఆ ముద్దుల చెల్లికి సోదరుడు
11. కలికాలంలో విరోచనుని పుత్రుడ మారిపోగలడు
13. అదితి వసుదేవుని భార్యగా జన్మించింది
14. దీనిని మానవులు వధింతురని అద్భుతుడు శపించెను

### డిసెంబరు రంజనిమాల సమాధానాలు

అడ్డం :
1. తవ విరహే వనమాలీ 4. రతిసుఖసారే 8. కేశవ 9. రభసరతి 10. శిశిరత 12. యమునా 14. రజని 15. హరే 16. స్మరతి.

నిలువు :
2. వసతిదిశనశిఖరే 3. మానిని 5. సావిరహే 6. కిసలయ 7. రతి 11. తరళి 13. ముఖర

త్రైవా। ద్వితీయ ర్షికోత్సవ శుభాకాంక్షలతో

# ఎర్ర త్రికోణం

? హరివిల్లు దృష్టి ఎర్ర త్రికోణం మీద పడిందేమిటని ఆశ్చర్య పోతున్నారా ? అంతగా అచ్చెరువందక్కర్లేదు. ఈ విషయాన్ని గురించి కూడా మనం ముచ్చటించుకోవటం చాలా అవసరం.

ఈ నాడు కుటుంబ నియంత్రణ సాధన సూచికయిన ఎర్ర త్రికోణం, అందుకు వుపకరించే సాధనాలు గురించి తెలియనివారు వుండరంటే ఆశ్చర్య పోనక్కర్లేదు. వార్తలకోసం దిన పత్రికలు చూసినా, కథల కోసం వార, మాస పత్రికలు తిరగేసినా, కాలక్షేపం కోసం రేడియో పెట్టినా, కనువిందుకోసం టి. వి చూసినా, సినిమా కెళ్ళినా ఎల్లెడలా ప్రత్యక్షమయ్యేది కుటుంబ నియంత్రణ నినాదాలు, అందుకు వుపకరించే సాధనాలు నలభై సంవత్సరాల స్వాతంత్ర్యంలో ఏమి సాధించారని ఎవరయినా అడిగితే నిరోధ్ ప్రచారంలో బహుశా ప్రపంచంలోని అన్ని దేశాల కన్న మిన్నగా మన దేశం అగ్రస్థానంలో వుందని చెప్పొచ్చు.

హరివిల్లు

ఇటీవల ఒక దిన పత్రికలో ఓ వార్త వెలువడింది. అది చదివిన నాకు చాలా ఆశ్చర్యం, బాధ కల్గాయి. " కన్న బిడ్డల్ని వదిలివేస్తున్న తల్లులు " అదీ ఆ వార్త. ఇటీవల మాసాలలో బందరులో నల్గురు పసికందులు రోడ్ల మీద, అరగుల మీద, రైలు పట్టాల సమీపంలో కనిపించారట. ఎవరో దయాహృదయులు వారిని చూసి, తాము పెంచుకుంటామని తీసుకెళ్ళారట. ఇందుకు కారణం దారిద్ర్యం కావచ్చు, అక్రమ సంబంధాలు కావచ్చు. ఏది ఏమయినా నైతిక విలువలకు పట్టం కట్టవల్సిన సమాజం వాటిని ఎంతగా దిగజార్చిందో ఈ సంఘటనలు స్పష్టంగా చెప్తాయి. బిడ్డలు లేక వ్రతాలు, పూజలు, తీర్థయాత్రలు చేసేవాళ్ళు చేస్తుంటే కన్న బిడ్డల్ని ప్రకృతి బిక్షకు వది లేసి పారిపోయే వాళ్ళను ఏమనాలి ? ఇరు హృదయాల కలయిక మానవ జన్మకు కారణమయితే, ఆ జన్మించిన శిశువులు బజారు పాలు కావటమా ? ఇప్పుడున్న ప్రచార సరళి చాలదన్నట్లు విద్యాలయాల్లో కామ శాస్త్రాన్ని అధ్యయన అంశంగా ప్రవేశపెట్టే ఆలోచనలు పాలకులు చేస్తున్నారట. విద్యార్థులకు నేర్పవల్సిన విషయాలు అనేకం వుండగా యివాళ కామశాస్త్రమే అత్యవసర అంశమా ? ఏ క్లాసులో నయినా దేశభక్తి, క్రమశిక్షణ నైతిక విలువల అంశాలను బోధనకు ఎన్నుకుంటున్నారా? పూర్వం నీతి కథలు చెప్పేందుకు ఒక కాలాంశము వుండేది. ఇప్పుడు అది ఎత్తివేశారట. ఇక భావి పౌరులు కావల్సిన బాలబాలికలకు కాని యువతీ యువకులకు కాని నైతిక విలువల గురించి తెలిపే దెప్పుడు ? ఇప్పుడు విడుదలయ్యే అనేక చిత్రాలు అసభ్య, అశ్లీల పదాలతో, పాటలతో, దృశ్యాలతో నిండి యువతనేమిటి వృద్ధులనే పెడ ద్రోవ పట్టేటట్లు చేస్తున్నాయి. కథలు, నవలలు పేరిట పచ్చి శృంగారాన్ని స్వేచ్ఛగా అందిస్తున్నారు. మరి జాతిని సన్మార్గంలో నడిపే ప్రయత్నం ఎక్కడ జరుగుతున్నది ?

ఇది చాలదన్నట్లు పుట్టబోయే బిడ్డ ఆడో, మగో తేల్చి చెప్పే క్లినిక్‌లు మహారాష్ట్రలో అనేకం వున్నాయిట. పిండం పరిస్థితిని తెలుసుకునేందుకు అమ్నియోసెంటసిస్ అనే ప్రకియను వినియోగిస్తుంటారట. మహారాష్ట్ర పశ్చిమ ప్రాంతంలో వెనుకబడిన చిన్న పట్టణమయిన ధులే అనేచోట ఈ లింగ భేదాన్ని కనుక్కునే క్లినిక్‌లు

ఏడు ఉన్నాయిట. ఈ పరీక్షలను నిషేధించమని అక్కడి శాసన సభ్యులు కొందరు అనధికార బిల్లును శాసన సభలో ప్రవేశ పెట్టారట, పరీక్షలో ఆడశిశువు అని తెలితే గర్భస్రావం చేయించుకుంటున్నారట. బొంబాయి, నాగపూర్, ధులే, జాల్గాన్, అమరావతి వంటి చోట్ల ఈ క్లినిక్‌లు అధిక మొత్తంలో డబ్బులు వసూలు చేస్తున్నాయట.

దేశ జనాభా తగ్గించాలనే ఆశయంతో కుటుంబ నియంత్రణ పద్ధతుల్ని భారీగా ప్రభుత్వాలు ప్రచారం చేస్తుంటే ఆ ప్రచార ఫలితాలు ఏ దిశగా సమాజాన్ని తీసుకువెళ్తున్నాయో మనం చూస్తున్నాం, వింటున్నాం. అయితే ఎవరికీ ఈ ఫలితాల సరళి పట్ల బాధ కలగటం లేదు. పోనీ జనాభాను ఏమయినా క్రమబద్ధం చేయగలిగారా అంటే కొన్ని మతాలవారు కుటుంబ నియంత్రణను వ్యతిరేకిస్తున్నారు. వారిని ప్రశ్నించే హక్కుగాని, ధైర్యంగాని ఎవరికీ లేవు. దేశంలోని కొన్ని ప్రాంతాలు అల్ప సంఖ్యాక వర్గాలవారి మెజారిటీ ప్రాంతాలుగా ధృవీకరింపబడి దేశ వ్యతిరేక కార్యకలాపాలకు నిలయాలవుతున్నాయి. విదేశీ శక్తులు తమ శాయశక్తులా ఈ కార్యకలాపాలకు తమ సహాయ సహకారాలను అందజేస్తున్నాయి కూడా. మరి ఎవరి జనాభా తగ్గుతున్నది? ఆచార్య పీఠాలు ఈ విషయాన్ని గురించి ఏనాడో హెచ్చరించాయి. ఒకవేళ ఈ దేశంలోని మెజారిటీ ప్రజలు మైనారిటీ స్థితికి దిగజారితే ఈ దేశ అస్తిత్వం కాపాడబడుతుందా అనేది సమస్య? కేరళలోని పేరు మారిన ప్రాంతాలు, తమిళనాడులో పేరు మార్చ వలసిందని జరుగుతున్న ఉద్యమాలు, దేశ ఈశాన్య ప్రాంతంలోని విదేశీ మిషనరీల కార్యకలాపాలు బహుశా విజ్ఞులకందరికీ తెలిసే వుండచ్చు.

మరి ఎర్ర త్రికోణం గురించి మనం మాట్లాడు కోవాలో వద్దో సహృదయులైన పాఠకులే గమనించాలి.

***

# విచిత్ర మిత్రుడు

నా బాల్య మిత్రుడు సర్వాంతర్యామి సార్థక నామధేయుడు. ఏకగ్రామ వాసులం. ప్రాథమిక చదువులో నాకు స్కూలుమేటు, క్లాసుమేటు, బెంచిమేటు. వాళ్ళ తండ్రి లోకయ్య సకుటుంబంగా మా గ్రామం వదిలి వెళ్ళారు. ఓ పుష్కరం గడిచాక మేమూ బస్తీ చేరాము. బి. ఏలో తిరిగి సర్వాంతర్యామి నాకు రూమ్ మేటుగా తయారయ్యాడు. ఆ తర్వాత పదిహేనేళ్ళ వరకూ వాడి జాడా తెలియదు.

## పుచ్చా పూర్ణానందం

ఓ రోజు ఉదయం పిల్లలు పెన్ను పారేసుకు వచ్చినందుకు కస్సుబుస్సు లాడుతున్నా. నా సహధర్మచారిణి కూడా నాకు వంత పాడుతూ సహకరించింది. అట్టి సమయంలో సర్వాంతర్యామి ఊడిపడ్డాడు. పిల్లలపాలిట ఆర్తత్రాణ పరాయణుడుగా ఆదుకున్నాడు. "డోన్ట్‌వర్రీ, నేను వచ్చే నెలలో అరడజను పార్కర్ పెన్స్, ఆరు షీఫర్స్ కలాలు తెచ్చి పడేస్తాను. పిల్లలు భగవత్ స్వరూపులు. వాళ్ళ చిన్నారి మనస్సుకు నొప్పి కలిగిస్తే ఏలా" అని మా దంపతులకు హితోపదేశం చేశాడు. వేడి ఇడ్లీ, కాఫీ ఆరగించి, "నో టైం, నో టైం వస్తారా, వచ్చే నెలలో అన్ని వివరాలూ" అంటూ డైలాగ్‌లో చివరి మాట వీధి గుమ్మంలో వదిలి నిష్క్రమించాడు.

ఆ తరువాత రెండు ఏళ్ళకు సుప్రభాత వేళ సర్వాంతర్యామి ప్రత్యక్షమయ్యాడు. "ఉత్తమం ఉత్తరేణి" అనే సూత్రం నూతనంగా పాటిస్తూ నేను దంతధావనానికి ఉత్తరేణి వాడ్తున్నా. మాటల సందర్భంలో బస్తీలో ఉత్తరేణి వేళ్ళు దొరకటం లేదని నేను ఇబ్బంది వెలిబుచ్చగానే, తనకో ఫారెస్టు ఆఫీసరు క్లోజు ఫ్రెండ్ వున్నాడని, వారం రోజుల్లో ఒక లారీ ఉత్తరేణి వేళ్ళు తాజావి వచ్చి పడ్తాయని నన్ను అదరకొట్టి సింగిల్ కాఫీ మాత్రం పుచ్చుకుని, అర్జెంటు పని వుందని చెబ్తూ బయలుదేరాడు. "మోపెడు చాల్లేరా" అని నేను అంటుంటే వినిపించుకోకుండా, "నీ మొహంలే, నీకెప్పుడూ మొహమాటమే, లారీడు తప్పదు" అంటూ పరుగులాంటి నడక లంకించుకున్నాడు.

మూడేళ్ళు గడిచాక ఓ ఆదివారం పదింటికి దిగాడు. భోంచేస్తున్నాం. ఆ సమయంలో నా స్వీట్ హార్ట్, అర్ధాంగి పిల్ల పెళ్ళి విషయంలో సంబంధం వెతక్కుండా, బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తున్నానని నా కాండక్టు విమర్శకు పూనుకుంది. వెన్వెంటనే సర్వాంతర్యామి మా ఆవిడ ఛార్జి షీట్‌కు మద్దతు తెలిపి, తన చేతిలో మూడు స్టేట్ బ్యాంకువి, నాల్గు పోస్టు గ్రాడ్యుయేటువి, రెండు అమెరికావి సంబంధాలు ఉన్నవని, పక్షం లోపల వాళ్ళందర్నీ చూపులకు తెస్తానని వాళ్ళెవరూ తన మాటకు ఎదురు చెప్పలేరని, మనకు నచ్చిన వరుడ్ని మనం సెలక్టు చేసికోవచ్చని చెప్పి, భోజనానంతరం తాంబూలం సేవించి వెళ్ళిపోయాడు.

ఆరేళ్ళు గడిచాయి. నేను హైదరాబాద్ పోతున్నా. నేనున్న పెట్టెలోకి ఖమ్మంలో ఎక్కాడు. మాటల ప్రస్తావనలో మా పెద్దమ్మాయికి కొడుకూ, కూతురు కలిగారని, నేను తాతయ్య నయ్యానని గర్వంగా చెప్పాను. తనకు హైదరాబాద్‌లో మూడు ఫ్లాట్లు వున్నాయని, ఢిల్లీలో రెండు తీసుకోబోతున్నానని చెప్పి, నేనింతవరకూ స్వగృహం యేర్పాటు చేసికోనందుకు చీవాట్లు పెట్టి, నాకు మూడు నెలల్లో ఒక ఫ్లాటు తీసుకుంటానని, డబ్బుదో సమస్య కాదని, తను సింగపూర్ వెళ్ళినప్పుడు నాకో

కెమేరా, పాకెట్ టి. వి. తప్పక తెస్తానని, తన క్లోజ్ ఫ్రెండ్ ఫారెస్టు ఆఫీసరుతో చెప్పి తాజా పులిగోళ్ళు ఈలోగా బంగారు గొల్సులు అన్నీ సమకూర్చుకుని అనతి కాలంలో తన స్వహస్తాలతో నా మనుమడికి, మనుమరాలికి బహూకరిస్తానని బుంగ పోతగా వాగ్దానాలు కుమ్మరించి ఖాజీపేటలో దిగాడు. "అన్నిటికీ నవ్వుతావు, నీకు సీరియస్‌నెస్ తెలియదురా" అని చురక వేశాడుపోతూ.

అప్పటికీ ఇప్పటికీ వత్తా లేదు మా సర్వాంతర్యామి. ఆయుర్భాగ్యం ఉంటే ఎప్పుడో కలుస్తాము. ఈమాటు ఏమి తెస్తాడో, యేమి ఇస్తాడో !!







# స్వీకారం

"మహిళాగ్ని సమరం" వెల : రు. 10-00
రచన : గంధే జగన్‌మోహన్
ప్రతులకు : కృష్ణా పబ్లికేషన్స్
H. No. 3-16, కురుబవీధి
ధర్మవరం - 515 671

" సాగర సందేశం " ( కవితా సంపుటి )
వెల : రు. 4-00
రచన వేదాటి రఘుపతి
ప్రతులకు శ్రీ వేదాటి రఘుపతి, లెక్చరర్
వెంకటేశ్వర డిగ్రీ కళాశాల
సూర్యాపేట, నల్లగొండ-జిల్లా

రేపటి వేకువకోసం " వెల : రు. 8-00
రచన : కృష్ణస్వామి
ప్రతులకు : శ్రీమతి యం. కృష్ణకుమారి
C/o. హరిహరస్వామి ఇల్లు
కాలేజిరోడ్, అమలాపురం

దేవీ ప్రార్థనలు " వెల : రు. 3-00

" లలితాస్తోత్రమంజరి " వెల : అమూల్యం
అనువాదకుడు : పురాణపండ రాధాకృష్ణమూర్తి
ప్రతులకు : పురాణపండ రాధాకృష్ణమూర్తి
జయశ్రీ టాకీస్ రోడ్, రాజమండ్రి-4

" చందనము " వెల రు. 5-00
రచన : బొడ్డు బాపిరాజు
ప్రతులకు : బొడ్డు బాపిరాజు
శిల్క్ క్లాత్ షాపు
మెయిన్‌రోడ్, ఏలూరు.

శ్రీ మహాభారత వైజ్ఞానిక సమీక్ష "
వెల : రు. 30-00
రచన : శ్రీమత్తిరుమల వెంకట శ్రీనివాసాచార్యులు
ప్రతులకు : శ్రీ యస్. టి. వి. రాజగోపాలాచార్యులు
27-17-45 శ్రీనివాస భారతి
భీమవరం-534 20?-ప. గో. జిల్లా

" నాలోని నాదాలు " వెల : రు. 6-00
రచన : చిల్లర భవానీదేవి
ప్రతులకు : యస్. 1 బి-218
సచివాలయ నగర్, వనస్థలిపురం
హైదరాబాద్-500 661

" శ్రీమద్రామాయణము " —సమాలోచనము
వెల : అమూల్యం
ప్రచురః తెల్లాకుల జాలయ్య, పోలిశెట్టి
సోమసుందరం కళాశాల,
గుంటూరు. ★

# జ్ఞానోదయం (మినీకథ)

— వజ్రాయుధ

లలిత, శంకర్ పిల్లలతో రెండవ సినిమా చూసి వచ్చారు.

సినిమాలో నృత్యాలు, సంభాషణలు, కథ, చిత్రీకరణ వగైరాల గురించి చర్చించుకొంటూ పడుకోడానికి సన్నాహాలు చేసుకుంటున్నారు.

సినిమా చూడకుండానే సగంలోనే నిద్రించిన పాపను పడుకోబెట్టి బాబుతో కబుర్లాడుతున్నాడు శంకర్.

"క్రొత్తనటి రమ చాలా సెక్సీగా ఉంది కదండీ" చురుగ్గా చూస్తూ అంది లలిత.

"అవును. నీలాగే" అన్నాడు శంకర్.

"అబ్బ పోనిచ్చారుగాదు మీ పాడు బుద్ధి." అంది సాగదీస్తూ.

బయట గదిలో ఖంగుఖంగున దగ్గుతూ శంకర్ తల్లి గొణుక్కుంటోంది. అర్ధరాత్రి రెండుగంటలైనా పడుకోకుండా యింకా యీ సినిమా కబుర్లేమిటి ? వీళ్ళకివే కూడూ, గుడ్డా, వారం తిరగనీయరు. సినిమా మారనీయరు కదా !

బాబు కూడా నిద్రలోకి జారుకోడంతో శంకర్ లలితలు కూడా కన్ను మలిపారు.

తెల్లవారు ఝామునే లేచి శంకర్ తల్లి పాచిపని చేసి నీళ్ళు పెట్టి కాఫీ కాచిన తరువాత సుమారు 8 గంటల ప్రాంతంలో లలితా శంకర్ నిద్ర లేచారు. ఆఫీసు పది గంటలకయినా ఆ వారంలో ఇన్‌స్పెక్షనుండడంతో శంకర్ గబగబా స్నానాదులు ముగించి వేగంగా సిద్ధపడుతున్నాడు. లలిత వంటగదిలో ఏదో పని చేస్తోంది. శంకర్ తల్లి పూజగదిలో స్తోత్రాలు చదువుకుంటోంది.

బావిలో రాయి పడ్డట్లుగా అందరి పనులకు భంగం కలిగించేంతగా ఉమ పెద్ద కేకలు పెడుతోంది. కంగారుగా లలితాశంకర్‌లు ముందు గదిలోకి పరుగెత్తారు.

చూడరాని .... చూడలేని .... ఊహించని ఆ జుగుప్సాకరమైన దృశ్యానికి ఐసులా గడ్డకట్టుకు పోయాడు శంకర్.

"కిషన్, ఛండాలుడా" అని పెద్దగా అరుస్తూ నాలుగేళ్ళ ఉమ మీదపడి ముద్దు పెట్టుకోబోతూ రక్కుతున్న బాబును ఇవతలకి లాగి కసిగా చెంపలు పగుల కొట్టోంది లలిత.

వెయ్యి టన్నుల బరువు మీద పడబోతే కలిగే స్తబ్ధత సంభ్రమాశ్చర్యాలనుండి తేరుకున్నను శంకర్ లలిత కడ్డుపడి బాబును లాగేసి ఉమను లోపలికి తీసుకువెళ్ళి గ్లూకోజు నీళ్ళ పట్టించి శరీరాన్ని నిమురుతూ పరిచర్యలు చేయిస్తున్నాడు.

ఇంకో క్షణమాగితే నా బిడ్డ ఏమయిపోయేదో అని శంకర్ తల్లి లబోదిబో మంటోంది.

పది పదిహేను నిమిషాల తరువాత కాస్త ప్రశాంతత ఏర్పడింది.

"తెలిసీ తెలియని లేత మనసు, వయసు లలితా, బాబుది. రాత్రి సినిమాలో చూసిందే చేశాడు వాడు. ఫైట్స్, రేపుసీనులూ ఉన్న ప్రతి అడ్డమైన సినిమాకు వాళ్లను తీసుకువెళ్ళిన దాని దుష్ఫలితం ఇది. మనం పద్ధతులు మార్చుకొని ఏవో కొన్ని మంచి సినిమాలకు పరిమితం కాకపోతే పసి జీవితాలు ఇంకా కాలుష్యమయమవుతాయి లలితా !"

జ్ఞాననేత్రం తెరిచిన వాడిలా గొణిగాడు శంకర్. ★

సంక్రాంతి శుభాకాంక్షలతో

# శ్రీ సదాశివలింగేశ్వర చేనేత పారిశ్రామికుల సహకార ఉత్పత్తి మరియు విక్రయ సంఘం లిమిటెడ్, నెం. H. W. 17

బ్రహ్మపురం, పెడన, కృష్ణాజిల్లా

మావద్ద అధునాతనమైన 100, 80 నెంబర్లలో డార్కు రంగులలో చేనేత చీరెలు, 60 నెంబరు చెక్కు లుంగీలు, సాదా లుంగీలు, టి. డి. లుంగీలు, పంచెలకు మా ప్రత్యేకత. మా సంఘమును సందర్శించ ప్రార్థన.

బులుసర రాజేశ్వరరావు, ఛైర్మన్

పి. ఐ. సి. లు : సర్వశ్రీ బూసం కోటయ్య, బళ్ళ రాజేశ్వరరావు, యర్ర ఈశ్వరరావు, బుద్దె నాగేశ్వరరావు.

'శ్రీవాణి' ద్వితీయ వార్షికోత్సవ శుభాకాంక్షలతో

# శ్రీ చౌడేశ్వరి చేనేత సహకార ఉత్పత్తి విక్రయ సంఘం లిమిటెడ్,

నెం. H. W. 1, మల్లవోలు, బందరు తాలూకా, కృష్ణాజిల్లా

స్థాపితం–1973 మెంబర్ల సంఖ్య–143 మెంబర్ల షేరు ధనం రూ. 1,76,000/-

సాలుసరి ఉత్పత్తి రూ. 15,50,000/-

మా సంఘములో 100s, 80s, 60s, నెంబర్లలో నూతన డిజైనులలో పక్కా రంగులలో సరసమైన ధరలకు చీరెలు లభించును.

మేనేజరు : బూసం సుబ్బారాయుడు ఛైర్మన్ : పిచ్చుక నాగేశ్వరరావు

పర్సన్స్ యిన్‌చార్జి : పేరక నాగేశ్వరరావు, మేకా జగన్‌మోహనరావు, పిచ్చుక పూర్ణచంద్రరావు, బూసం కోటగంగాధరరావు

## స్నేహం చిరామం

# అల్పమని అలుసు చేయకు

రణ రంగమున కేగేటి ఓ రాజు
రథము లాగేటి గుఱ్ఱము నాడా మేకు
దారిలోన జారిపోవ కాంచియు
చిన్న మేకు పోవ చింత యేలయని
ఉన్నవానితో కదలిపోయె కదనానికి !
మేకు లేని నాడ మెల్లగా జారిపోయె
నాడ పోవ గుఱ్ఱము నడక మాని నేలకూలె.
హయము తోడ రౌతు అవని చేరెను.
రౌతు లేని రథము రాళ్ళ పాలాయెను.
రథము లేని రాజు రణమందు ఓడెను.
రణమందు యోడిన రాజ్యమే పోయె.
ఓడిన రాజుకు మరణమే శరణమాయె.
చిన్న మేకుయని చిన్ని చూపు చూడ
యెన్ని చీకు చింతలుతెచ్చెనో చూడు !
చిన్నవని, చిట్టివని చిన్నగా చూడ బోకు
అల్పమని, స్వల్పమని అలుసు చేయ బోకు.
చిన్నవానిలోన చిన్నెలుండు, వన్నెలుండు
అల్పులందు కూడ అధికశక్తి దాగి యుండు
పనికిరాని పైసలని పారవేయబోకు,
పైసలన్ని కూడ బెట్టి పదిలమైన మేడ కట్టు.

~~~~~~

# గాంధీ తాత !

– రవుల ఆంజనేయశర్మ

గాంధీతాత పుట్టాడు
కన్నుల పండువు జేశాడు !
భారత ప్రజలకు స్వాతంత్ర్యమ్మును
ప్రసాదించి తరియించేడు !

జానిసత్యమును బాపాడు
'స్వారాజ్య' మ్మును తెచ్చాడు !
సౌభాగ్యమ్మును ఇచ్చాడు
శాంతిమార్గమును చూపాడు !

హిందూ, ముస్లిం భేదము లేదని
హితోపదేశము చేశాడు !
ఐకమత్యముతో అందరు కలిసి
సుఖముగ ఉండాలన్నాడు !

పూజ్య బాపూజీ అడుగు జాడలో
భారతీయులూ నడిచారు !
స్వారాజ్యమును కాపాడుకొని
చక్కగ ముందుకు సాగారు !

బాపూజీ జన్మించిన రోజు
పర్వదినముగా వెలిసింది !
బాపూజీ సద్బోధన బాలల
భావికి పునాది వేసింది !
~~~~~~

# దేవుడు ఉన్నాడు

శ్లో॥ త ద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః॥
గీత- అ. 4 శ్లో. 31.

అని చెప్పిన గీతావాక్యము ననుసరించి ప్రశ్నలు వేయుట, జవాబులు చెప్పుట, చెప్పించుట అన్న పద్ధతి ఉత్తమమైనది. అప్పుడు సర్వసందేహములు నివృత్తి కాగలవు.


శ్రీ త్రివిక్రమ రామానందభారతీస్వామి
రాఢం పీఠాధిపతి


అయినను అడిగితిరి గనుక వ్రాయుచున్నాను "దేవుడు ఉన్నాడు" అని నిర్ధారణ చేయుటకు నాస్తికులు చెప్పుచున్న "దేవుడు లేడు" అన్న వాక్యమే ప్రమాణము.

దేవుడు లే నే లే ని పక్షములో "దేవుడు లేడు" అని ఎట్లా చెప్పగలుగు తున్నాడు ? ఈ ప్రశ్న అడుగవలెను.

తెలియనటువంటి, లేనేలేనటువంటి వస్తువునుగూర్చి చెప్పుటకుగాని, తెలుసుకొనుటకుగాని వీలగునా ? వీలు కాదని స్పష్టముగా చెప్పవలసినదే.

లేనిదానినిగూర్చి చెప్పుచున్నానని చెప్పుట, లేక ఉపన్యసించుట ప్రారంభించి ఏదో "అది ఉన్నది", లేక "చెప్పబడినది" లేక "తెలియబడినది" కాగలదు కదా ?

అనగా ఉన్నదానిని గురించి మొండిగా, విమర్శజ్ఞాన శూన్యముగా "లేదు" అని చెప్పుటయే లేక చెప్పుటకే తప్ప ఉన్నది - లేనిది ఎట్లు కాగలదు ? లేనిది ఉన్నది ఎట్లు అవగలదు ?

ఒక చిన్న (గమ్మత్తు. నవ్వువచ్చే) ఉదాహరణ తీసుకు విచారణ చేసిన బహు సులభముగ తెలియగలదు.

ఒకరు తన స్నేహితునకు చాలా ముఖ్యమైన ఒక ఉత్తరమును వ్రాసినారని అనుకొనుడు.

వ్రాసిన వారికి జవాబు త్వరగా కావలసిన అవసరము కలదు. కనుక ఉత్తరమంతయు వ్రాసి, చివరకు "యీ ఉత్తరము అందని పక్షములో తిరుగు టపాలో యీ ఉత్తరము అందలేదని ఉత్తరము ద్వారా (Clear గ) తెలియపర్చ వలసినదిగా మరీ మరీ కోరుచున్నాను" అని వ్రాసినారని అనుకోండి. ఇక విచారణ.

ఉత్తరము అందని పక్షములో ఉత్తరము అందలేదని తిరుగు టపాలో ఎట్లా జవాబుగా ఉత్తరము వ్రాయుట తటస్థించును ? వ్రాసినవారికి బుద్ధి (మెదడు) ఉన్నట్లా లేనట్లా ?

ఒకవేళ ఉత్తరము అందుకొని, చదువుకొని తిరుగు టపాలో "మీరు కోరిన ప్రకారము మీరు వ్రాసిన ఉత్తరము అందలేదని వ్రాయుచున్నాను" అని వ్రాసినచో అందిన ఉత్తరమును అందలేదని వ్రాయుట తప్ప మరేమున్నది ? ఉత్తరము అందకపోతే అందలేదని వ్రాయుట ఎంత absurd గ వుండునో, కుదరదో, అట్లాగే దేవుడు లేకపోతే లేడని చెప్పటము కూడా అంత absurd గా వుండును, కుదరదు.

ఎవరైనను అందరికి తెలియచెప్పవలయునని ఉన్న దానిని గురించి ప్రచారము చేయవలయునుగాని అసలే లేనిదానిని గురించి ప్రచారము ఎందుకు ? ఎట్లా చేయటము ? వీలగునా ?

కనుక ఏదైన ఒక వస్తువు "ఉన్నది" అని గాని, "లేదు" అనిగాని తెలియచెప్పుటకు మొదట ఆ వస్తువు ఏదో తెలిసినగాని తెలియచెప్పుటకు వీలుకాదు. ఇది సిద్ధాంతము. తిరుగు లేదు.

ఏదైన ఒక వస్తువు " ఉన్నది " అని గాని " లేదు " అని గాని చెప్పినచో ఆ వస్తువు ఏదో, ఎట్టిదో తెలియును గనుకనే చెప్పగలుగుచున్నాడు.

ఆ వస్తువు ఏదో తెలియని పక్షములో " ఆ వస్తువు ఏదో ఫలానా అని నాకు తెలియదు. కనుక ఆ వస్తువు ఉన్నదని కాని, లేదనికాని, నేను చెప్పజాలను, చెప్పుటకు వీలుకాదు " అని చెప్పవలసి యుండును.

" దేవుడు లేడు " అని చెప్పినపుడు, దేవుడు అంటే ఎవరో, ఏమిటో బాగా తెలుసును గనుకనే " దేవుడు లేడు " అని చెప్పగలుగుచున్నాడు.

ఒకప్పుడు జీలకర్ర అయిపోయి లేనిపక్షములో తిరిగి వచ్చి " లేదండీ " అని జవాబు చెప్పును.

ఆ అమ్మాయినే మరి ఒకరు వచ్చి " Potassium-Synade ను కొంచెము తెచ్చిపెట్టు అని అడిగినారని" అనుకోండి.

అప్పుడు ఆ పిల్ల వెంటనే " Potassium Synade అనగా ఏమిటండీ ? నాకు తెలియదు. ఇంగువా, మెంతులా, ఆవాలా, బెల్లమా ? " అని అడుగుతుంది. అది ఏదో తెలియని సందర్భములో అన్ని ప్రశ్నలు వేయక తప్పదు.

అది ఏదో చెప్పక తిరిగి, తిరిగి " Potassium Synade తెచ్చిపెట్టు " అని అడిగితే ఆ పిల్ల ఏమి చేయును ?

ఆ చిన్నపిల్ల కోపముతో " అదేమిటండీ ? అది ఏమిటో నాకు తెలియదని చెప్పుతుంటే తీసుకురా, తీసుకురా అని అదే పనిగా అడుగుతారు ? ఆ వస్తువు ఏదో నాకు తెలిసిన గదా వెతికి చూచి, వున్నచో తీసుకు వచ్చి యివ్వటము, లేనిచో లేదని చెప్పుటకు వీలు అయేది " అని సమాధానము చెప్పును.

ఒక వేళ ఆ పిల్లకు Potassium Synade అనగా ఏమిటో తెలిసిన పక్షములో " అదేమిటండీ, అట్లా అడిగి తీసుకురమ్మంటారు ? ఆ వస్తువు నాలిక మీద తాకించ

గానే, చచ్చిపోయే విషపదార్థము కదా ! దానిని ఎవరైనా అందరికి అందేటట్లుగా వుంచుతారా ! " అని జవాబు చెప్పి, మందలించును కూడా.

కనుక, పైన నిర్ధారణ చేసినట్లుగా ఒక వస్తువు ఉన్నదని గాని, లేదనిగాని చెప్పుటకు ఆ వస్తువు ఏదో ఫలానా అని తెలిసిన గాని చెప్పుటకు వీలుకాదన్న అంశమునకు జీలకర్ర ఉదాహరణ చక్కగా సరిపోవును.

అనగా దేవుడు ఎవరో, ఏమిటో తెలిసును గనుకనే, " దేవుడు లేడు " అని ధైర్యముగా చెప్పగలుగుతున్నాడు

ఇక " లేడు " అన్నదానికి మరియొక చిన్న ఉదాహరణ చెప్పుదును.

బాగా ధనవంతులు, పెద్ద పెద్ద అధికారులు- వారలు కాపురము చేయుచున్న బంగళాల సింహద్వారముల ప్రక్కను బాగా పాలిష్ ( మెరుగు ) చేయబడిన ఇత్తడి బిళ్ళలను లేక రేకులను ( Signboards ) అమర్చి వుంచుతారు. ఆ బిళ్ళపైన సగమున " In ( లోపల ) " అని, మిగతా సగమున " Out ( బయట ) " అని అక్షరములను చెక్కించుదురు. దీని అర్థము ఏమనగా " In ( లోపల ) " అని వ్రాసిన దానికి ఆ యజమాని బంగాళాలో వున్నట్లుగా అది చూచి చదువుకున్నవారు గ్రహించవలసి యుండును.

" Out ( బయట ") అని వున్న అక్షరములు చూచి ఆ యజమాని బయటకు వెళ్ళినట్లు, ఇంటిలో లేనట్లు తెలిసికొనవలసి యుండును.

ఆ అక్షరములు ఉన్న " In " పైన, " Out " పైన ఇటు అటు కదలునట్లుగా చిన్న ఇత్తడి బిళ్ళలు (మూతలు) అమర్చి పెట్టుదురు. సింహద్వారము దగ్గర ఎప్పుడూ కాపలాకాయుచుండే బంట్రోతో, మరొకరో యజమాని ఇంట్లోకి రాగానే " Out " అన్న అక్షరములు మూసివేయుదురు. బయటకు వెళ్ళగానే " In " అన్న అక్షరములను మూసివేసి " Out " అన్నవి వుంచుదురు.

అప్పుడు దీని అర్థము ఆ యజమాని ఇంట్లో లేడని, బయటకు వెళ్ళినాడని తెలుసుకొనవలసి యుండును.

ఆ యజమాని ఒకేసారి యింటిలోను, బయటను ఉండగలిగివున్న పక్షములో యీ " In " అని " Out " అని వుంచిన సైన్ బోర్డు అక్కడ అమర్చనే అక్కరలేదుగదా! అనగా ఆ యజమాని ఉంటే ఇంటిలో వుండాలి. ఇంటిలో లేకపోతే బయటకు వెళ్ళి వుండాలి.

సర్వత్ర, సర్వదా, సర్వవ్యాప్తిగా ఆ యజమాని వుండడు కదా ! ఉండలేడు కదా !

కనుక " దేవుడు లేడు " అని నాస్తికుడు ఘంటాపథంగా బాహాటముగా చెప్పినప్పుడు, ఆ బంగళా యజమాని తీరుగా ఆ దేవుడు తన వద్ద లేడనియే అర్థము. అంతే. అసలు దేవుడే లేడని అర్థము కానేకాదు, కానేరదు.

ఎవడైనను తప్పిపోయి, కనపడకపోతే అతను ఎక్కడ వుంటే అక్కడ వెతికితే అక్కడ కనబడును. లేనిచోట వెతికితే కనపడడు.

దేవుని విషయము వేరు. దేవుడు ఎక్కడెక్కడ వెతికితే అక్కడక్కడల్లా కనపడును. ఎట్లా కావాలి అంటే అట్లా కనపడును. దేవుడు తాను ఎట్లుగా సంకల్పించిన ఆ ఆకారము కనపడును. ఒకప్పుడు ఉండి కూడా కనబడడు.

దేవుడు సర్వవ్యాపి గనుక " ఎక్కడ వున్నాడు ? ఉన్నాడా " అని అడిగితే తప్పు. Evidence Act ప్రకారము ప్రశ్న అడుగనే కూడదు. " రాజుగారి పెద్ద భార్య మహాపతివ్రత " అని చెప్పినచో రెండవ భార్య పతివ్రత కాదనే సూచించును. దేవుడు ఒకచోట వుండి, మరొకచోట లేనప్పుడు దేవుడు ఎక్కడ ఉన్నాడు అని ప్రశ్న వేయవచ్చును. కనుక ప్రశ్నయే సరికాదు.

ఆస్తిక్యబుద్ధి, అనగా వేదప్రమాణబుద్ధి, గలవారలకు దేవునియొక్క ఉనికిని గూర్చి చెప్పనవసరము లేదు.

పరమభక్తుడైన ప్రహ్లాద చరిత్ర, శ్రీ నృసింహావతారము యొక్క అవతరణ గూర్చి తెలిసికొన్నవారికి వేరే, ఏదో నమ్మకము కలుగునట్లు, దేవునిగూర్చి చెప్పవలయునా ! " దేవుడు ఉన్నాడు " అంతే ! ★

# స్త్రీని గౌరవించని కవి

– జొన్నలగడ్డ లలితాదేవి

"పాల సాగరమున బవ్వళించినవాడు
గొల్లయిండ్ల పాలు కోరనేల ?
ఎదుటివారి సొమ్ము లెల్లవారకు తీపి"

అంటూ తన సునిశిత హాస్యంతో అశేషాంధ్రుల్ని అలరించినవాడు వేమన అసలు వేమన పద్యాలు రానివారంటూ ఎవరూ ఉండరు. అలాగే ఆయన పద్యాలు సామెతలుగా చెప్పుకోవడం కూడా మనకి తెలిసిందే. తన భావాన్ని చిన్న చిన్న మాటలతో స్పష్టంగా – సూటిగా – అందంగా చెప్పడం ఆయనలో వున్న ప్రత్యేకత.

ఎంతో ప్రజాదరణ పొందిన పద్యాలు వ్రాసిన వేమన గారికి స్త్రీ ల మీ ద ఏమంత సదభిప్రాయం వున్నట్లు కనిపించదు.

వేమన చిన్నతనంలో వేశ్యాలోలుడు. అది వెనకటి రోజుల్లో అందరికీ వున్నదే. ఆ కాల పరిస్థితిని బట్టి ఆ విషయంలో మనం తప్పు పట్టవలసిన పనిలేదు.

"ఆడుదాని జూడ నర్థంబు జూడగా
బ్రహ్మకైనా నెత్తు రిమ్మతెగులు"

అవిఅయనే చెప్పుకున్నాడు తన దౌర్బల్యాన్ని సమీకరిసూ.

ఇలా వేశ్యాలోలుడై తిరుగుతున్న వ్యక్తిని మార్చాలన్న తలంపుతో తల్లిదండ్రులు పెళ్ళి చేశారు. ఆ పెళ్ళి అయ్యాక ఆమెని చాలా గాఢంగా ప్రేమించాడు వేమన.

అయితే అతని భార్యకి అ స్తమానం అతని వెనుకటి జీవితం, అతని వేశ్యాలోలత్వమే గుర్తు వచ్చేది. మాటకి మాట విసిరేది. ఎడమొగం – పెడమొగంతో వుండేది. దాంతో వేమనకి సంసార జీవితం మీద చాలా విరక్తి కలిగింది.

"ఆలు మగని మాట కడ్డంబు వచ్చెనా
ఆలు గాదు నుదుటివ్రాలు గాని
అట్టి యాలు విడిచియడవినుండుట మేలు" అని

"వాడకుటికి తిట్టు వలదన్న మొరబెట్టు
ముందు మగని దిట్టు ముసుగు బెట్టు
గడుసురాలు మగని గంప బెట్టమ్మురా"

అంటూ భార్యని గురించి చెప్పుకున్నవి స్వానుభవంలోనే. ఆ భార్యని మార్చడం అతని వల్ల కాకపోయింది. చివరకు బ్రహ్మదేవుడిని తిట్టి వూరుకున్నాడు. పోనీ పిల్లలన్నా మంచివారయ్యారా అంటే పాపం అతనికి ఆవిధంగానూ సంతోషం లేకుండా పోయింది. ఒక్క బిడ్డ కూడా వంశానికి కీర్తి తెచ్చే వాడు కాకపోయాడు. దాంతో తన భ్రష్ట సంసార జీవితాన్ని గురించి తనే బాధపడి పద్యంగా చెప్పుకున్నాడు.

"సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతులగుచు బుత్రులొప్ప
స్వర్గమేటికయ్య సంసారికింకను."

అని బాధపడ్డాడు తనకి అలా లేనందుకు.

భార్య సుగుణవంతురాలు, బుద్ధిమంతులైన కొడుకులు వున్న సంసారికి వేరే స్వర్గం అవసరం లేదని నిక్కచ్చిగా చెప్పాడు.

సాంసారిక జీవనంలో ఎన్నో బాధలు పడుతున్న అతను చివరికి దరిద్రాన్నే అనుభవించవలసి వచ్చింది. దాంతో భార్య అతని దరిద్రాన్ని తిట్టిపోసింది. నిందలు వేసింది. పిల్లలు కూడా దరిద్రుడైన తండ్రినే తప్పు పట్టారు. వీటితో పూర్తిగా మనసు విరిగిపోయింది అతనికి.

"తెచ్చిపెట్టినేని మెచ్చు నాలు
చిక్కుపడ్డ వేళ జీకాకు పరచురా" అంటూ

తన నరక సదృశమైన జీవితాన్ని చాటిచెప్పుకున్నాడు.

ఈ విధంగా గయ్యాళి భార్య – చెప్పిన మాట వినని సంతానం – పట్టుకొన్న దరిద్రం – ఆకలి బాధ అన్నీ అతనిలో స్త్రీ పట్ల గౌరవాన్ని కుదించేశాయి.

స్త్రీలని అనేక విధాలుగా దూషించాడు – నిరసించాడు. అయినప్పటికీ వేమన పద్యాలంటే మక్కువ చూపని వారుండరు. 

# పిల్లలలో చదివే అలవాట్లు - పెద్దల బాధ్యత

ఈనాటి బాలురే రేపటి పౌరులు. పౌరులు అంటే కేవలం యుక్త వయస్కులైన ప్రజలు మాత్రమే కాదు తమ బాధ్యతల నెరిగి సంఘానికి ఉపయోగపడ గలిగిన వారే నిజమైన పౌరులు. పిల్లల్ని బాధ్యత నెరిగిన పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత పెద్దలమీద ఉంది.

పిల్లలకి తొలి గురువు తల్లి. తర్వాత తండ్రి. ఆ పైనే గురువు. అందుకే ఆర్యులు 'మాతృదేవో భవ' 'పితృదేవో భవ', 'గురుదేవో భవ' అన్న సూక్తులలో తల్లిదండ్రులకి ప్రథమ, ద్వితీయ స్థానాలు ఇయ్యడం జరిగింది. దీనిని బట్టే బాలల భావి జీవితంలో తల్లిదండ్రుల పాత్ర ఎంత ముఖ్యమైనదో గ్రహించవచ్చు.

కె. ఆర్. కె. మోహన్

పిల్లలు శైశవావస్థలో నున్నప్పుడు తప్పటడుగులు వేయడం పరిపాటి. అవి మనకి ముద్దుని కల్పిస్తాయి. కాని వారి భావిజీవితంలో తప్పటడుగులు వేయకుండా బలమైన పునాదిని పెద్దలే నిర్మించాలి.

పిల్లల మనస్సులు మైనం వంటివి. వాటిని మనం ఏ విధంగా మలిస్తే ఆ విధంగానే వారు రూపొందుతారు. అందుకే వారిని క్రమబద్ధమైన, ప్రయోజన పూర్వకమైన జీవితం గడిపే వారుగా చేయవలసిన బాధ్యత పెద్దలదే. పిల్లలు మాటలు నేర్చుకునేటప్పుడు సహజంగా తప్పులు మాట్లాడతారు. ఎప్పటి కప్పుడు, పెద్దలు వారిని సరిదిద్ది, వారు స్వచ్ఛంగా మాట్లాడేటట్లు చూడాలి వారికి ఒకసారి ఈ విధంగా అలవాటు చేస్తే వారు జీవిత కాలమూ స్వచ్ఛంగా మాట్లాడతారు. అలాగే పిల్లలు ఎదుగుతున్న కొద్దీ, సహవాస దోషం వల్ల, అసభ్యకరమైన, అపభ్రంశపు మాటలు నేర్చుకుంటారు. పెద్దలు, వారికి నయాన్న భయాన్న అటువంటి మాటలు మాట్లాడకుండా, మృదువుగా, సంస్కారవంతమైన భాషని మాట్లాడేటట్లు అలవాటు చేయాలి.

పురాణాలు, ఇతిహాసాలు వంటి మంచి గ్రంథాలలోని కథలు, మనిషి జీవితాన్ని మంచి మార్గంలో మలచడంలో చాలా దోహదం చేస్తాయి. మహాత్మాగాంధి, పండిట్ నెహ్రూల వంటి మహనీయుల జీవిత చరిత్రలు చదివినపుడు, వారి చిన్న వయస్సులో, వారి తల్లిదండ్రులు వారికి వినిపించిన రామాయణ, మహాభారతం వంటి గ్రంథాలలోని కథలు, వారిని ఎంతో ప్రభావితం చేసినట్లు మనకి అర్థమవుతుంది. పిల్లలు కథలంటే చెవులు కోసుకుంటారు. వారి ఈ లక్షణాన్ని అవకాశంగా చేసుకుని వారిని ఉత్సాహ పరిచి, ప్రాజ్ఞులుగా తయారు చేయగల కథలను వారికి తలిదండ్రులు చెప్తూండడం ఎంతో అవసరం. మన ముందుతరం వరకూ, తలిదండ్రులు, అమ్మమ్మలూ తాతయ్యలూ, పిల్లలకి ఈ విధంగా మంచి కథలు చెప్తుండిన విషయం మనందరికీ తెలిసిందే.

ఇంక చదువుల విషయానికి వస్తే, మన ముందుతరం వరకూ పిల్లలచేత "పెద్దబాలశిక్ష", "సుమతీ శతకం" "వేమన శతకం", "దాశరధీ శతకం" వంటిపుస్తకాలు చదివించే వారు. "పెద్దబాలశిక్ష" చిన్న పిల్లల పుస్తకమైనా, అందులో పెద్దలకి కూడా పనికి వచ్చే విషయాలు ఎన్నెన్నో ఉంటాయి. దీనిని చదివిన బాలలు ఎంతో ప్రపంచ జ్ఞానాన్ని పొందగలిగే వారు. అలాగే "సుమతీ శతకం" వంటి శతకాలు, సులభశైలిలో మనస్సుకి హత్తుకునేటట్లు ఉండి, బాలలను మంచి మార్గంలో పెట్టడానికి దోహదపడేవి. ఇటువంటి ఉత్తమపుస్తకాల విషయంలో అశ్రద్ధ చూపడం వల్లనే, నేటితరం లోని చాలామంది నైతిక పతనం చెందటానికి కారణమయ్యింది.

అలాగే "పంచతంత్రం" యొక్క ప్రాధాన్యం కూడా. రాజు గారి మందబుద్ధులైన పుత్రులను, విష్ణుశర్మ అనే పండితుడు, తన ఈ "పంచతంత్ర" కథలతో, ప్రజ్ఞావంతులను చేసిన విషయం ఇందులోని సారాంశం. "పంచతంత్రం" నీతికి, ప్రపంచజ్ఞానానికి భాండాగారం వంటిది. అందువల్ల "పంచతంత్రాన్ని" "ప్రపంచ తంత్రం" అనడం సబబుగా ఉంటుంది ఇట్టి విశిష్టగ్రంధమైన "పంచతంత్రాన్ని" పిల్లలందరూ తప్పని సరిగా చదివేటట్లు పెద్దలు చూడాలి.

పిల్లలకి మనం చిన్నతనంలో ఏ విధమైన అలవాట్లు చేస్తే పెద్దతనంలో కూడా అవే చిరస్థాయిగా ఉండిపోతాయి. అందుకే పుస్తకాలను చదివే అలవాట్లను చేయడంలో పెద్దలు చాలా శ్రద్ధ వహించాలి దురదృష్టవశాత్తు ఈనాడు వస్తున్న సాహిత్యం చాలా చవుకబారుగా ఉండి, పిల్లల్ని తప్పు త్రోవలు పట్టించేటట్లుగా ఉంటోంది. అర్థం లేని క్షుద్ర సాహిత్యం, డిటెక్టివ్ నవలలు, సినిమా పత్రికలు, సెక్సు పుస్తకాలు, పత్రికలు– ఇవే ఈనాటి విద్యార్థులకు అందుబాటులో ఉంటున్నాయి. అలాగే సెక్సునీ, హింసనీ అతిగా చూపించే పరమ చెత్త సినిమాలు వస్తున్నాయి. చెత్త పుస్తకాలు చదవడం– చెడు సినిమాలు చూడడం వాటిలోని నాయకులను అనుకరించడానికి ప్రయత్నించడం – వీటితో నైతిక విలువలు పూర్తిగా దిగజారిపోయాయి. ఈ పరిస్థితిని సరిదిద్దాలంటే పిల్లలకి, పసితనం నుంచే, మంచి కథలు చెప్పి, మంచి పుస్తకాలను చదివించి, సరియైన మార్గంలో పెట్టడం ఒక్కటే మార్గం.

అయితే మంచి పుస్తకాలు మనకి తగినంతగా ఉన్నాయా అంటే లేవనే చెప్పాలి. తెలుగులో ఇతర సాహిత్యం అభివృద్ధి చెందినంతగా, బాల సాహిత్యం అభివృద్ధి చెందలేదు. మంచి పుస్తకాలంటే కేవలం

## శస్త్ర వైద్యుని సలహాలు



వైద్యశాస్త్రం, ముఖ్యంగా శస్త్రచికిత్సా విధానం ఎంతగానో అభివృద్ధి గాంచింది. అయితే పామరులకే గాక, చదువుకున్న వారికి కూడా దీని లోతుపాతులు తెలియకనూ, వైద్యశాస్త్ర పరిజ్ఞానం లేకపోవడం వలననూ, సకాలంలో సరైన వైద్యులను సంప్రదించక పోవడం చేత ప్రాణం మీదకు తెచ్చుకునే సందర్భాలు అనేకం. కనుక శస్త్రవైద్య శాస్త్ర పరిజ్ఞానమును "శ్రీవాణి" పాఠకులకు అందించాలనే ఉద్దేశ్యంతో ప్రముఖ శస్త్ర చికిత్సా వైద్య నిపుణులు డా॥ సి. యస్ శాస్త్రి M. S. (విజయవాడ) గారిని కోరాను. వారు ప్రేమతో అంగీకరించారు. "ప్రశ్నలు - సమాధానముల" రూపంలో ప్రతి సంచికలో ముద్రించదలచాను. కనుక పాఠకులు ప్రశ్నలు క్లుప్తంగా డాక్టర్‌గారికే సరాసరి పంపిన యెడల సమాధానములతోసహా 'శ్రీవాణి' లో ముద్రించుతాం. ఇంకా ఎక్కువ వివరములు అవసరమైతే డాక్టర్‌గారిని కలిసి సంప్రదించుకోవచ్చును. కోరిన వెంటనే సమాధానములు యివ్వడానికి అంగీకరించినందుకు డా॥ శాస్త్రిగారికి ధన్యవాదములు

చిరునామా : ఫోన్ : 74627

డా॥ సి. యస్. శాస్త్రి, M. S.

ముదునూరివారివీధి, గాంధీనగర్, విజయవాడ-3

— సం.

పురాణగాథలు, నీతి పుస్తకాలు మాత్రమే కానక్కరలేదు. వైజ్ఞానిక విషయాలు, మహనీయుల జీవిత చరిత్రలు- వీటన్నిటినీ కూడా పిల్లలకి అర్థమయ్యే భాషలో, ఆకర్షణీయమైన చిత్రాలతో చిన్న చిన్న పుస్తకాలని ప్రచురించి, పిల్లల చేత చదివిస్తే, వారికి అట్టి పుస్తకాల యెడ అభినివేశం కలిగి, పెద్దవారు అవుతున్నకొద్దీ అటువంటి మంచి పుస్తకాలను చదవడం అలవాటు చేసుకుంటారు. ఈ రంగములో ప్రభుత్వం, ప్రచురణకర్తలూ, పత్రికలూ, రచయితలూ బాధ్యతా యుతమైన కృషిని చేయవలసి ఉంది. కాలక్షేపం కోసం డిటెక్టివ్ నవలలనూ, సినిమా పత్రికలనూ చదవడం తప్పుకాదు. కాని కేవలం వాటినే చదవడం పొరపాటు. ప్రధానంగా చదవవలసింది మంచి సాహిత్యం.

పిల్లలలో ఉత్తమ సాహిత్యాన్ని చదివే అలవాటుని పెంపొందించడం, ఏ ఒక్కరి బాధ్యతో కాదు అది అందరి సమిష్టి బాధ్యత. విద్యాలయాలలో, బోధించే పుస్తకాలలో ఉత్తమమైన నిర్దుష్టమైన అంశాలను పొందుపరచాలి. ప్రభుత్వం జాగరూకతతో అసభ్య సాహిత్యం ప్రచారంలోకి రాకుండా చూడాలి. ఫిలిం సెన్సార్ వారు అశ్లీల చిత్రాలు రాకుండా జాగ్రత్త వహించాలి. ఉత్తమ సాహిత్యం పెంపొందడానికి ప్రభుత్వమూ, ప్రచురణకర్తలూ, రచయితలు సుసంఘటితమైన కృషి చేయాలి. ప్రోత్సాహకరమైన బహుమతులను ఇయ్యడం ద్వారా ఉత్తమ సాహిత్య రచనకి దోహదం చేసినట్లే ఉత్తమ సాహిత్య పఠనంలో కూడా పోటీలు పెట్టి, ఆకర్షణీయమైన బహుమతులను ఇయ్యడం ద్వారా, మంచి పుస్తకాలను చదవాలనే ఆసక్తిని పెంపొందించవచ్చు. అన్నిటినీ మించి తలిదండ్రులు పిల్లలకి మంచి పుస్తకాలు చదివే అలవాటు చేయడం చాలా అవసరం.

ఉత్తమ సాహిత్య పఠనాభిలాషని ఒక జాతీయ కార్యక్రమంగా భావించి, అందరూ కూడా సుసంఘటితమైన కృషి చేయడం చాలా అవసరం. అప్పుడే, జాతికి మంచి పేరు ప్రతిష్ఠలు తేగలిగిన యువతరాన్ని నిర్మించడం సాధ్యమవుతుంది. 

'శ్రీవాణి' ద్వితీయ వార్షికోత్సవ శుభాకాంక్షలతో

# లక్ష్మీ జనరల్ స్టోర్స్

బీసెంటురోడ్....గవర్నరుపేట

విజయవాడ-2

ఫ్యాషన్ వస్త్రముల సప్లయిదారులు



# మనసుకు వచ్చే జబ్బులు

మన దేశంలో దాదాపు కోటి నలభై లక్షలమంది రక రకాల తీవ్రమైన మానసిక వ్యాధులతో బాధ పడుతున్నారు. ఇతర దేశాలతో పోల్చి చూస్తే మన దేశంలో మానసిక రోగుల సంఖ్య తక్కువేమీ కాదు. అయితే మానసిక వైద్యుల సంఖ్యమాత్రం చాలా తక్కువ. మరీ మన రాష్ట్రంలోని మానసిక వైద్యులు, మానసిక హాస్పటల్స్ సంఖ్య చాలా తక్కువే మొత్తం రాష్ట్రం మీద కలిపి యాభై మంది సైకియాట్రిస్టులు కూడా లేరు. ప్రభుత్వ రంగంలో కేవలం రెండు మెంటల్ హాస్పటల్స్ మాత్రమే, హైదరాబాదు, విశాఖపట్టణంలో ఉన్నవి. ప్రైవేట్ రంగంలో చెప్పుకోదగ్గ మానసిక ఆస్పత్రులు విజయవాడ, రాజమండ్రి, వాల్తేరు, హైదరాబాదులలో మాత్రమే ఉన్నవి.

డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి

అసలు విషయానికి వస్తే మానసిక జబ్బులంటే మనసుకు వచ్చే జబ్బులని చెప్పటం సులభమే అయినా ఆ మనసంటే ఏమిటో చెప్పడం మాత్రం కష్టమే. మన శరీరంలోని మిగిలిన భాగాల మాదిరిగా మనసనేది కంటికి కనబడనిది, స్పర్శకందనిది. అయితే మనసనేది మెదడులోని అంతర్భాగమే. మనసనేది మనిషి ప్రవర్తనకు సంబంధించిన పలు లక్షణాల సమ్మేళనంగా చెప్పుకోవచ్చు.

ఒక వ్యక్తి వింతగా ప్రవర్తిస్తే, వెంటనే అతనికేదో గాలి సోకిందని, చేతబడి చేశారని, మందు పెట్టారని, ఇలాంటి రకరకాల మూఢ నమ్మకాలతో అతనికి భూత వైద్యాలు, మందు కక్కించడాలు, తాయెత్తులు వేయిస్తారే తప్ప, శాస్త్రీయంగా ఆలోచించేవారు చాలా తక్కువ.

## మానసిక జబ్బులకు శాస్త్రీయకారణాలు

వంశ పారంపర్యంగా అంటే Hereditary గా సంక్రమించేవి కొన్ని. పుట్టిన పిల్లలందరికీ ఇవి రావాలనిలేదు. తల్లిదండ్రుల కిరువైపులా మానసిక జబ్బులుంటే, ఆ పిల్లలకు అవి ఎక్కువగా వచ్చేదానికి అవకాశముంది. మెదడుకు బలమైన గాయం తగిలినా, మెదడువాపు వ్యాధి లేదా మెదడులో కంతులు పెరగడం వల్లకాని కూడా కొందరికి మానసిక జబ్బులొస్తాయి. మూర్ఛ వ్యాధితో బాధపడ్తున్న వారిలో మానసిక సమస్యలు ఎక్కువ.

న్యూరోట్రాన్సిమీటర్స్ అనే మెదడులో ఉన్న జీవ రసాయన పదార్థాల నిష్పత్తిలో తేడాలొచ్చినా, తీవ్రమైన మానసిక జబ్బులొస్తాయి. మద్యానికి, మత్తు మందులకు అలవాటుపడ్డం ఒక మానసిక జబ్బయితే, వాటి ప్రభావం వల్ల మెదడు, నాడీమండలం దెబ్బతిని మరికొన్ని మానసిక అవలక్షణాలు కల్గుతాయి.

వ్యక్తిత్వ లోపం వల్లను (Inadequate personality) జీవితంలోని ఒడుదుడుకులకు తట్టుకోలేక పోవడం వల్లను కొన్ని మానసిక జబ్బులొస్తాయి. ఒక్కో మనిషి మనస్తత్వం ఒక్కో రకంగా ఉంటుంది. కొందరు చాలా రిజర్వ్‌డ్‌గా, సెన్సిటివ్‌గా ఉంటే మరికొందరు చాలా సోషియల్‌గా, ధైర్యంగా ఉంటారు. సమస్యలు లేని మానవ జీవితమంటూ ఉండదు. తమ వ్యక్తిత్వంలో లోపాలున్నా, అవి సమర్థవంతంగా లేకపోయినా, జీవితంలో వచ్చే ఆటు పోట్లకు ఎదురీదలేక కొందరు మానసికంగా క్రుంగిపోయి పలురకాల మానసిక జబ్బులకు గురవుతున్నారు.

## ఇత్, ఈగో, సూపర్ ఈగోల మధ్యవచ్చే సంఘర్షణలవల్ల కలిగే మానసిక సమస్యలు మరికొన్ని :

ప్రతి మనిషి మనసులో అంతర్లీనంగా 3 భాగాలుంటాయి. అవే ఇత్, ఈగో, సూపర్ ఈగో. మనిష

దైనందిన ప్రవర్తనను ఇవి కంట్రోల్ చేస్తుంటాయి. ఇత్ అనేది తాననుకొన్నది మంచైనా, చెడైనా వెంటనే తన కోరిక నేరవేర్చుకోవాలనే స్వభావం గలది. దానికి నీతి, నియమం అక్కర్లేదు. స్వార్థ చింతనే ఎక్కువగా వుంటుంది. సూపర్ ఈగో అనేది దీనికి వ్యతిరేకం. మనిషికి సంప్రదాయం, కట్టుబాట్లు, క్రమశిక్షణ, న్యాయం, అన్యాయం వీటి చింతన ఎక్కువగా ఉండేదే సూపర్ ఈగో. మనిషి తప్పుదారిన పడుతున్నప్పుడు, హెచ్చరించి మళ్ళీ మంచిమార్గంలోకి తేవాలని ప్రయత్నిస్తుంటుంది. ఇలా ఇత్‌కు, సూపర్ ఈగోకు మధ్య నిరంతర సంఘర్షణ జరుగుతుంటుంది. ఈ రెంటినీ సమన్వయ పరచి అటు ఇత్‌ను, ఇటు సూపర్ ఈగోను సంతృప్తి పరచి మనిషి ప్రవర్తనను ఒక క్రమ పద్ధతిలో ఉండేలా చేసేది 'ఈగో' (Ego). ఈగో అనేది బలంగా ఉన్నప్పుడు మనిషి అటు పూర్తి సంకుచిత స్వార్థ చింతనకు లోనుగాకుండాను, ఇటు మరీ చాదస్తంగాను, మడీ అతి కట్టుబాట్లకు లోను గాకుండాను మధ్యస్తంగా ఉంటాడు. ఈగో బలహీన మైతే ఇత్, సూపర్ ఈగోల మధ్య సంఘర్షణ చోటు చేసుకొని మనిషి మానసికంగా పట్టుతప్పిపోతాడు.

## మానసిక వ్యాధులు - రకాలు :

మానసిక వ్యాధులంటే మనలో చాలా అపోహ లున్నాయి. ఒక వ్యక్తి మానసిక వైద్యుడి దగ్గరికి వెళ్లే డంటే అతనికేదో 'మెంటల్' 'పిచ్చి' వొచ్చిందని చాలామంది అనుకుంటూ ఉంటారు. ఇది పూర్తిగాపొర

మానసిక వ్యాధులను గురించి శ్రీవాణిలో ప్రతినెలా చిన్న చిన్న వ్యాసములు వ్రాయడానికి ప్రేమతో ప్రముఖ మానసిక వైద్య నిపుణుడు డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి Neuro Psychiatrist (విజయవాడ) గారు అంగీకరించారు. వారికి నా అభినందనలు. ఈనాడు అనేకమంది అభాగ్యులు మానసిక వ్యాధులకు గురై సరైన చికిత్స సకాలంలో చేయించుకోక కడు దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు. అంతేకాదు ఈ విషయంలో సరైన అవగాహన లేక మూఢాచారాలకు బలై పండంటి జీవితాలను నాశనం చేసుకుంటున్నారు. డాక్టరుగారి వ్యాసములు 'శ్రీవాణి' పాఠకులకు కనీస విజ్ఞానాన్ని అందిస్తాయని ఆశిస్తున్నాను. మిగతా వివరములకు డాక్టరుగారిని సంప్రదించండి.

డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి
"ప్రశాంతి"
దేవి ఆయిల్ మిల్ రోడ్
సూర్యారావుపేట
విజయవాడ - 520 002

— సం.

పాటు - మానసిక వ్యాధుల్లో కొన్ని వందల రకాలున్నాయి. మెంటల్ అనేది, 'పిచ్చి' అనేది వాటిల్లో ఒక రకం మాత్రమే. శరీరానికి జబ్బులెలా వస్తాయో, మనసనే దానికి కూడా అలాగే జబ్బులొస్తాయి. శారీరక వ్యాధుల నెలా నయం చేసుకోగలమో, మానసిక వ్యాధులను కూడా అలాగే నయం చేసుకోవచ్చు. మళ్ళీ పూర్తి మామూలు మనిషి కావచ్చు. మానసిక జబ్బుల్లో న్యూరోసెస్ అని చిన్నతరహా మానసిక జబ్బులున్నాయి.

ఆందోళన, భయం, కంగారు, ఏకాగ్రత లేకపోవడం, అతి ఆలోచనలు, నిద్ర పట్టకపోవడం, జ్ఞాపకశక్తి తగ్గిపోవడం, చిన్న విషయాలకే ఎక్కువగా చలించిపోవడం, నిరాశా, నిస్పృహ, దిగులు, దుఃఖము, అనవసరమైన అర్థం పర్థం లేని భయాలు, చేసిన పనినే మళ్ళీ మళ్ళీ చేయడం, ఒంట్లోకి గాలి, పూనకాలు రావడం, స్పృహ తప్పి పోవడం, ఇవన్నీ ఒక తరగతికి చెందిన మానసిక జబ్బులు.

అలాగే తీవ్రమైన మానసిక జబ్బులు కొన్ని ఉన్నాయి. వింతగా మాట్లాడం, అరవడం, తమలో తాము నవ్వుకోవడం, గొణుక్కోవడం, అనవసరమైన అనుమానాలు అంటే మందు పెట్టారనో, చేతబడి చేశారనో, అందరూ తమకు వ్యతిరేకంగా కుట్ర పన్నుతున్నారనో అనుమానించడం, ఆత్మహత్యకు ప్రయత్నం చేయడం ఇవన్నీ తీవ్రమైన మానసిక జబ్బుల లక్షణాలు.

ఇకపోతే చిన్న వయసులోనే అతిగా అబద్ధాలాడ్డం, దొంగతనాలు చేయడం, స్కూలు ఎగ్గొట్టడం, ఇండ్లు వదలి వెళ్ళిపోవడం, నేరప్రవృత్తి కల్గి ఉండటం లాటివి 'పర్సనాలిటీ డిసార్డర్స్' అనే మానసిక రుగ్మతలకు ఉదాహరణలు.

మద్యానికి, మత్తు మందులకు అంటే పెథిడిన్, మార్ఫిన్, గంజాయి, నిద్రబిళ్ళలు, వీటికి అలవాటుపడి, శరీరం మనసు పాడయిపోయి, రకరకాల శారీరక మానసిక జబ్బులొచ్చేదానికి అవకాశముంది. సెక్సుకు సంబంధించిన లేనిపోని అనుమానాలు, అపోహలు, రతికార్యక్రమంలో సమర్థవంతంగా పాల్గొన లేకపోవడం, సెక్సులో విపరీతమైన వింతయైన ధోరణులు కల్గి ఉండడం- ఇవన్నీ కూడా మానసిక సంబంధమైన సమస్యలే.

చిన్నపిల్లలలో కూడా కొన్ని రకాల మానసిక జబ్బులొచ్చే దానికి అవకాశముంది. తెలివితేటలు, జ్ఞాపకశక్తి తక్కువగా ఉండటం, చదువులో వెనుకబడ్డం, నిద్రలో మూత్ర విసర్జన చేయడం, నిద్రలో మాట్లాడ్డం, లేచి తిరగడం, నత్తిగా మాట్లాడ్డం, చెప్పిన మాటకు ఎదురు తిరిగే

# కౌటిల్యుని ఋణ విధానం

కౌటిల్యుడు రచించిన అర్థశాస్త్రంలోని 11వ అధ్యాయంలో ఋణ విధానం గురించి ప్రస్తావించబడింది.

" రాజా దేశహితాన్ సేతూన్
కుర్వంతాం పథి సంక్రమాన్
గ్రామ శోభాశ్చ రక్షాశ్చ
తేషాం ప్రియ హితం చరేత్ "

దేశానికి హితం చేసే వాళ్ళకి రాజు అండగా వుంటాలని పేర్కొన బడింది. సామాన్య అవసరాలకు అప్పు తీసుకునే వారి నుండి ఒక నెలకు 100 పణాలకు 1-1/4 పణాలు మాత్రమే వడ్డీ తీసుకోవాలని, వ్యాపారం కోసం తీసుకొనే ఋణమైతే 5 పణాలు, అడవులలో వ్యాపారం చేసేవారి నుండి 10 పణాలు, సముద్ర వ్యాపారస్థుల నుండి 20 పణాలు తీసుకొనవచ్చునట. అంతకు మించినట్లయితే ధనికుణ్ణి అనగా అప్పు యిచ్చిన వాడ్ని, ధారణికుణ్ణి అనగా అప్పు తీసుకొన్న వాడ్ని మరియు సాక్షులను దండించాలని కౌటిల్యుడు స్పష్టం చేసాడు. 10 సంవత్సరాలు దాటితే కాల దోషం పడుతుంది. అయితే దీనికి కొన్ని మినహాయింపులు సూచించడం జరిగింది. ధనికుడు బాలుడైనా, వృద్ధుడైనా, ప్రవాసియైనా, రోగార్తుడైనా కాల దోషంలేదు. దీనివలన ఒక విషయం మనకు బోధపడుతున్నది. మన భారతదేశంలో ఏనాడో ప్రతి విషయం సునిశితంగా పరిశీలించబడిందని, సముచితమైన, వాస్తవికమైన, ఆచరణ సాధ్యమైన నిర్ణయాలు గైకొనబడినాయని ఋజువవుతున్నది. నేటి పాలకులు కౌటిల్యుని అర్థశాస్త్రమును అవగాహన చేసుకొని ఆచరణలో పెడితే బాగుంటుందేమో!

స్వభావం, ఇవన్నీ కూడా మానసిక జబ్బు లక్షణాలే! కొందరు పిల్లలు చాలా ఓవర్ అక్టివ్‌గా, నిలకడ లేకుండా అటూ—ఇటూ తిరుగుతూ అన్నీ శోధిస్తూ ఉంటారు. ఇది "హైపర్ కైనెసిస్" అనే మానసిక జబ్బని తలిదండ్రులు గుర్తించాలి.

మనలో ఎవరికైనా ఏదైనా మానసిక సమస్య ఉన్నా, ప్రవర్తనలో ఏవైనా లోపాలున్నా, లేనిపోని మూఢ నమ్మకాలతో భూతవైద్యం, మంత్రవైద్యం చేయించుకొని వాటిని ముదిరిపోయేటట్లు చేసుకోకుండా, తొలి దశలోనే మానసికవైద్యుని సంప్రదించి తగిన సలహాలు, చికిత్స తీసుకుంటే మానసిక జబ్బులను పూర్తిగా నయం చేసుకొని, జీవితాంతం సుఖ సంతోషాలతో ఆ వ్యక్తి ప్రశాంతంగా ఉండవచ్చు. 

## రూపాయి చిక్కిపోతున్నది

పారిశ్రామిక కార్మికులకు చెందిన వినియోగదారుల ధరల సూచి 1969 ధరల ఆధారంగా గత ఆగస్టు మాసాంతానికి రూపాయి విలువ బొంబాయిలో 14.10 పైసలు; ఢిల్లీలో 14.14 పైసలు; మద్రాసులో 14.88 పైసలు; శ్రీనగర్‌లో 13.70 పైసలు; బెంగుళూరులో 13.97 పైసలు; హైదరాబాద్‌లో 14.61 పైసలు; జైపూర్‌లో 14.93 పైసలు; అహమ్మదాబాద్‌లో 15.43 పైసలుకాగా భోపాల్‌లో 12.99 మాత్రమే.

అఖిల భారతస్థాయిలో రూపాయి విలువ 14.88 పైసలకు పడిపోయింది. ఈ విధంగా చిక్కుతో పోతే కొంత కాలానికి అసలు రూపాయికి విలువ లేకుండా పోవడమే కాక అసలు రూపాయిని ప్రభుత్వం చలామణిలో లేకుండా రద్దుచేసినా ఆశ్చర్య పడ నవసరం లేదు. రూపాయి నోట్ల ముద్రణ నిలుపుచేస్తాము అని ఈమధ్యనే అధికారులు ప్రకటించారు కూడాను. అనతి కాలంలోనే రూపాయి విలువ నయాపైసాకు సమాన మైనా ఆశ్చర్య పడనవసరం లేదు. ఇదీ మన ఆర్థిక పరిస్థితి, దుస్థితి.

సంక్రాంతి శుభాకాంక్షలతో



స్థాపితం : 1983 ఫోన్ : 302 ( P. P. )

# శ్రీ లక్ష్మి చిట్ ఫండ్స్

( రిజిష్టర్డ్ నెం. 1318 )

నందిగామ – 521 185

చదవండి ! చదివించండి ! !

# శ్రీ కవితా ప్రచురణలు

చైతన్యజ్యోతి 1వ భాగం శ్రీమతి హజరా 22-00

చైతన్యజ్యోతి 2 వ భాగం ,, 22-00

(స్వాతి సపరివారపత్రిక సీరియల్)

శార్వరి హోతా పద్మినీదేవి 20-00

తొలగిన తెరలు సీతా లక్ష్మరాజా 10-00

(జనసుధ సీరియల్)

దూరతీరాన ఓ తారాపథం జె. వరలక్ష్మి 20-00

మా పూర్తి కేటలాగుకై వ్రాయండి

శ్రీ కవితా పబ్లికేషన్స్

మ్యూజియం రోడ్, విజయవాడ-2

లేడీ సూపర్ రైటర్

## శ్రీమతి రావినూతల సువర్ణాకన్నన్

1987 – సూపర్‌హిట్ నవలలు

* యవనిక ( శ్రీవాణి మంత్లీ సీరియల్ ) 25-00
* కరిగిన శిల ( ఆంధ్రపత్రిక వీక్లీ సీరియల్ ) 30-00
* పరాధీన ( ఆంధ్రప్రభ డైలీ సీరియల్ ) 30-00
* చుక్ – చుక్ – చుక్ ( స్వాతి వీక్లీ సీరియల్ ) 26-00
* పాతాళగంగ ( ఆంధ్రజ్యోతి వీక్లీ సీరియల్ ) 20-00
* అలకల కొలికి ( స్వాతి మంత్లీ సీరియల్ ) 22-00
* కాంచన సౌధం ( ఆంధ్రపత్రిక వీక్లీ సీరియల్ ) 22-00
* క్లిక్ – క్లిక్ – క్లిక్ – ( ఆంధ్రజ్యోతి వీక్లీ సీరియల్ ) 22-00

మా పూర్తి కేటలాగుకై వ్రాయండి

# లక్ష్మి పబ్లికేషన్స్

రామమందిరం వీధి, గవర్నరుపేట, విజయవాడ-2

## సంక్రాంతి శుభాకాంక్షలు

పాఠకులకు, రచయితలకు, ప్రకటన కర్తలకు, జీవిత చందాదారులకు, చందా దారులకు, శ్రేయోభిలాషులకు — అందరికీ "శ్రీవాణి" సంక్రాంతి శుభాకాంక్షలు.



## కృతజ్ఞతాంజలి

ఈ ప్రత్యేక సంచిక ఇలా మీ ముందుం చేందుకు సహకరించిన రచయితలు, ప్రకటన కర్తలు, జీవిత చందాదారులు, చందాదారులు, ఇంకా ఎందరో శ్రేయోభిలాషులు - అందరికీ

వినమ్రతాపూర్వక

గౌరవ కృతజ్ఞతాంజలులు.

— సంపాదకుడు

## విద్యారంగంలో పందొమ్మిదేండ్ల అపూర్వ పురోగతిలో




1972 నుండి
1986 వరకు
ఎస్. ఎస్. సి.
పబ్లిక్ పరీక్షా
ఫలితాలు

1972 - 100%
1973 - 100%
1974 - 100%
1975 - 100%
1976 - 100%
1977 - 100%
1978 - 100%
1979 - 100%
1980 - 100%
1981 - 100%
1982 - 100%
1983 - 100%
1984 - 100%
1985 - 100%
1986 - 100%



దేశం నలువైపులనుండి విద్యార్థులను ఆకర్షిస్తూ ఉత్తమాదర్శాలతో నిర్వహింపబడుచున్న విద్యానిలయం.



### విశ్వభారతి పబ్లిక్ స్కూల్

(ఇంగ్లిషు మీడియం)

L. K. G. to 5 th Standard

పొట్లూరి రఘుబాబు బి. ఇ.,
ప్రిన్సిపాల్ & కరస్పాండెంటు



బాలబాలికలకు చక్కని సదుపాయములతో
" అమరజీవి " హాస్టలు సౌకర్యము కలదు.

పొట్లూరి శ్రీమన్నారాయణ
వ్యవస్థాపకులు & ప్రిన్సిపాల్

"శ్రీవాణి" జీవిత సభ్యులు

శ్రీ యు. వి. కె. మోహనరావు
పున్నమ్మతోట, విజయవాడ

శ్రీ ఎమ్. జె. సి. ప్రసాద్
East Coast Metals & Minerals Pvt. Ltd.
మ్యూజియం రోడ్, విజయవాడ

శ్రీ తాడేపల్లి బసవయ్య
మిల్లర్, మచిలీపట్నం

Postal Registered
No. H/MPM/34, Dt. 10-12-84

SREE VANI

Regd. with Registrar of News Papers
No. RN 000121/20/AL/85 NT II

On the occasion of the Second Anniversery



Registered Office :

[illegible]

Manufactures of :

SUGAR, INDUSTRIAL ALCOHOL AND DENATURED SPIRITS ETC.,

at VUYYURU, Krishna Dist., Andhra Pradesh

**PORTLAND CEMENT**

at MECHERLA, Guntur Dt., Andhra Pradesh

**MACHINERY**

for complete sugar factories and also for cement, chemical industries etc.,

at TIRUVOTTIYUR, MADRAS-600 019.

| | | |
|---|---|---|
| Telegrams & Telephones | Regd. Office | : KECEPE MADRAS — 89441/4 |
| | Sugar Factory | : KECEPE VUYYURU — 64&73 |
| | Distillery | : KECEPE VUYYURU — 118 |
| | Branch Office | : KECEPE VIJAYAWADA — 76015 |
| | Cement factory | : KECEPE MACHERLA — 1 and 4 |
| | Central Workshops | : KECEPE MADRAS-19-552201 |

Telex : 041-375 CENTRAL WORKSHOPS, MADRAS
0475-289 SUGAR FACTORY & DISTILLERY, VUYYURU.